# శ్రీ మహారాజ విక్రమదేవవర్మ రచనలు.



ప్రకాశకుఁడు,

తలిసెట్టి రామారావు, బి: ఏ: బి: ఎల్:,

మానేజరు, హుజూరు ఆఫీసు,

జయపురము.



విశాఖపట్టణము:

శ్రీశారదామకుటం ముద్రణాలయమునందు

ముద్రితములు.

౧౯౪౦.

# పీఠిక.



శ్రీజయపురాధీశులును సాహిత్యసామ్రాజ్య మహారాజోపాధియుతులు నగు శ్రీ శ్రీ శ్రీ విక్రమదేవవర్మ, డి: లిట్: వారు సంస్కృతోత్కళాంధ్రములందు విరచించి ప్రకటించినపుస్తకములు ప్రసిద్ధములు. అవిగాక, శ్రీవా రప్పుడప్పుడు రచించినఖండకవితలును గాథలు నుపన్యాసములును మంతవ్యములు నుత్కళాంధ్రపత్రికలయందుఁ బ్రకటితము లయి యున్నవి. నిజరచనలను లిఖించి పత్రికలకుఁ బంపించుటయె శ్రీవారి కలవాటు; కాని- తన్మాతృకలను దమయొద్ద నుంచునలవాటు వారికి లేదు. పత్రికాప్రకటితము లయిన శ్రీవారిరచన లమూల్యములనియు లోకోపకారకములనియు నుద్దేశించి యాంధ్రపత్రికలయందుఁ బ్రకటింపంబడినవానిని సంపాదించి యొకపుస్తకాకారముగాఁ బ్రకటింపనెంచి ప్రాచీనపత్రికలకై నెమకఁగా నాంధ్రవిశ్వవిద్యాలయపుస్తకాగారమునుండి కొన్నిపత్రికలు నాకు లభించెను. మఱియును శ్రీవారు రచించి స్వహస్తముతోడ లిఖియించినపంక్తులు గలకాగితపుముక్కలలోఁ గొన్ని జయపురసౌధమునందు నాకు దొరకెను. నాకు లబ్ధము లయినవాని నైనను, బ్రకటించుట యుక్తమని తలంచి వాని నీపుస్తకాకారముగాఁ బ్రకటించితిని. శ్రీవారిరచనలలో మఱి కొన్ని నాకు జిక్కినేని, వానిని ద్వితీయవారప్రకటనమునందుఁ జేర్చుకోర్కి గలదు. నా యుద్దేశ మెంతవఱకు సమంజసమో, దానిని నిర్ణయించువారు పండితులు.

నాకుఁ బ్రాచీనపత్రికలను జదువ నిచ్చినయాంధ్రవిశ్వవిద్యాలయపుస్తకాగారాధికారులు నాస్తుతిపాత్రులు.

జయపురము,
౨౦-౫-౧౯౪౦.

ఇట్లు,
విబుధవిధేయుఁడు,
తలిసెట్టి రామరావు.



# విషయసూచిక



విషయము.

శ్రీ

# మహారాజ విక్రమదేవవర్మ

## రచనలు.

శ్లోకాః.

హే శ్రీదాశరథే కృపాజలనిధే హేదాసచింతామణే
హే దైత్యాంబుభవావళీమదకరిన్ హేసింధుగర్వాంతక
హేసీతాక్షిచకోరశారదవిధో హేమానిచింత్యాకృతే
హే ఘోరాఘతమోవినాశతరణే హేరామ! తుభ్యంనమః॥ ౧

రాధికాముఖకంజభాస్కర రామసోదర పాహిమాం
భక్తహృజ్జలజాతమందిర భవ్యసుందర పాహిమాం
గోపికావసనాళితస్కర గోష్ఠసంచర పాహిమాం
పూతచిత్రచరిత్రభాస్వర పూతనాహర పాహిమాం॥ ౨

శార్వరీవరమండలానన శాంతికేతన పాహిమాం
పంకసంభవపత్త్రలోచన పంకమోచన పాహిమాం
రాసమండలమధ్యశోభన రాణభూషణ పాహిమాం
దారుణాసురవైరిసూదన దాసపాలన పాహిమాం॥ ౩

కంజజాదిసుపర్వరక్షక కష్టహారక పాహిమాం
గోపదర్పవిలోపకారక గోపబాలక పాహిమాం
గోపికేక్షణమోదదాయక గోత్రధారక పాహిమాం
ఘోరసంసృతిసింధుతారక ఘోరహర్షక పాహిమాం॥ ౪

శ్రీరాధేశం శ్రితసురకుజం శ్రీకరం రాసలోలం
నీరేజాక్షం నిగమవినుతం నిష్కళంకం ముకుందం
భావాతీతం భవభయహరం భాజితాంభోదవర్ణం
వందే కృష్ణం వనజవదనం వల్లవీచిత్తచోరం॥ ౫

కేశవః పాతు మాం శేష లోకేశోమేశవందితః।
కమలేశో హృషీకేశో వారణస్యార్తివారణః॥ ౬

నారాయణం ధరాకాంతం నారసింహం మురాంతకం
క్షీరాబ్ధిజావరం వందే మారతాతం పరాత్పరం॥ ౭

హేరంబాయైకదంతాయ పార్వతీప్రియసూనవే
గజాస్యాయ గణేశాయ విఘ్నరాజాయ తే నమః॥ ౮

బ్రాహ్మీం జ్ఞానప్రదాం వాణీం శ్వేతవర్ణాం సరస్వతీం
నమామి భారతీం భాషాం హంసవాహనగాం గిరాం॥ ౯

రమే లక్ష్మి మహాదేవి కమలే కేశవప్రియే
క్షీరాబ్ధిజే జగద్ధాత్రి పద్మాగారే నమోస్తు తే॥ ౧౦

దుర్గాం దుర్గతినాశినీం భగవతీం దైత్యాన్వయధ్వంసినీ
మీశా మీశముదాకరీం శుభకరీం కైలాసశైలేశ్వరీం
అంబా మంబురుహేక్షణాం గిరిసుతాం బ్రహ్మాదిదేవార్చితా
మార్యా మార్యజనాళిసన్నుతపదాం వందే శివాం చండికాం॥ ౧౧

సంసృత్యపారజలధే స్తరణైకపోతౌ
పాపాంధకారపటలీదివసాధినాథౌ
భక్తాళినిత్యసుఖకైరవమండసోమౌ
చైతన్యదేవచరణౌ శరణం ప్రపద్యే॥ ౧౨

శృంగారం ఖలు రాధికావిహరణే వీరం వృషాబంధనే
కారుణ్యం సుజనావనేఽద్భుతరసం గోవర్ధనోత్తోలనే
హాస్యం రుక్మిపరాభవే భయకరం బీభత్స మభ్యాగమే
రౌద్రం రాక్షసమర్దనే మునిగణే శాంతంవపుః పాతునః॥ ౧౩

శృంగారం ధరణీసుతావిహరణే వీరం ధనుర్భంజనే
కారుణ్యాం రవిజావనేఽద్భుతరసం సింధౌ పథఃకల్పనే
హాస్యం ఛత్రివిఖండనే భయకరం బీభత్స మభ్యాగమే
రౌద్రిం రావణమారణే ద్విజగణే శాంతంవపుః పాతునః॥ ౧౪

జయ జయ శంకర శశధర శేఖర జయ సకలేశ్వర శమనపర
జయ గిరిజాముఖసరసిజషట్పద జయ సురసేవితచరణకజ
జయ జయ పావకశశితపనేక్షణ జయ ఫణిభూషణ జగదవన
జయ విశదాంబరసమసుకళేబర జయ మునిసన్నుత సమదహర॥ ౧౫

సంసారపాశబద్ధానాం ప్రాణినా మతిదుఃఖినాం
ముకుందనామవర్ణాళిస్మరణం ముక్తిసాధనం॥ ౧౬

---

శ్రీ

# రాధికాకృష్ణస్తోత్రప్రారంభః

శ్లో॥ శ్రీగోలోకాధికారిణ్యై రాధికాయై నమోనమః
శ్రీగోలోకనివాసాయ శ్రీకృష్ణాయనమోనమః॥ ౧

జగత్కారణకారిణ్యై రాధికాయై నమోనమః
జగదుత్పత్తిబీజాయ శ్రీకృష్ణాయ నమోనమః॥ ౨

సర్వామరనుతాఖ్యాయై రాధికాయై నమోనమః
యోగిజేగీయమానాయ శ్రీకృష్ణాయ నమోనమః॥ ౩

వృషభాను తనూజాయై రాధికాయై నమోనమః
నందగోపాలపుత్రాయ శ్రీకృష్ణాయ నమోనమః॥ ౪

దివ్యజాంబూనదాభాయై రాధికాయై నమోనమః
దేవరాణ్ణీలవర్ణాయ శ్రీకృష్ణాయ నమోనమః॥ ౫

రాకాశీతకరాస్యాయై రాధికాయై నమోనమః
జితపూర్ణేందు వక్త్రాయ శ్రీకృష్ణాయ నమోనమః॥ ౬

నవేందీవర నేత్రాయై రాధికాయై నమోనమః
శుక్లవర్ణాంబుజాక్షాయ శ్రీకృష్ణాయ నమోనమః॥ ౭

జితపల్లవపాదాయై రాధికాయై నమోనమః
రక్తాంభోజ పదపాదాయ శ్రీకృష్ణాయ నమోనమః॥ ౮

నానాలంకారయుక్తాయై రాధికాయై నమోనమః
కౌస్తుభాభరణాప్తాయ శ్రీకృష్ణాయ నమోనమః ౯

శ్యామలాంబరధారిణ్యై రాధికాయై నమోనమః
శుద్ధకాంచనచేలాయ శ్రీకృష్ణాయ నమోనమః॥ ౧౦

రాసమండలసంస్థాయై రాధికాయై నమోనమః
రాసక్రీడావినోదాయ శ్రీకృష్ణాయ నమోనమః ౧౧

బృందారణ్యావిహారిణ్యై రాధికాయై నమోనమః
బృందావన విహారాయ శ్రీకృష్ణాయ నమోనమః॥ ౧౨

కృష్ణవామదిశాస్థాయై రాధికాయై నమోనమః
రాధాలింగితదేహాయ శ్రీకృష్ణాయ నమోనమః॥ ౧౩

భక్తకామ్యార్థదాయిన్యై రాధికాయై నమోనమః
దాససందోహకల్పాయ శ్రీకృష్ణాయ నమోనమః॥ ౧౪

హరేర్మానసమోహిన్యై రాధికాయై నమోనమః
రాధికాచిత్తచోరాయ శ్రీకృష్ణాయ నమోనమః॥ ౧౫

దయాపూరిత చిత్తాయై రాధికాయై నమోనమః,
కృపాపూర్ణహృదబ్జాయ శ్రీకృష్ణాయ నమోనమః ౧౬

రాధికాకృష్ణయోస్తోత్ర మిదంపాపప్రణాశకం
భక్తిముక్తిప్రదంప్రోక్తం విక్రమేశ్వరవర్మణా॥ ౧౭

ఇతి శ్రీరాధికాకృష్ణస్తోత్రం సంపూర్ణమ్.

శ్రీ

# వాసుదేవస్తోత్రమ్



ఓంకారాకృతియుక్తాయ హరయే పరమాత్మనే।
మహామీనశరీరాయ వాసుదేవాయ తే నమః॥ ౧

నలినాక్షాయ నిత్యాయ నిర్వికారాయ వేధసే।
ధృతగోత్రాయ కూర్మాయ వాసుదేవాయ తే నమః॥ ౨

మోక్షదాయ విశుద్ధాయ మహాభూదారరూపిణే।
హిరణ్యాక్షవినాశాయ వాసుదేవాయ తే నమః॥ ౩

భవపూజితపాదాయ ప్రహ్లాదావనకారిణే॥
నరకేశరిరూపాయ వాసుదేవాయ తే నమః॥ ౪

గదాబ్జాబ్జారిహస్తాయ వామనాకృతిధారిణే।
బలిదర్పవిభంగాయ వాసుదేవాయ తే నమః॥ ౫

వస్త్రనిందితరుక్మాయ వనమాలాప్తవక్షసే॥
భృగువంశప్రదీపాయ వాసుదేవాయ తే నమః॥ ౬

తేజోనిర్జితసూర్యాయ సీతాచిత్తాపహారిణే॥
మానిధ్యేయాయ రామాయ వాసుదేవాయ తే నమః॥ ౭

వారణేశప్రియాలాయ ముసలాయుధపాణయే।
బ్రహ్మణే బలరామాయ వాసుదేవాయ తే నమః॥ ౮

సురజేగీయమానాయ సామగానవినోదినే।
నిరాఖ్యాతాయ బుద్ధాయ వాసుదేవాయ తే నమః॥ ౯

దేవారిభమృగేంద్రాయ హృషీకేశాయ కల్కయే
కల్మషాంబుదవాతాయ వాసుదేవాయ తే నమః॥ ౧౦

వాసవస్మయనాశాయ హయగ్రీవాయ మాయినే।
నారాయణాయ సత్యాయ వాసుదేవాయ తే నమః॥ ౧౧

యజ్ఞేశాయ రమేశాయ మోహినీరూపధారిణే
గోవిందాయ పరేశాయ వాసుదేవాయ తే నమః॥ ౧౨

స్తోత్రం శ్రీవాసుదేవస్య దుర్లభా దపి దుర్లభం।
చతుర్వర్గప్రదం ప్రోక్తం విక్రమేశ్వరవర్మణా॥
ఇతి శ్రీవాసుదేవస్తోత్రం సంపూర్ణమ్.

---

సీ॥ ఎవ్వనిపదమందు నింపుగం బుట్టుటన్
గంగపావనియను ఖ్యాతిఁగాంచె
నెవ్వనిచరణంబు హృష్టుఁడై తలఁదాల్చి
బలి భావిదేవేశపదవిఁబొందె
నెవ్వనిపాదం బొకింత తాఁకుటచేత
దండకారణ్యముదివ్య తనువుఁబడసె
నెవ్వనిపదధూళి యించుకసోఁకుటం
బాషాణ మందమా పడతియయ్యె॥
నట్టిత్రిభువనాంతర్వర్తి యఖిలదేవ
చక్రవర్తియా శ్రీరామచంద్రమూర్తి
తనదు పాదరజంబు చేత మదీయ
పాపములఁబాపి నన్నుఁ గాపాడుఁగాక॥

## కవి జన్మకుండలి.

గీ॥ అజములగ్నమచ్చోటనే యమరగురుఁడు
యుగ్మమున రవి బుధ శుక్రులొప్పుచుండఁ
గర్కి-రాహువు కుజుఁడు సింగంబునందు
వృశ్చికంబున శని కర్మగృహమునందుఁ
జంద్రకేతువులుండంగఁ జంద్రనంద
శైల శశి శాలివాహనశకసమఁ దగు
మిథునమాసేషుశశిదినమిళితశుక్ల
పక్షశుక్రమాసాపరపక్షమందుఁ
జవితి నినవారమున ధనిష్ఠాద్వితీయ
పాదమున విక్రమేశ్వరవర్మవాఁడమెఁ
గుజదశాశేషమగు నాలుగు సమలైదు
నెలలు నిరువదియేడు నాళులుగణింప॥

28-6-1869

| | | | |
|---|---|---|---|
| ర బుశు | గుల | | |
| రా | | | చ కే |
| కు | | | శ |

శా॥శ ౧౭౯౧ శుక్ల సం॥
జ్యేష్ఠ బ౮ ఆదివారము.

క॥ కాలము దీర్ఘము; దేశము
గ్రాలెడు చతురస్రమగును; ద్రవ్యము ఘనమౌ
నీలయశ్శీలచరాచర
మూలమునకు నాల్గుపార్శ్వములు బుధులారా॥

క॥ ధరధర సురపరమదహర
నరవర శశధరవదన కనకవసన రమా
వర పరమపురుష భవహర
దరధర మదనమదహరనుతపదవనరుహా॥

శ్లో॥ మరీచిశ్చవశిష్ఠశ్చ తథైవాంగిరసోమునిః
అత్రిఃక్రమేణపూర్వాద్యాః పులస్త్యః పులహఃక్రతుః
శ్లో॥ రుక్మిణీలక్ష్మణాభద్రా సత్యాజాంబవతీనజా
సుదంతామిత్రవిందాచ మహిష్యోద్వారకాపతేః॥

శ్లో॥ శృంగారవీరకరుణాహాస్యరౌద్రభయానక
బీభత్సాద్భుతశాంతాశ్చ రసాఏతే నవస్మృతాః॥
తే॥ గీ॥ మగనితలవాకిట మెలంగు మానవతియు
మగనిసామేను పాల్గొన్న మాన్యచరిత
మగనిరొమ్మున వసియించుమగువ మిమ్ముఁ
గాచుదురు తెలివిఁబలిమి కలుములొసఁగి॥

## పురీక్షేత్రతత్త్వము.

చ॥ అలరసుభద్రబ్రహ్మగ మహాహలి హాలహాలాశనుండుగా
నలపురుషోత్తముండు కమలాక్షుఁడుఁగాను ద్రిమూర్తులావలన్
జెలువుగ వాణియున్విమల శ్రీయుఁద్రిశక్తులుగాఁగ దోఁచుటన్
సులలితభక్తిచేఁ బురిని సొంపుగఁగొల్తుము నిత్యమాత్మలోన్॥

## సింహాచలక్షేత్రతత్త్వము.

గీ॥ భర్గలింగంబుఁ జూడని వైష్ణవులకు
లింగమే బ్రహ్మమనుశైవపుంగవులకుఁ
దెలివిఁగలిగింప సింహాద్రి వెలసి లింగ
తను దదంతర్గతాకృతిఁ దనరు నృహరి॥

## సుధాకర తత్త్వము.

ఆ॥ వె॥ సుధయన నమృతంబు సున్నంబునౌ సుధా
కరుఁడనంగ ధవళకిరణుఁడ సుమి
సుధకిరవను సుద్ది సూరికల్పిత మౌగు
నమృతమునకు వసతి యగునె గృహము॥

## దశకంఠరావణతత్త్వము.

సీ॥ పదుగురిగొంతుల పగిది ధ్వనించుటఁ
దశకంఠరావణనామ మబ్బె
సగము పేరునుగూడ జగమున వాడుటఁ
దశకంఠయని రావణా యనుచును
బిలువంబడుచునుండ దశకంఠపర్యాయ
ములగు గ్రీవాకంఠగళములు వేరెఁ
శిరవాతఁ బదితల లిరువదిచేతులు
కల్పించినాఁడాది కవివరుండు॥
కానిచోఁ బాదయుగమంత కాయభరము
మోయఁగల్గెనె? యటువంటి బూచిఁగనిన
జనని మరి మఱిపిల్లలంగనెనె? జగతి
నట్టివఁడు జనించిన నప్పుడ గిట్టుకున్న?

క॥ హరియను రెండక్షరములు
హరియించెను నంతపాటి యఘసంచయమున్
నరులాచరింపఁగలరే?
హరినామము వెలయఁ బాపు లడలఁగనేలా?॥

---

## అధీరధీరగతులు.

ఆ॥ వె॥ ఇంచుకంత దెలియు నీలోకభవులె యు
ద్దేశమింతలేక దేనిఁజేయ
రిట్టులుండఁజేయునే? యెట్టిపని నను
ద్దిష్టుఁడగుచు నన్ని దెలియువిభుఁడు॥

---

తే॥ గీ॥ ఒకొకమనుజుని సృజియింప నొకొకలక్ష్య
ముండుఁగద యహంకృతి నధీనుండు దానిఁ

తెలియకలే కొన్నియో మార్గములను ద్రొక్కి
చేయవలసినదానిని జేయలేక
పొందవలసినచోటును బొందలేక
చచ్చుచొదవుచు సంసార చక్రమందు
భ్రమణమొందుచు దుఃఖాంబురాశి మునిగి
తేలెడు విధాన మారయఁ జాలఁ డహహ
బుధుఁ డహంభావమును బాసి విధిగఁ జేయఁ
దగు పనులస్వార్థరాహిత్యముగ నొనర్చు
చీశసక్తుఁడై ఘోరసంసృతిని మీఱి
శాశ్వతానందమయ మగు స్థానమొందు॥

---

## సీసమాలిక.

సీ॥ భారతదేశంబు పరదేశములతోడఁ
దులఁదూగివెలుఁగొంద వలయు ననిన
నబలలు లోక్యవిద్యావంతులగుటయే
తగువిధానమని కొందఱమతంబు
తరుణులకెల్ల స్వాతంత్ర్యమొసఁగుటే
తగువిధానమని కొందఱమతంబు
విధవలకుంబూని పెండ్లిండ్లు సేయుటే
తగువిధానమని కొందఱమతంబు
బాల్యవివాహంబుఁ వడిరూపుమాపుటే
తగువిధానమని కొందఱమతంబు
వివిధమతకులుల పెండ్లిండ్లుజరుగుటే
తగువిధానమని కొందఱమతంబు
అందఱునొకచోట నారగించుట సుమ్మి
తగువిధానమని కొందఱమతంబు

పరిజలందఱును నేత బట్టలం గట్టుచే
తగువిధానమని కొందఱమతంబు
పరదేశవస్తువుల్ వాడకుండుట సుమీ
తగువిధానమని కొందఱమతంబు
ప్రాఁతపద్ధతులను బాటింపకుండుటే
తగువిధానమని కొందఱమతంబు
కొత్తసంఘంబుల గూర్చుటె నిజముగా
తగువిధానమని కొందఱమతంబు
పెద్ద పిన్నయనెడి భేదశూన్యంబు సూ
తగువిధానమని కొందఱమతంబు

గీ॥ ఎన్న భారతదేశాభి వృద్ధికొఱకు
వలసెడివిధానములఁ దగఁ దెలియనట్టి
జనులమస్తిష్కసంభవా శ్చర్యకరము
తంబు లివి యని యింకఁ గొందఱమతంబు॥

---

చ॥ ఎనుబదినాల్గుకోటులకు హీనముగాని విచిత్రవేషముల్
గనుఁగొనసీవు నీయెదుటఁ గాదె ధరించితి నయ్య నీవుత్సృ
ష్టిని గడునొంది తేని మదభీష్టవరంబు నొసంగు, కానిచో
ననుచుము వేషము ల్విడువుమా యిఁక నీ వని కృష్ణ కేశవా!॥

గీ॥ పరఁగఁ దాల్చితి నెనుబదినాల్గుకోటుల
భూమికలనుసీదు మోలఁదుష్టిఁ
గంటివేని నాదు కామితవర మిమ్ము
కనకయున్నఁ జాలు ననుము కృష్ణ!॥

గీ॥ పొడుచు రేఁడు గెంజాయ నడుమనుండి
యలచకోరములకు వేడ్క నలుపురీతిఁ
గావి చెంగునడుమ నున్న గరిత మోము
పొందుగా నాదు కనులకు విందుఁ జేసె॥

క॥ అండభవయానా నాకడ
నుండినచో రాత్రిఁద్రోఁచు నొకనిముసంబై
యండభవయాననాకడ
నుండసచో రాత్రిగ్రోఁచుయుగమై యకటా!॥

అనువాదము.

ఉ॥ పీఁదినినీవు నాదుఘన వేణినిలాగెదవేమి ధూర్తుఁడా?
నాదుమనంబు నీదగు ఘనస్తనముల్ హరియించిఁ వృటన్
సాదులబాధపెట్టెదవె జంకక దోషుల మానిచెల్వుఁడా?
మోదినిధాత్రి దుష్టగుణముల్గలవారు ప్రపీడుతుల్సుమీ॥

శ్లో॥ ఉద్యమేనహి కార్యాణి సిద్ధ్యంతి నమనోరథైః
నహిసుప్తస్యసింహస్య ప్రవిశంతిముఖేమృగాః॥

అనువాదము.

క॥ పనులౌను బ్రయత్నముచే
తన కావవి బహుమనోరథము లున్నంతన్
దనగుహ నిద్రించినహరి
ఘనముఖమునఁ జొచ్చునే మృగప్రకరమెటన్?

శ్లో॥ ఆశాయాదాసాయే దాసాస్తేసర్వలోకస్య
ఆశాయేషాం దాసీ తేషాం దాసాయతే లోకః॥

అనువాదము.

కం॥ ఆసకుదాసుండెవ్వఁడో
దాసుఁడగునతండు సర్వ ధాత్రీచరులకున్
ఆసయెవనికిం దాసియొ
దాసులగుదు రెల్లజనులు తథ్యమతనికిన్॥

సమస్య:—అగ్నికి శైత్యముండు టెట్టైనను వింటివె? రాజచంద్రమా.

ఉ॥ దిగ్నిచయంబు మాఱునె; పతివ్రత జారిణియౌనె; మంజుల
స్రగ్నిచయంబువాడక విరాజిలునే సతతంబు; తెన్నగా
న్యాగ్నియమంబుగల్గు బుధనాథు లసత్యముఁ బల్కనేర్తురే
అగ్నికి శైత్యముండు టెట నైనను వింటివె? రాజచంద్రమా!

---

సమస్య:—అంధుడు గ్రంథముఁబఠించినటులె నరేంద్రా!

కం॥ బంధువు పేద్దనుఁ బెంచుట
బంధురమగుమైత్రియేక వంశజనన సం
బంధులకుండుట దలఁపగ
నంధుడు గ్రంథముఁబఠించినటులె నరేంద్రా!

---

సమస్య:—గోరిటపై నిలిచి పూలుగోయందొడగెన్.

కం॥ గోఁరిటపై వ్రేలెడుకొమఁ
బూరుషుడొక డెక్కిపోగడ పూవులుగోయన్
దారకుఁడొకఁ డది గని యనె
గోరిటపై నిలిచి పూలు గోయందొడగెన్॥

---

గీ॥ నరుఁడునిజనేత్రములతోడఁ
బరునిలోటుఁజూచెడినిగాని తనలోటుఁజూడ లేఁడు
తనదులోటునుదానెప్డు గనఁగలండొ
యపుడు సుజ్ఞానియనునాఖ్య నందుగాదె?

---

## రాజధర్మము.

గీ॥ రాజునిజదేశమునకును బ్రజలకుదార
ననుచుఁ దలపక తన్ను శ్రీహరిజనులకు

సేవఁజేయుటకొఱకే సృజించె నంచు
నెంచి విఱ్ఱవీగక సంచరించు టొప్పు॥

గీ॥ పరిజనులుశ్రమపడి యార్జించి భక్తిఁదనకు
నిచ్చినధనంబువారికై వెచ్చపెట్ట
కాత్మభోగాళి కొఱకును ఖ్యాతికొఱకు
వమ్ముసేయుట దగునె? నృపాలకులకు॥

ఆ॥ వె॥ తనదుపరిజనులు వెతలఁ గనుచుండవారిని
దలపకన్యదేశములకు నేగి
సామి యలరదగునె? జనులరంజింపని
వాని నృపుఁడనంగఁ బాడి యగునె?

గీ॥ పరిజనసుఖదుఃఖములు ధరావరుఁడు దనవి
గాఁ దలంచుచు నీతిమార్గమునఁ జనుచు
సజ్జనుల గౌరవించుచు స్వార్యమువదక
పరమపురుషుని భక్తిచేఁ బరఁగవలయు॥

---

గీ॥ తనకునప్రియగలుగుతఱి నాయమునుగోరు
నరుఁడు దాను బరులనప్రియ సేయు
నప్పు డల్ల నాయమావంతయుఁ దలంపఁ
డాదరింపఁ బడఁడు న్యాయమిట్లు॥

క॥ కామాదులచే గలిగెడు
నామోదం బగును గేవలాభాసము నూ
దామోదర సేవాజా
తామోదంబే ప్రమోద మగును దలంపన్॥

# రావణోపదేశము.



సీ॥ బ్రహ్మమార్గణ విద్ధుఁడై రావణుండు
పడుటఁగనుఁగొని శ్రీరామ భద్రుఁడనుజుఁ
జేరఁజీరి యిట్లనె నీవు శీఘ్రముగను
రావణుని చెంతకేగి యా రాజవర్యు
నడుగు మేలిక నెట్టన యాచరింప
వలయు కర్తవ్యముల; నతండు పలుశతాబ్ద
ములు ధరాదేవిఁ బాలించెఁ బోలుపుగాను
గాన నతఁ డిఁక కర్తవ్య కార్యములను
జెప్పఁగలవాఁడు కటకటా యిప్పుడమృతి
నొందు నాతండు మరణంబుఁ జెందు నేని
నిల నృపతిధర్మమర్మంబుఁ దెలియకుండుఁ
గనుకఁ దడయక వేవేగఁ జను మనంగ
రావణుని జేరఁగా సుమిత్రాసుతుండు
దనుజపతి భక్తి మీఱ నాతనికి మ్రొక్కి
నేను ధన్యుండనిప్పుడు నిన్నుఁ గనుట
ననఁగ సౌమిత్రి యిట్లనె దనుజనాథ!
యీవు సర్వదా ధన్యుండవే యగుదువు
ఱేనికర్తవ్యకర్మముల్ పూనినీదు
వదనమున వినఁబంపె నా భ్రాత నన్నుఁ
గానఁ గృపతోడ వివరించి వానిఁ దెలుపు
మనిన నిట్టూర్చి రావణుం డనియె నిట్లు:—
రాముఁ డఖిలేశ్వరుఁడు సర్వజ్ఞుఁ డగుట
నతనికిం దెలియని విధు లవనిఁగలవె?
నా యెడంగల ప్రేమచే నన్ను నడుగ
నతఁడు నిన్నంపెఁగాక యో యతులశౌర్య!

ఏలికఁ యొనర్చు చేఁత లనేకములగు
వానినన్నింటి నిపుడు చెప్పంగఁజాల
నపుడె నాలుగుప్రాణంబు లంతరించెఁ
గాన నొకదానినే చెప్పఁగలను వినుము -
నీరు మూఁడుభాగంబులు నేల యొక్క
భాగ ముండుట జగమునఁ బాడి గాదెఁ
గడలి మూఁడవపాలగు జడము నార్ప
నరకబాధలఁ బ్రాణులు వారయకుండ
శమనపురనరకాళి నాశంబు సేయ
మఱియు నిర్జరపురికి నందఱును సుకర
ముగఁ జనం దృఢసోపానముల ఘటింప
నిశ్చయించితిఁగాని వానినెఱవేర్ప
కేను గాలంబును గడపి మృతినిబొందు
చున్నవాఁడను గావున నొడయుఁడెంచు
పనుల సత్వరంబె చేయ వలయుఁజుమ్మి,
యనుచు నింతవట్టు వచింప నంత నతని
ప్రాణమేగె దివికిఁ గళేబరముఁబాసి॥

---

గీ॥ ఎచటనుండి వచ్చితి నెటకేగెద నని
తలపఁదలపంగఁ బరమాత్మ తెలియఁబడును
ఎవఁడ నే నని తర్కింప హృదయమందుఁ
దెలియఁబడియెడు జీవాత్మ దెల్లముగను॥

గీ॥ బాహ్యరూపంబుఁ గనిభ్రమపడక లోని
సారమునెఱింగి మనుజులఁ జేరఁదగును
మిసిమిగల్గు ముసిఁడిపండు మెసవ రెవరుఁ
దినెద రింపుగ ముండ్లున్న పనసపండు॥

—కవిత—.

గీ॥ భావములఁ బ్రకటింపనే భాష వెలసె.
మృగవిహగముల భావముల్ మితము లగుట
వానిభాషలు మితములై వఱలుచుండు
పెక్కుకోలములు భావముల్ వెలయుకతన
జనులభాషలు పెక్కులై తనరుచుండు.
భాష లెప్పుడును వర్ణసంబద్ధము; లగు;
భావములు బద్ధములుగాక ప్రబలుచుండు.
భావమను మంజువల్లరి పల్లవింప
జనులలోఁగవిహృదయంబె యొనరుచోటు.
భావ మొప్పుగ భాసిల్లు పద్య మేని
గద్య మేనిఁ గవితయను ఖ్యాతి గాంచు.
నద్దిలేనిది వికృతను మ్మర్త్యులార!

చ॥ పరిణయకాలమందు నతివాంఛ నిజేశు ముఖంబు లజ్జఁ ద
చ్చరణయుగంబు నీలకువ సామ్యముఁ దాల్చెడు చారుదృష్టులం
బొరిఁ బొరిఁ గాంచుచు న్మగనిపొల్పగుచాయను బెం పొనర్చు నా
ధరణికుమారి నేత్రములు దద్దయుఁబ్రోచుత మమ్మునెప్పుడున్॥

నిశాంగన.

తే॥ గీ॥ చంద్రకాంతుని బొంద న్నిశా చిరంటి
యల యరుంధతి యను ముత్తియమ్ముతోడఁ
జనువశిష్ఠాఖ్య మగు బులాకిని విశాఖ
యనెడు మౌక్తికదామంబు నార్ద్ర యనెడు
చెందిరముబొట్టు ధ్రువకుంభనందను లను
నమల వజ్రాలతమ్మంట్లు యభ్రగంగ
యనెడు తెల్లనిపట్టుచీరను ధరించి
తనరు రసికాళి సంతోష దాత్రి యగుచు॥

గీ॥ పుట్టునిరుపేద యంతగాఁ బాగులేఁడు సుమీ
ధని దరిద్రతఁ గనుసేని దద్దఁబాగులు
నెంచ జన్మాంధుఁడు లభింపఁ డెచ్చువంత
నూతనాంధుండు గనువంత నుడువ నగునె॥

## వింతలెక్క—ప్రశ్నము.

సీ॥ ఒకఁడు త్రిమూర్తుల కొనఁగఁగొన్ని సుమాలు
గోసి ముంపఁగ నొక కొలనునందు
నది యయ్యె రెండింత లందుఁ గొన్నింటిని
బొమ్మకు నిడి శేషపుష్పములను
దిరుగ నీటను ముంప ద్విగుణంబుఁగాగ బ్ర
హ్మకు నిచ్చి నన్నియే హరునకిచ్చి
శేషసుమంబులఁ జెఱువున ముంపఁగా
రెండింతలయి యవ్వి నృహరి కిడిన॥

గీ॥ పువులతో సరిగాఁగ నాపూల లచ్చి
కిచ్చి రిక్తహస్తుం డయి యింటి కేగె
నతఁడు గోసిన పూలసంఖ్యను వచింప
నేడుదినములు గడవు మీ కిచ్చినాఁడ॥

## ఉత్తరము:—

గీ॥ కోసినట్టి పువ్వులలెక్క వాసియేడు
దానిద్విగుణంబు మఱియును దానిద్విగుణ
మిట్టులెన్నెన్ని ద్విగుణము లెన్నఁ నగును
సిద్ధమందార, గోపికా చిత్తచోర!

## లెక్క—ప్రశ్నము.

క॥ నలువదిసేరుల భారము
గల నాలుగుగుండ్లతో నొకం డొకమాఱే
నలువదిసేరుల వఱకును
వలయుసరకుఁ దూఁచు గుండ్ల పరిమితు లెంతో?

## ఉ త్త ర ము.

గీ॥ సేరు మూడు సేర్లు స్థిరముగాఁ దొమ్మిదె
సేరు లిరువ దేడు సేరు లాత్మ
నెన్న నాల్గుగుఱ్ఱ మొత్తు క్రమంబుగా
జానకీముఖాంబుజాతసూర!

సీ॥ ఒకచేతబంగారు నొకచేత వెండిని
బూనుచువచ్చిన మానవునకు
సరిసంఖ్యపై నిడికిఁ జన బేసివెండికి
గ ఋతులుగానుంచు కొమ్మనియును
గుడిచేతిదానిని గుదురుగా సరిసంఖ్యఁ
బెరచేతిదానిని బేసిసంఖ్య
చే గుణకము సేసి బాగుగా నారెండు
మొత్తంబులను నొక్క మొత్తముగను

గీ॥ జేసి యాయంకె సీతోడఁ జెప్పుమనియు
నడుగు మాతండు సెప్పినయంకె బేసి
యైనచో దక్షిణకరంబులోను బైడి
సరిగనుండిన వెండియం చరసి పలుకు॥

| | | | |
|---|---|---|---|
| ౭ | ౯ | ౪ | ౧౪ |
| ౨ | ౧౬ | ౫ | ౧౧ |
| ౧౩ | ౩ | ౧౦ | ౮ |
| ౧౨ | ౬ | ౧౫ | ౧ |

గిరి ర్బ్రహ్మాంబుధిర్లోకః
నేత్రం భూప శ్శర శ్శివః

త్రియోదశ స్త్రి ది జ్ఞాగః
సూర్యోరసస్తిథిశ్శశీ॥

శ్లో॥ దశబిందుశ్శశికుంభీ బాణోవేదోవియచ్ఛివః
శూన్యంరత్నం మునిర్నేత్రం వహ్నిరంగం రవిర్నభః

గీ॥ పదియుఁబూర్ణంబు నొక్కటి వడి నెనిమిది
పంచకము నాల్గు బిందువుఁ బదునొకండు
శూన్యమును దొమ్మిదియు నేడు సారిది రెండు
మూడు నాఱును బండ్రెండుఁ బొసఁగసున్న॥

లెక్క.

సీ॥ అడిగినయంకాళి నరచేసి దాన నొ
క్కటి దీసి రెండవగదిని నిలిపి
దాన నేడు డిపి మొదటమూడు దీసి యే
డింట నాలుగుదీసి యెనిమిదింట
నొక్కండు పోనిడి యొప్పుగాఁ దొమ్మిది
నాఱుఁబోఁగొట్టి పదవగృహమున
నైదుఁబాపుచు బదునైదవయింట రెం
డెడపి పదారవయింటనుంచి
మూడవగది రెండుఁ బొరినాలుగవయింట
నేడు నైదింట నా ఱెసఁగ షష్ఠ
భవనమునను మూడుఁ బదునొకండవయింట
నెనిమిదిఁ బదిరెంట నెలమి నొకటి॥

గీ॥ పదియుమూడింట నాలుగు పదియునాలు
గవ గృహంబున నైదును గడఁగి నిలుప
నిచ్చయించిన మొత్త మా నెటుగలిపిన
గోపకామినీనేత్రచకోరచంద్ర!

సీ॥ అతిపూతమూర్తికి నభిషేక మేలొకో?
దిగ్వాసునకు నేల దివ్యపటము
యజ్ఞనాశకునకు యజ్ఞసూత్రం బేల?
నగలేల? భిక్షుకునకుఁ దలఁప
భస్మలేపున కేల? పరిమళగంధంబు
వ్యోమకేశుని కేల? పుష్పచయము
కాటిజేనికి ధూపమేటికి? భావింప
నినవహ్నిశశిదృష్టి కేల దివ్వె
గరళభక్షకునకు నిష్టఖాద్యమేల?
కానఁ బూజాపదార్థ సంగ్రహణ వాంఛ
మాని నిజచిత్తకంజ మీశానపాద
యుగమునందు నర్పింపుఁడో యోగులార!

ఆ॥ వె॥ అర్ధఘటిక దలఁప నంతర్దశాదిన
మునకు మూఁడు దినము లౌనర నేఁటి
కగు ఘ్రివంబు దానిని గుణింప నిష్టద
శాబ్దసంఖ్యచేత నగును విదళ॥

---

ఆ॥ వె॥ తన మొగంబు కవికిఁ గనఁబడ కాదర్శ
మందుఁ జూడఁబడెడు; నవ్విధముగఁ
దనదు తప్పుతనకుఁ గనఁబడ కగపడు
బుధవిమర్శనమునఁ బొందు గాను॥

---

సమస్య—తలదీసి యఘుంబడంగ దానముఁజేసెన్.

క॥ వెలలేనిరత్నములు భూ
తలనాథుఁ డొకండు కంధితటమున భూదే
వులకెలమిం బెట్టెల మూఁ
తలఁదీసి యఘుం బడంగ దానముఁజేసెఁ॥

సమస్య—అష్టాదశచక్రవర్తులు పదార్గురు రాజులు ముప్పదిద్దరు నియోగి
వరుల్॥

క॥ వరభారతఖండమున భూ
వరమంత్రిలలో సుకీర్తిఁ బడసినవా రా
ర్గురు చక్రవర్తులు పదా
ర్గురు రాజులు ముప్పదిద్దరు నియోగివరుల్॥

సమస్య—కొడుకును దావలచియొక్క కూతుం గనియెన్॥

క॥ పుడమికి మేనక యనియెడు
పడతుక దివినుండి వచ్చి పావనమగు కా
ఆడవిని నృపుఁడగు కుశికుని
కొడుకును దావలచి యొక్క కూతుం గనియెన్॥

సమస్య—రణమున సీతమోము రఘురాముడు ముద్దిడి పల్కెనిట్టులన్॥

చ॥ త్రిణయను చాపము న్విరిచి దేవగణంబులు మెచ్చ భూమిరా
ణ్మణులు దిగుల్గనన్ జనకనందనిఁ బెండిలి గూడి యామెతోన్
గుణములదొంతిరో యితరకోమలులం గన నంచు మూరుపెన్
రణమున సీతమోము రఘురాముఁడు ముద్దిడి పల్కెనిట్టులన్॥

సమస్య—చంద్రునివంటి దాత (రాజు) నృపసత్తములందుఁ గలండె
యెన్నఁగన్॥

ఉ॥ ఇంద్రసమానవైభవుఁడు హేళికులోదకరాశి పూర్ణిమా
చంద్రుడు శూరశేఖరుఁడు సత్యవచోనిరతుండు ధీరుఁడున్
జంద్రమతీధవుండును విశాలయశోభరితుండు నా హరి
శ్చంద్రునివంటిదాత (రాజు) నృపసత్తములందుఁ గలండె యెన్నఁగన్॥

సమస్య—శివపదసేవనమె యధికసంపత్కరమౌ॥

క॥ భవసాగరమును మానవు
లవలీలఁ దరింపఁగలుగు నవ్యాహతపూ

తవరం బెన్నఁగ శ్రీకే
శవపదసేవనమె యధికసంపత్కారకమా॥

సమస్య—శవదర్శనమైన వేళజన్మము గలదే?

క॥ భువి శ్రీనీలాచలమునఁ
బవిత్రశుచి మాస శుక్లపక్షమునందున్
రవినిభరథసంస్థిత కే
శవదర్శనమైన వేళజన్మము గలదే?

సమస్య—అంధుఁడు భాస్కరునిఁజూచి యానందించెన్॥

క॥ అంధత్వహరుండగు రవి
బంధురకృప గ్రుడ్డితనము వాయఁగఁగవితా
సింధువు మయూరుఁడనెడు వు
రాంధుఁడు భాస్కరునిఁజూచి యానందించెన్॥

సమస్య—ఇంకన్ గుంకుమ బొట్టుఁ బెట్టకుము తన్వీభాలభాగంబునన్॥

శా॥ జంకొక్కింతయు లేక పాండవులకున్ ద్రవ్యమ్మ నీయనంచునన్వడిన్
బంకేజాక్షునితోడ నీధవుఁడు దాఁ బల్కెన్గదా యక్కటా!
బోఁకుల్గాకిపుడల్ల భీముప్రతినల్పూర్ణంబులౌఁ గాన నీ
విఁకన్ గుంకుమబొట్టుఁ బెట్టకుముతన్వీ ఫాలభాగంబునన్॥

సమస్య—మదగజయానకున్ రయికమాత్రమె చాలునుజీరయేటికిన్॥

చ॥ ఎదురుగరండు దుష్టులువలిచ్చెదఁ గొండని చీరునప్పుడా
ప్పిదముగఁ దప్పుదాఁచుకొన వీడునెరుల్పయిఁ గ్రిమ్మ సుబ్బలం
దొదగక జారుచున్నిలువ కుండిన నప్పుడు శౌరి పల్కనీ
మదగజయానకున్ రయికమాత్రమె చాలును జీరయేటికిన్॥

సమస్య—కొంతఁ జేయునే దీపంపుఁ గాంతి నెందు?

గీ॥ ప్రతిభగలవాఁడు సామాన్య పంచజనుని
సారమును గోరఁ డెప్పుడును సత్వ మిద్ది

తీక్ష్ణకరభాసమానుఁడౌ దినకరుండు
కాంక్షసేయునే దీపంపుఁ గాంతి నెంచు?

సమస్య—శవమునడచెను జూపలు సంతసింప॥

గీ॥ జనులఁబీడించి పీడించి జమునికడకుఁ
జనినతైమూరుల్నుంగు శ్మశానమందుఁ
బాఁతుటకు వాని బంధుసేవకగణము స
శవము నడచెను జ్ఞూపలు సంతసింప॥

సమస్య—క్షాత్త్రమే మఱచిపోయిరి క్షత్త్రియవర్యు లిట్యేడన్॥

చ॥ కలిమహిమ ప్రభావమున గర్వ్యతమోగుణ యుక్తులై, సదా
విలసనరక్తులౌచుఁ, దమబీరము బూడిదగానొనర్చి, య
న్యులకడ నమ్రభావమున నుండుటచేతనె ముఖ్యధర్మమై
పొలిచెడు క్షాత్త్రమే మఱచిపోయిరి క్షత్త్రియవర్యు లిట్యేడన్॥

ఉ॥ కత్తులు త్రిప్పువట్టి మఱికాసెలు గంటికి దూరమయ్యెఁ; బై
కెత్తుగ నున్న మస్తకము లెంతయు వంగెను; పౌరుషంబు దా
నొత్తిలె; దాస్యమే మిగులనొప్పెఁ గదా పరమార్థమై కటా!
బొత్తిగ క్షాత్త్రమే మఱచిపోయిరి క్షత్త్రియవర్యు లిట్యేడన్॥

సమస్య—దేశసేవయె కాదె సర్వేశుసేవ?

గీ॥ ప్రాణి జన్మనివాస కారణము, దేవ
దేవు నునికికి దివ్యమందిరము నగుచు
యుక్తసేవకు ననువుగా నుండునట్టి
దేశసేవయె కాదె సర్వేశుసేవ?

సమస్య—లోకసేవయె యుత్తమలోకపథము॥

తే॥ గీ॥ హరియె లోకంబు లోకంబె హరియటంచు
శ్రుతివచించుటవలన విశ్రుతముగాను
దృశ్యమును బరిచర్యకు నిమ్మనగుట
లోకసేవయె యుత్తమ లోకపథము॥

సమస్య:—తల్లీ! దండం బటంచు దారకు మ్రొక్కెన్

క॥ ముల్లోకంబుల మేలున
కల్లమహిషదనుజుఁ జంపు మనుతఁటియందే
యెల్లసురలతో భర్గుఁడు
తల్లీ! దండం బటంచు దారకు మ్రొక్కెన్॥

క॥ తల్లిగఁ గనుఁశశి కంగజ
భల్లాహత యై నిజేచ్ఛఁ బ్రకటింప నతం
డొల్లక ప్రథమంబున నో
తల్లీ! దండం బటంచుఁ దారకు మ్రొక్కెన్॥

క॥ తల్లీ! యనుశశి మన్మథ
భల్లాహతుఁ డై స్వకీయభావోద్రేకం
బల్లన నెఱిగించుచుఁ గచు
తల్లీ! దండం బటంచుఁ దారకు మ్రొక్కెన్॥

సమస్య:—పురుషుఁడు గర్భంబుఁదాల్చి పుత్త్రిని గనియెన్.

క॥ తరణికులమందు వెలసిన
ధరణీపులలోన తొల్లి ధర్మరతుఁడు మం
దరధీరుండు నొకానొక
పురుషుఁడు గర్భంబుఁ దాల్చి పుత్త్రిని గనియెన్॥

సమస్య:—గగనము మధ్యభాగమునఁ గచ్ఛపి యేగెడుఁ బక్షహీన

చ॥ జగమున భైరవుండు దొలి జన్మముఁ దాలిచి తండ్రియింటికిన్
దగ (జనుచుండ నప్డు వసుధాస్థలినుండి తదంఘ్రి భక్తి భ
క్తగణము గాంచి యొక్కనుడిగా ననె వేడుక నిట్లు బాపురే!
గగనము మధ్యభాగమునఁ గచ్ఛపి యేగెడుఁ భక్షహీనయై॥

సమస్య:—సతి సతిఁ గవయంగఁ బుత్త్రసంతతి గలిగెన్.

క॥ క్షితికష్టము వారింపఁగ
నతిపాతకి యైనతారకాసురుఁజంపన్
రతిపతియుసురును గొనినస
న్సతి సతిఁ గవయంగఁ బుత్త్రసంతతి గలిగెన్॥

సమస్య:—బకమగుఁ గా తొండ ముదిరి బహుదినములకున్.

క॥ నికముగ ధర వఱ డగు జం
బుకము; మిసిమిఁ బాసి బడుగు ముదుకండగుఁ జూ
మకరాంకసముండును; బిం
బక మగుఁ గా తొండ ముదిరి బహుదినములకున్॥

సమస్య:—సూర్యబింబంబుఁ బరికించి సోముఁ డనిరి.

గీ॥ రావణుపరితాప మెడ లేకపరిబలినపుడు
చండవాయువు మంద మాశ్వాసన మయ్యె
జ్వాలనకణ మొండె ఘనసారశకలగుణము
సూర్యబింబంబుఁ బరికించి సోముఁడనిరి॥

సమస్య:—కాటుకఁ బోలెఁ గెంపు సితకాంతిని బూనెను గాదె? నెచ్చెలీ!

ఉ॥ హాటకదేహతో నొకరుఁ డంగజకేళిని దేలినప్పుడా
బోటి ధరించుకజ్జలము పూర్ణముగాఁ దనమోవి నంటఁగాఁ
బాటన నద్దమందుఁ గని పక్కున నవ్వ సఖుండు పల్కె హా!
కాటుకఁ బోలెఁ గెంపు సితకాంతిని బూనెను గాదె? నెచ్చెలీ!

గీ॥ మరుని యర్చనకొఱకు నమర్పఁబడిన
మల్లెమొగ్గలు సంపెంగ నల్లకలువ
పూలు మంకెనపువ్వును గ్రాలు మిసిమి
పైఁడి పూసజ్జ గాఁబోలు పడఁతిమొగము॥

గీ॥ ఇలఁజరస్థిరముల సృజియించు విభుఁడే
నిజసమానులఁ గలిగింప నేరఁ డకట!
తనసమానుల నధికులఁ గనెడునరుఁడు
గనఁగ జగదీశ్వరునికంటె ఘనుఁడు గాఁడె?

గీ॥ లార్డ్సు సప్పరు మాత్రమె లభ్య మగును
క్రైస్తవపరివారులకు; నింగ్లాండువెల్లు
నందఱును నిత్యమును బొంద నగును లార్డ్సు
సప్పరునుఁజిన్నరును మఱి యొప్పులంచి॥

ద్విప్రాసకందము.

నీరదనీలనిభాంగా, శారదరాకాశశాంకసమముఖ, జగదా
ధార, దరచక్రహస్తా, ఘోరదనుజహంత! కావు కూరిమి మమ్మున్॥

త్రిప్రాసకందము.

రామ, కమలేశ, జలద। శ్యామ, కమలమందిర, వినతాద్రికుమారీ
భీమ, కమనీయతాజిత। కామ, కమలనేత్ర! నన్నుఁ గావుము కృపతోన్॥

గీ॥ జగము బ్రహ్మమయంబుగా జ్ఞాని యెంచు
భక్తుఁడు దలంచు జగ మెల్ల బ్రహ్మముదిగ
జ్ఞాని కర్మసంచయమును బూని విడుచుఁ
గర్మి గోరఁడు దాఁ జేయు కర్మఫలము॥

గీ॥ తనదుజీవితమున రెండు దినము లేని
సరిగఁ గడిపెడుపూరుషవరుఁడు లేఁడు
కానఁ గర్తను శాస్తను నేన యనుచు
విఱ్ఱవీఁగుట చెల్లునే? వెఱ్ఱి యగుచు॥

గీ॥ చెడపురుగు నిజాస్యమునుండి చెమ్మ, సాలె
పురుగు తంతువుఁ గలిగించుపోలువుఁ జూచి

చేతనం బగుబ్రహ్మంబె స్వీయశక్తి
వలన జడసృష్టిఁ జేయుట దెలియఁ దగును॥

గీ॥ గదిఁ డ్రిదీపంబులవెలుంగ నఖండ మగుచు
వ్యాప్త మగురీతి బ్రహ్మంబునందుఁ గలిసి
పొసగు జ్ఞానక్రియేచ్ఛల న్బ్రహ్మశక్తు
లెపుడుఁ బూర్ణంబుగా జగద్ధేతు లగుచు॥

గీ॥ అమరు రూపభేద మచేతనములయందు
జ్ఞానతారతమ్యము చేతనముల నొప్పు
నొక్కదానిని బోలి వేఱొకటి లేక
వస్తుజాలంబు జగమున వఱలుచుండు॥

ఆ॥ వె॥ హరికిఁ దులసి గలదు హరునకు బిల్వంబు
గలదు ధాత కెట్టిదళము లేదు
ఇట్టు లుండఁ బూజ నిఁక నెట్టు లయ్యెడు?
సృష్టికర్తకు దశ యిట్లు గలిగె॥

గీ॥ జ్ఞానమునకు నొప్పెడుసాధనంబు మెదడు
భక్తి కగుసాధనంబు హృత్పంకజంబు
కర్మసాధన మింద్రియగ్రామ మగును
జలన మఱుబుద్ధి వైరాగ్యసాధనంబు॥

గీ॥ పతిమెచ్చనిసతి, వసుధా
పతిమెచ్చని కింకరుండు, వప్తయుజనియున్
మతి మెచ్చనితనయుఁడు, బం
డితనాథులు మెచ్చనికవి నీచులు గారే?

గీ॥ ఏకవచనరూపం బుండి యొసఁగ నిత్య
బహువచనశబ్ద మహా టద్ది పరమచిత్రి

మయ్యె దుర్దినశబ్దంబ యట్టులుండు
సకలభాషల మఱి సర్వసమయములను॥

గీ॥ కర్మయుక్తంబుగనొ జ్ఞానకలితముగనొ
భక్తి వెలయును మనుజహృత్పాకఁబమునఁ
గఫయుతముగానొ పైత్యసంకలితముగనొ
వాత మంగంబునిం గనం బడెడుభంగి॥

ద్విపద॥ శ్యామలోహితపీతహారితపిశంగ
ధూమలనీలము ల్దాడు నింద్రధనువు॥

గీ॥ ధనము గలవాఁడె ఘనతను గనెడుచోట్లు
రెండె కల వందు మొదటిది రెయిలుబండి
రెండవది పణ్యసుందరీగృహము దలఁప
మూడవది వేఱొకటి లేదు ముజ్జగముల॥

గీ॥ భోజ్యరసములలో రెండె ముఖ్యము లయి
తవును మొదటిది యుప్పు రెండవది తీపి
కావ్యరసములయందు శృంగారవీర
హాస్యకరుణారసములు ముఖ్యంబు లగును॥

గీ॥ శిశుత మొగ్గ, కౌమారంబు చెలఁగుపూవు
బ్రహ్మచర్యంబు పిందె, గార్హస్థ్య మెన్నఁ
గాయ, వనవాసిధర్మంబు కమ్మఁబండు
తలఁప సన్న్యాస మయ్యెడు ఫలరసంబు॥

గీ॥ విగ్రహారాధనంబును విడువ వలయు
దేవు నైదుకాలములఁ బ్రార్థింప వలయు
జనుల మితదానములచేతఁ దనుప వలయు
నొనర నవమమాసమునఁ బస్తుండ వలయుఁ

గొలత్తెఁ దూనిక స్సమముగ నలుపవలయు
వడ్డిఁ గొనుకోర్కి బాత్రిగ వదల వలయు
వనుచు రూఢిగాఁ దెలియఁ జేయును గురాను॥

గీ॥ ఇలను సోదరభావంబు వెలయఁ జేయు
మామతంబంచుఁ గొందఱుమనుజు లండ్రు
దానిని విశుద్ధచిత్తంబు దక్క నొక మ
తంబు నెలకొల్పనే నిశ్చలంబుగాను?

గీ॥ చావు లేనిప్రాణులువోలె జనులు చచ్చి
నట్టివారికై శోకింతు రజ్ఞు లగుచు
దగ్గఱన యున్నతమచావుఁ దలఁచి యేడ్చి
తిరుగ నద్ది రా నట్టుల తిరుగు టొప్పు॥

గీ॥ సాలెపురు గాత్మనిర్మితజాలమందుఁ
జిక్కుకొని యుండువడువున జీవుఁ డాత్మ
రచితకర్మజాలంబునం బ్రబలముగను
జిక్కుకొని పరమపదంబుఁ జేర లేఁడు॥

ఆ॥ వె॥ ఉత్కళింగ మనఁగ నొప్పు మీఁది కళింగ
మదియె యుత్కలముగ విదిత మయ్యెఁ
దలకళింగ మనఁగఁ దనరుఁ గ్రిందికళింగ
మదె తెలుంగుగాను ఖ్యాతమయ్యె॥

ఆ॥ వె॥ తెలుఁగు మూఁడులింగములవలనఁ; దెనుంగు
మూఁడుగిరులవలనఁ; బొడమ లేదు
తలకళింగమె తగెఁ దెలుఁగుగాను దెలుంగె
తెనుఁ గనుప్రతిరూప మొనరఁ దాల్చె॥

గీ॥ కర్మవితతికి నధికారి కంజభవుఁడు
భక్తి కధికారి యిందిరావల్లభుండు
జ్ఞానమున కధికారి యీశానుఁ డగుట
వారికృప లేక పడయరు వాని జనులు॥

గీ॥ ఎట్టినాతి నైనను వరియింప వచ్చు
నెట్టివస్తు వైనను భుజియింప వచ్చు
నెట్టిమతము నైనను గ్రహియింప వచ్చు
నించు కైనదోషంబు లే దిప్పు డకట!

31॥ వె॥ నాలుకలు పదేను; నయనంబులు పదాఱు
కాళ్లు రెండు; రెండుకరము లమరు
వింతలఁదు మిగులవింత భావింపఁగా
దీనిభావ మేమి ధీరులార?

శ్లో॥ మనఆదీంద్రియగ్రామో బుద్ధిభ్రంశకరో భవేత్
తస్మాత్తస్య నిరోధస్తు కర్తవ్యో విబుధోత్తమైః॥

క॥ పయఃఉదధియందు నహిపై
శయినించెడువిభుఁడు నీరజాతాక్షుఁడు దా
దయఁ జూపి యభీష్టార్థని
చయ మొసఁగుచుఁ గాచుఁగాక! సతతము మమ్మున్॥

గీ॥ జనన మొందుట బాధలం గనుట దుదను
నీల్గుట సమస్తదేహులనియతి గాన
వాని కై ధీరుఁ డడలఁడు భయపడండు
చేయఁ దగుచేఁతలను బూని చేయుచుండు॥

గీ॥ ముక్కుతో గాలిఁ బీల్చుట పొసఁగ బ్రిదుకు
ముక్కుతో గాలి విడుచుట పొసఁగఁ జావు

బ్రదుకుసావులు రెండును బ్రాణి కింత
లోన కల వని తెలిసి జగాన మెలఁగు॥

గీ॥ ప్రాణిజీవంబుఁ దీయుట యతిసుకరము
జీవ మొసఁగుట యేరికిం జేతఁగాదు
జీవకుఁడు తదీశుఁడు వాసుదేవుఁ డొకఁడె
కాన దానిని హరియింపఁ బూనఁ జనదు॥

గీ॥ శవముఁ బూడ్చెడుచోటు శ్మశానము కద
దానిఁ గడుపునఁ బూడిచి తనదుకడుపు
వల్లకాడుగాఁ జేయుట భవ్య మగునె?
తెలిపి యేపాటి యైనను గలుగు నేని॥

గీ॥ తృణముఁ దిని మాంసమును బెంచుమృగము వ్రేలఁ
జేసి మేనిచర్మంబును జీరుచుండ
మాంసమును దిని మాంసంబు మానుగాను
బెంచునరుగతి యేమానో? పెఱభవమున॥

గీ॥ ఎడఁద లజ్జాభయద్వయహీన మైన
తల కెదురువోలెఁ దిన్నగా నిలువఁబడును
కరముఁ జాఁపనిమానవవరునిచరణ
యుగము సరళంబుగాఁ జాఁప నగును జుమ్మి॥

గీ॥ జీవుఁ డీశ్వరవిముఖతఁ జెందినపుడ
మాయ కొగి లొంగి దేహంబు మందిరంబు
గాఁగఁ గర్మంబులను జేసి కష్టకంధి
దిగెను రామ! నీకృప లేక తేల లేఁడు॥

గీ॥ విషయజలమున నామనోఝషము మునిఁగె
కృపయనెడిత్రాడు మఱియును బ్రేమ మనెడి

యూమిషము గలసీదుపాదాంకుశాంక
మనెడిగాలముచే దానిఁ గొనుము రాము!

ఆ॥ వె॥ అరయ జగమ్ము వాతులాశ్రమం బగు; నందు
బెరళ్ళయు నెల్లజనులు వెఱ్ఱివారు
పృజ్ఞ నాదె యనును బ్రత్యేకమనుజుండు
నెవరివెఱ్ఱి వారికిచ్చుఁ దనివి॥

గీ॥ గోళకులుఁ గుండులును భారతేలమిట్టాఁడి
నిప్పు డందఱిదు నున్నవా రింక బాల్య
పరిణయనిషేధ మగునేని పరఁగఁ గలరు
కొంతమంది కానీనులు వింత దోఁప॥

గీ॥ వరునిచదువును రూపంబు నరసి యువతి
వలచి వరియించునే కాని వంగసమ్మ
గుణము నరయదు; గావునం గొంతకాల
మెడల వారిసంసారంబు సెడఁగ వచ్చు॥

గీ॥ సత్యమో యసత్యమొ కాని ఛాందసులకుఁ
బ్రత్యయ మరజస్వలపెండ్లి స్వర్గద మని;
దాని మాపి రజస్వలోద్వాహమునకు
శాసనము సేయు టొప్పదు శాసకులకు॥

గీ॥ చంద్రికాంతుని బొంద న్నిశాచిరంటి
యలయరుంధతి యనుమిత్తియమ్మతోడఁ
జనువశిష్ఠాఖ్య మగుబులాకిని విశాఖ
యనెడుమౌక్తికదామంబు నార్ద్ర యనెడు
చెందిరము బొట్టు ధ్రువకుంభనందను లను
నమలవజ్రలతమ్మంట్లు నభ్రగంగ
యనెడు తెల్లనిపట్టుచీరను ధరించి

తనరు రసికాళిసంతోషదాత్రి యగుచు
మీనరాశిలోచన యనిమిషత నొంది॥

గీ॥ అంత చనుటకంటెఁ గొంత దక్కుట మేలు
కునృపనగరికంటె వనము మేలు
మానహానికంటెఁ బ్రాణహానియె మేలు
పడపుఁగూడుకంటెఁ బస్తు మేలు॥

గీ॥ చౌకముగ నెటుఁ జూచిన సరిగ మూడు
గాఁగ నెనిమిదిప్రోగులఁ గాయ లేఁబ
దాఱు నిడు ప్రతిపంక్తిఁ బదాఱు గలుగ
నందు నిరువదికాయల నావల నిడి
ముప్పదాఱు నారీతినేపొందు పఱపు॥

గీ॥ రెండుఁ బండ్రెండు రెండుఁ బండ్రెండు రెండు
నుండుఁ బండ్రెండు రెండుఁ బండ్రెండు మొదట
నాల్గుమూలల నేడేసి నడుములందుఁ
దలఁప రెండేసి కాయలు నిలుచుఁ దుదను॥

గీ॥ చౌకముగ నెటుఁ గన నశ్వశాల లుండె
మూఁడుగా మొత్త మెనిమిది; పొనర నందు
ముప్పదియు రెండు హయములుపొలిచె; బంతిఁ
బదియు రెండుతోఁపఁగఁ; నంతఁబథికుఁ డొకఁడు
వానిహయములు నాలు గొవాజిరాజి
తోడఁ జేరిచి యట్టులే తోఁపఁ జేసెఁ
బిదప నెనిమిది గొని చని మొదటిరీతిఁ!
దోఁపఁ జేసెను; మును పవి వోలఁకె నెట్లు?
పిదప నెటులు దగె? నటు వెనుక నెట్లు?॥

గీ॥ మొదట సాలల నాల్గేసి పిదప వరుస
మూఁడు నాఱును మూఁడును బూనరేఁ బిదప
నైదు రెండును మఱి యైదు సమరెహాయము
లంబుజోద్భవతాత! సర్వాధినేత!॥

గీ॥ సుజనుకీడు మేలుకొఱకె చుమ్ము; దుష్టి
జనుని మేలు గీడుకొఱకె జగమున కగు
నాదికవిశోక మది శ్లోక మయ్యె; వెన్నఁ
గుకవియొక్క శ్లోకము శోకగుంఫము కద॥

గీ॥ నుడువు మొకసంఖ్య దేనిని గడఁగి భాగ
హార మొనరింప రెండుచే నమర నొకటి
మూఁడుచే రెండు నాల్గుచే మూఁడు నైదు
చేత నాలుగు నాఱుచేఁ జెలఁగ నైదు
మిగులు; నేడుచే హరియింప మిగులు సున్న
యనఁగ నూటపందొమ్మిది యనుచు నుడివె॥

గీ॥ జనుఁడు మితి లేనిబంగారుఁ దనగృహమునఁ
గూర్ప సర్వదా చింతతోఁ గుందుచుండుఁ
గాని మృతి నొందుతఱిఁ జిల్లిగవ్వ నైన
శాళిఁ దనవెంటఁ గొని పోవఁ జాలఁ డకట!

గీ॥ తనువు శుష్కింప వాడును మనసు; దాన
బుద్ధిబల మడు గంటుట పొసఁగుఁ గాన
జనుఁడు సుస్థముగా నిజతనువు నుంప
సర్వథా యత్న మొనరింపఁ జనును గాదె!

గీ॥ ధనమునందును బ్రతుకునందును నరుండు
దనివిఁ గనఁ డెంతధనముఁ బొందినను మఱియుఁ

బొందఁ గోరును; శతవర్షము లిల మనిన
మఱియు మని యుండఁ గోరును మమతవలన॥

గీ॥ ఇడుమ గలుగంగ ధైర్యంబు విడనివాఁడు
కడఁగుపని ముగింపం బట్టు గలుగువాఁడు
దైన్య మెప్పుడు నొందక తనరువాఁడు
పుట్టువారిలో నిక్కంపుఁ బూరుషుఁడు॥

గీ॥ న్యాయ మెపుడును విడువక నడచువాఁడు
చెప్పుభంగిఁ గార్యంబులఁ జేయువాఁడు
పిఱికితనమును మదినుండి వెలుకువాఁడు
పుట్టువారిలో నిక్కంపుఁ బూరుషుఁడు॥

ఉ॥ ధూపము గాలుచు న్మనుజతుష్టిఁ బొగం దగఁ జేయుచుండఁగా
దీపము గాలుచుం దనదుదీప్తిని లోకుల కిచ్చుచుండఁగా
శ్రీపతిభక్తిఁ దై జనులసేమము సేయఁ గడంగుపూరుషుం
డాపద కింక మిత్తికి రవంతయు జంకునె? పూన్కి మానునే?

## ద్వంద్వ సంబంధము.

గీ॥ అహిశిరంబున మణికడ నమరు విషము
ధనము గల చోటనే వివాదంబు దనరు
దివియదిగువనె చీఁకటి గవిసి యుండు
పగలునకు నంటియే రేయి పరఁగు చుండు
ఇహసుఖంబు తుదినె దుఃఖ మెసఁగు నెపుడు
భోగమునకుఁ దర్వాతనే రోగ మండు
యౌవనానంతరమె జర యలవడెడిని
జననసహితంబ మరణంబు జంతుతతికి॥

క॥ కాంతా కాంచనములయం
దెంతయు సక్తుంబు నరులహృదయము వానిన్
సుంతయు గణియింపనిధీ
మంతుఁడు భర్గుండ వెలయు మనుజాకృతితోన్॥

గీ॥ ఉర్వీజాతము బహుగుణయుతము మఱియు
వ్యంజనస్వాదుకరము భోజ్యంబు నయిన
యుల్లి నీనాఁట నింద్యంబు నొనరఁ జేసె
మ్లేచ్ఛదేశాగతం బనుమితపులోటు॥

గీ॥ పాపజాలవిముక్తుఁడె బ్రాహ్మణుండు
శాంతగుణభూషణుండెపో శ్రమణకుండు
ఆసఁబాసినవాఁడె సన్యాసి సుమ్ము
సత్యభాషణనిరతుండె సాధుజనుఁడు॥

గీ॥ మొగమునకుఁ దమ్మి, చూతంబు ముక్కునకును
వంజులము పెదవికి, దంతపాళి కొప్పు
మల్లెమొగ్గలు, గనులకు నల్లకలువ
సాటి యగుటనే యవి మరుశరము లయ్యె॥

శ్లో॥ రూపం లోకం వపాం శాకం చాపం తాపం తటం శకం
శాటీం గేయం కటం లోపం క్రమేణ త్వేపిలాదిక
దినేషు మేషమాసాది ప్రారంభాఇతి నిశ్చితం॥

గీ॥ ఎవఁడు గొప్పతనము భువిఁ బొందఁ గోరునో
వాఁడు గొప్పవాఁడు గాఁడు సుమ్ము
ఎవనిగొప్పతనము భువి నుతి గాంచునో
వాఁడె గొప్పవాఁడు ప్రజలయందు॥

గీ॥ ధనము విద్యయుఁ దనుబలమును మనుష్య
తతికి ముఖ్యబలంబులుతథ్య మిద్ది

కాన వానికి స్వామిను లైన శ్రీయు
శారదయు దుర్గయును మూఁడుశక్తు లైరి॥

గీ॥ నిత్యతోషదస్థానంబు నీఁగి దుఃఖ
ధ్వయగునిలఁ గల్గి నీవు రోదనము సేయ
నగినబంధుల నితరుల నగుచు నట్లు
సేసి నగుచు స్వస్థానంబుఁ జేరఁ గడఁగు॥

క॥ చెవు లుండియు గానరసముఁ
జవి గొన లేనట్టియధమజన్ముని కంటెన్
జెవి లేకయె తద్రసమును
జవి గొని ముద మొందుపాము సను నుత్తమమ్మై॥

గీ॥ చెఱుకువిలుకాని డాకకు న్వెఱపు నొంద
కుండునే మర్త్యతతి? దాని కోర్వ లేక
పరఁగుత్రిపురాసురాంతకు పౌరుషంబు
గనఁగ నగ మయ్యె నను ఖ్యాతి దనరుచుండ॥

గీ॥ పుష్పవతి యగుఁ లతికను ముట్టి శీత
లాంబువుల లెస్సగాఁ దాన మాడి మరల
నంటఁ గలనొక్కొ యనుశంక నందువాని
మాడ్కిఁ జరియించు మెల్లగా మారుతంబు॥

గీ॥ అజ్ఞు లనునట్లు కాలంబునందు బాగు
నోగు నుండవు పనులంద యుండు నవ్వి
యొక్కసమయంబుననె పెండ్లి యొక్కచోటఁ
జావు వేఱొండుచోటునం జరుఁగు గాదె?॥

క॥ గీతాశాస్త్రంబును విడి
-త్మాన్మతలమున మఱొకదానిఁ జదువుట సుఘ్నుతో

వేత మగుపాయసము విడి
యాతత రాగంబుతోడ నంబలిఁ దినుచే॥

గీ॥ ప్రణవజపమున జ్ఞానసంప్రాప్తి యనుట
కల్ల; చిత్తశుద్ధియ దానికారణంబు
జీవ మున్నగాడిదయు నిర్జీవ మైన
సంకును బ్రణవోచ్చరణము సలుపుఁ గాదె?

గీ॥ వెలికిలెడుగండుకప్పల బీఁటగిల్లు
కడుపుచరిదానఁ గడురోఁత గలుఁగఁ జేయు
స్త్రీప్రణంబును గాంచినం గ్రిమికిఁ గాక
యింక నెవనికిఁ గోరిక యెద జనించు?॥

గీ॥ విడువఁబడునూపిరి మరలఁ బీల్చఁ బడని
స్థితియె మరణంబు తత్ప్రాప్తి దెలియఁ బడదు
కాన విడుచునూపిరితోడ మానవుండు
రాము స్మరియించుచుండుటే క్షేమ మగును॥

గీ॥ ప్రాణులకు దుఃఖము నొసంగి పరమసుఖము
నొందఁ జూచును వేఁటకాఁ డుర్వియందుఁ
బ్రాణులకు దుఃఖమును బాపి పరమసుఖము
నొందఁ జూచును గద తాను యోగివరుఁడు॥

శ్లో॥ స్వయంభుం నారదం శంభుం సనకంచ సనందకం
సనాతనం సనజ్జాతం భీష్మం స్వాయంభువం బలిం
వైయాసికంచ ప్రహ్లాదం కపిలం జనకం యమం
నమామి సంతతం భక్త్యా హ్యేతాన్ పరమవైష్ణవాన్॥

క॥ ప్రకృతియు బ్రహ్మము జీవుఁడు
నిఁకఁ గాలముఁ గర్మము గణియింప ననాదుల్
అకపరిణతకర్మంబే
ప్రకటం బగుసాంత మగును రాధారమణా!।

శ్లో॥ సంగీతం మధురం లోకే హరినామ తతోఽధికం
భవే ద్యది తయో రైక్య మనిర్వాచ్యం భవిష్యతి॥

గీ॥ గొప్ప వైయున్న యంతన గొప్ప యగునె?
గొప్ప వై యుండు తాడును నొప్పునీత
చెట్టు నిచ్చునే నీడను? తెలుఁగువాని
ఫలము లొందంగఁ దర మౌనె సులభముగను?

ఆ॥ వె॥ చేఁతలు సరిగాను జేసెద నని పెంపుఁ
జెప్పువారు వానిఁ జేయ లేరు
చేయువా రెపుడును జెప్పికొనరు గాంచ
నఱచు చుండుకుక్క గఱవ దెచట॥

గీ॥ బైట మలమూత్ర కఫములపాటుఁ గనిన
నరులు మనముల నేవగింతురు కడింది
యవ్వి దమలోన యుండినయపుడు దలఁచి
యేవగింపరు గద కొంచె మేని వారు॥

ఆ॥ వె॥ అర్ధఘటిక దలఁప నంతర్దశాదిన
మునకు మూడు దినము లౌనర నేఁటి
కగు ధ్రువంబు దానిని గుణింప నిష్టద
శాబ్దసంఖ్యచేత నగును విదశ॥

గీ॥ ప్రజల కెల్లప్పుడును గనంబడెడునదియు
నొడయులకు నొకప్పుడు గనంబడునదియును
బరమపూరుషునకుఁ గనంబడనిదియును
జెప్పుఁ డదియెద్ది? పండితశ్రేష్ఠులార!॥

గీ॥ జంపతుల నామవర్ణకసంఖ్య లొకటఁ
గూడి నాల్గుచేత గుణించి మూడుచేత
నొగి హరింపంగ నున్నయు నొకటిమిగులు

నేని పెండ్లము యమపురి కేగుఁ దొల్లి
రెండు మిఁగిలినఁ దొల్లి మగండు ననును॥

హిందుస్తాని తోడి—ఆదితాళము.

భామరో! సామి నెడఁ। బాసి తాళఁగ లేనే॥ ప॥
కోమలి! నీ మాతని। గొబ్బునఁ దోడి తేవే॥ భామరో॥
శారికాభృంగపిక। కీరాదిస్మరసేన।
ఘోరముగ నాతోడఁ।
బోరఁ డొడఁగె నయయో॥ భామరో॥ ౧॥
నన్ను తాంగిరో! యల।
చందురునిగాటంపు
వెన్నెలకాకచే
వేఁగుచు నన్న దాన॥ భామరో॥ ౨॥
కన్నెరో! నాదుపతి।
చిన్నారిచిన్నెలు నా।
కన్నులుఁ గట్టినట్లు।
గనం బడుచున్నవి॥ భామరో॥ ౩॥
చక్రిస్త్రనిరో! వర।
విక్రిమ దేవు నేలు।
చక్రిని విడచి మనఁ।
జాల నిక్కము సుమీ॥ భామరో॥ ౪॥

గీ॥ భోజ్యరసములఁ దీపు నుప్పును ససార
ము లగునట్టులె శృంగారమునుఁ గరుణముఁ
గావ్యరసముల మానసాకర్షకములు
దీనజనపాల! గోపాల! గానలోల!॥

గీ॥ సత్త్వము రజంబుఁ దమమును సమముగాను
బొందుకొని యుండుట పడంతులందుఁ దెలుప

ఋషులు శ్రీనామ మిడిరి వారికిఁ దగంగ
దీనజనపాల! గోపాల! గానలోల! ॥

సూ—సులభా నిర్మలాభక్తి ర్దుర్లభే జ్ఞానకర్మణీ॥

గీ॥ సజ్జనులు గనం బడరుగా జగమునకు న
సజ్జనులుగా గనంబడుభంగి సహజముగను
సుఖము జనమానసమునకు సోఁక దొగి న
సుఖము సోఁకెడువడువున సూరులార! ॥

---

శ్రీ

శ్రీసీతాప్రాణనాథోవా రాధికాచిత్తవల్లభః
కృపావారినిధిర్భూత్వా పాతు మాం పాపపీడితం॥
కోసలేశ్వరపుత్రోవా గోపభూపతినందనః।
కృపావారినిధిర్భూత్వా పాతుమాం॥
రాఘవాన్వయదీపోవా యాదవాన్వయభూషణః
కృపావారినిధిర్భూత్వా॥
కోదండకాండహస్తోవా విచిత్రమురలీధరః।
కృపావారినిధిర్భూత్వా॥
పౌలస్త్యగోత్రహర్తావా కంసవంశవినాశకః।
కృపావారినిధిర్భూత్వా॥
యోగిచిత్తనివాసోవా గోపీమానసమందిరః।
కృపావారినిధిర్భూత్వా॥
కిరీటయుక్తమస్తోవా శిఖండాన్వితమస్తకః।
కృపావారినిధిర్భూత్వా॥
సుదూర్వాదళవర్ణోవా శక్రనీలసమప్రభః।
కృపావారినిధిర్భూత్వా॥
కృపాంభోధ్యష్టకం దివ్యం సర్వపాపప్రణాశనం
రచితం విక్రమేశేన భారద్వాజేన భక్తితః॥

---

# తులసీరామాయణమునుండి

గీ॥ మోహవరు ప్రతాపరవి ప్రాప్తిని మనమునందు
వెలయ నంత వఱకె కదా యల మమత్వ
యామవనము లను గాఢతమోపితతిని
రాగనామక ద్వేషాఖ్యరజనిచరము
లెలమితో స్వేచ్ఛగాఁ జరియింపఁ గలవు॥

గీ॥ భక్తు హృదయాభ్రమందు సద్భక్తిపూర్ణి
మారజని రామనామనిశారమణుఁడు
వెలుగు చుండంగఁ బరనామవితతి తార
కాసమూహంబువలెనె ప్రకాశ మొందు॥

గీ॥ పూచి కాయని పాటలభూజమువలె
సలుపకయె చెప్పుదురు నీచజనులు పొగడి
పూచి కాచునట్టి రసాలభూజ మట్లు
సలిపి చెప్పికొందురు మధ్యములు సెలంగి
పూయకయె కాచెడిపణసభూజ మటులు
చేయుదురు గాని సుజనులు చెప్ప రెపుడు॥

గీ॥ కఠినహృదయుల సాధ్యంబు గలుగునపుడు
సాధువు శమించి నేర్పున జరగు టొప్పుఁ
గఠినదంతాళియుగమధ్యగతము గాఁగ
మెత్త నగు నాల్క సుఖమున మెలఁగు నట్లు॥

గీ॥ విప్రు విగుణు నైనను గౌర వింతు రెంతొ
కాఁపు గుణవంతు నైనను గౌర వింప
రావు చెడ్డ దైనను బాలు నాను చుందురు
ఖరము మంచి దైనను బాలుఁ గనరు నరులు॥

సీ॥ వనితాగణము మోహవనవసంతము సర్వ
జపతపోనియమనిష్ఠాజలాశ్రి

యనిదాఘసమయంబు జనితకామక్రోధ
మదమత్సరసమూహమందుకాళి
వర్ష కాలంబు దుర్వాసనాకైరవ
తతిసౌఖ్యకరశరదృతువు ధర్మ
శతపత్రశోభాంతబుతువును హేమకార
జవసాళిశిశిరంబు సకలపాప॥
పేచకమహాంధకారంబు విమలబుద్ధి
సత్యసద్గుణబలమీనజాలబడిశ
మిట్టు లుండంగఁ దత్సక్తహృదయు లగుచు
బుధులు సంసారజలరాశి మునుఁగఁ దగునె?

[ఇది తుపానుతటిని రచింపంబడి పఠింపంబడినది.]

శ్లో॥ శిరో మే శ్రీవరః పాతు లలాటం ధరణీధరః
లోచనే పుండరీకాక్ష శ్శ్రవణే విష్టరశ్రవాః
నాసికాం కేశవః పాతు నృహరి ర్వదనం మమ
జిహ్వాం సర్పేశపర్యంక శ్శంఖచక్రధరో గళం
బాహూ పాతు చతుర్బాహు ర్భక్తసౌఖ్యకరః కరౌ
గర్భం దామోదరః పాతు వక్షశ్శ్రీవత్సలాంఛనః
నాభిం మే పద్మనాభశ్చ పృష్టం మే పాతు వామనః
ఇంద్రియాణి హృషీకేశో జానూ మే మధుసూదనః
అఘాసురపరో జంఘే మమపాదౌ త్రివిక్రమః
సర్వాంగం పాతు మే కృష్ణ శ్శ్రీమతిప్రాణవల్లభః
అంతరిక్షే స్థలే నీరే పాతు మాం సర్వదేశగః
దివసే సూర్యమధ్యస్థః రాత్రౌ రాత్రించరాంతకః
సంధ్యయో ర్వాసుదేవశ్చ పాతు మాం సర్వదా హరిః॥
యే చేదం కవచం దివ్యం పఠంతి భక్తిభావతః
తే తరంతి సుఖే నైవ మహాపద్భవసాగరం॥

ఇతి శ్రీవిక్రమదేవవర్మవిరచితం
శ్రీహరికవచం సంపూర్ణమ్.



# నందనందనాష్టకమ్.



శ్రీధరం సచ్చిదానందం భక్తకల్పద్రుమం హరిం
దామోదరం హృషీకేశం వందేఽహం నందనందనం॥

విధిశంకరసంస్తుత్యం గోలోకేశం పరాత్పరం
బృందాకాననసంచారం వందేఽహం నందనందనం॥

క్రతీశం క్రతుభోక్తారం పీతచేలసమావృతం
కేశవం పుండరీకాక్షం వందేఽహం నందనందనం॥

మఘవస్మయహర్తారం ధృతగోవర్ధనాచలం
సర్వపాపహరం కృష్ణం వందేఽహం నందనందనం॥

దేవతార్చితపాదాబ్జం రాధాస్యేందుచకోరకం
రాసమండలమధ్యస్థం వందేఽహం నందనందనం॥

వనమాలాధరం విష్ణుం వల్లవీచిత్తహారకం
జితపూర్ణశశాంకాస్యం వందేఽహం నందనందనం॥

వర్ణనిర్జితనీలాబ్దం మానిమానసమందిరం
ముకుందం మురలీలోలం వందేఽహం నందనందనం॥

మారజిత్సుందరాకారం విశ్వకారణకారణం
గోవిందం పరమాత్మానం వందేఽహం నందనందనం॥

పూతం భక్తిలతామూలం శ్రీనందనందనాష్టకం
శుభదం సుఖదంప్రోక్తం విక్రమేశ్వరవర్మణా.

ఇతి శ్రీనందనందనాష్టకం సంపూర్ణమ్.

# శ్రీ కృష్ణో జయతి.



శ్లో॥ వాసుదేవాయ శుద్ధాయ బుద్ధాయ పరమాత్మనే
నిర్వికల్పాయ నిత్యాయ శ్రీకృష్ణాయ నమోనమః॥

ఏకస్మై బహురూపాయ నిష్కలంకాయ బ్రహ్మణే॥
నిరాఖ్యాతాయ సాఖ్యాయ శ్రీకృష్ణాయ నమోనమః॥

స్వయంజాతాయ సత్యాయవిశ్వంభరాయ విష్ణవే
సచ్చిదానందరూపాయ శ్రీకృష్ణాయ నమోనమః॥

అతిచిత్రచరిత్రాయ ప్రభవే సర్వసాక్షిణే
పాపాంధకారసూర్యాయ శ్రీకృష్ణాయ నమోనమః॥

ఆదిమధ్యాంతశూన్యాయ పూర్ణాయ సర్వశక్తయే
నిగూఢాయ ప్రకాశాయ శ్రీకృష్ణాయ నమోనమః

జగత్ప్రాణైకబీజాయ జగన్నాథాయ వేధసే
జగజ్జేగీయమానాయ శ్రీకృష్ణాయ నమోనమః॥

శుభాకరాయ సూక్ష్మాయ సృష్టిస్థిత్యంత కారిణే
మహాతే దానకల్పాయ శ్రీకృష్ణాయ నమోనమః॥

అరూపాయ సురూపాయ కరుణాజలరాశయే
గోవిందాయ ముకుందాయ శ్రీకృష్ణాయ నమోనమః

శ్రీమత్కృష్ణాష్టకం దివ్యం సమస్తాఘవినాశకం
జ్ఞానానందప్రదం ప్రోక్తం విక్రమేశ్వరవర్మణా॥

ఇతి శ్రీకృష్ణాష్టకం సంపూర్ణమ్.



# రాధికాష్టకమ్.



శ్రీమతీం జగదారాధ్యాం వృషభానునృపాత్మజాం
రాసమండలమధ్యస్థాం రాధికాం ప్రణమామ్యహం॥

విశుద్ధనీరజాతాక్షీం బింబోష్ఠీం చారుహాసినీం
పూర్ణిమాచంద్రబింబాస్యాం రాధికాం ప్రణమామ్యహం॥

క్రముకాధఃకృదారమ్యచిబుకాం కలభాషిణీం
కీర్తిదాసమ్ముదాదాత్రీం రాధికాం ప్రణమామ్యహం॥

మరాళగామినీం రాజదరాళనీలకుంతలాం
నీలాంబరధరామాద్యాం రాధికాం ప్రణమామ్యహం॥

దేవీం బ్రహ్మేశసంస్తుత్యాం హృషీకేశప్రియాం పరాం
హృతపాతకసంఘాతాం రాధికాం ప్రణమామ్యహం॥

వల్లవీజనసంయుక్తాం బృందావనవిహారిణీం
కృష్ణవామతనూభూషాం రాధికాం ప్రణమామ్యహం॥

వర్ణనిర్జితగాంగేయాం కిశోరీం సత్త్వరూపిణీం
గానలోలాం జగద్ధాత్రీం రాధికాం ప్రణమామ్యహం॥

మావాణీగిరిజావంద్యాం శ్రీగోలోకాధినాయకాం
ప్రేమభక్తిప్రదాం శ్రీదాం రాధికాం ప్రణమామ్యహం॥

రాధికాష్టకమత్యంతపవిత్రం భక్తిదాయకం
సంసృతిచ్ఛేదకం ప్రోక్తం విక్రమేశ్వరవర్మణా॥

ఇతి శ్రీరాధికాష్టకం సంపూర్ణమ్.

# నవగ్రహసంగ్రహస్తవః



నమస్సూరాయ సూర్యాయ నమశ్శీతకరాయ తే
మంగళాయ నమస్తుభ్యం బుధాయ తే నమో నమః॥
ధిషణాయ నమస్తుభ్యం శుక్రాయ కవయే నమః
నమోఽర్కజాయ మందాయ నమో రాహుగ్రహాయ తే॥
నమోఽస్తు కేతవే తుభ్యమితి సంగ్రహసంస్తవః
దైనందినం పఠేద్యస్తం గ్రహప్రీతికరో భవేత్॥
ఇతి నవగ్రహసంగ్రహస్తవస్సమాప్తః.

---

శ్రీ

ఝుంఝోటిరాగః- ఆదితాళః.

శ్రీధర కేశవ నమోఽస్తు తే। మాధవ యాదవ నమోఽస్తు తే॥ ప॥
వికచాబ్జనయన నమోఽస్తు తే। సకలాఘశమన నమోఽస్తు తే॥ ౧
క్రతునిచయేశ్వర నమోఽస్తు తే। అతులకృపాకర నమోఽస్తు తే॥ ౨
వృహితగుణసదన నమోఽస్తు తే। అహిమృదులశయన నమోఽస్తు తే
దేవగణవినుత నమోఽస్తు తే। పావనసుచరిత నమోఽస్తు తే॥ ౪
వనమాలాధర నమోఽస్తు తే। వినతోమావర నమోఽస్తు తే॥ ౫
వరమణిజిదంబర నమోఽస్తు తే। స్వర్ణపమాంబర నమోఽస్తు తే॥ ౭
మానిదనుజహర నమోఽస్తు తే। మానిహృదయచర నమోఽస్తు తే॥ ౬

---

# శ్రీకృష్ణస్తుతిః



జయ జయ జయ జగదీశ్వర కృష్ణ
సృష్టిస్థితిలయకారణ కృష్ణ
నందతనయ వసుదేవజ కృష్ణ
కజనాభ యశోదాసుత కృష్ణ
దేవక్యాత్మజ కేశవకృష్ణ
విషమయదుగ్ధధరాహర కృష్ణ
శకటతృణావర్తాంతక కృష్ణ
అర్జునకుజయుగభంజన కృష్ణ
గోకులనవనీతాశన కృష్ణ
అఘబకవృషభాసురహర కృష్ణ
ఖలకాళీయమదాంతక కృష్ణ
గోవర్ధనభూధరధర కృష్ణ
బ్రహ్మాందవిస్మయనాశన కృష్ణ
శంకరవందితపదయుగ కృష్ణ
బృందారణ్యవిహారక కృష్ణ
కేశిమథన నారాయణ కృష్ణ
వరమురలీగానప్రియ కృష్ణ
రాధాననకజభాస్కర కృష్ణ
గోపీలోచనరంజన కృష్ణ
రాసరసిక దామోదర కృష్ణ
కంసప్రాణానిలహర కృష్ణ
ద్రుపదసుతామానావన కృష్ణ
వేదోద్ధారక జలచర కృష్ణ
మంథరగిరిధర కచ్ఛప కృష్ణ
భీకరకోలాకృతిధర కృష్ణ
నరసింహాకృతిధారక కృష్ణ
బలిగరిమాంతక వామన కృష్ణ
భృగుమునివంశవిభూషణ కృష్ణ
సీతాస్యాంబుజమధుకర కృష్ణ
యమునాభేదన హలధర కృష్ణ
బుద్ధాకార కృపాకర కృష్ణ
కల్కిశరీర జనార్దన కృష్ణ
గోవింద మునీశ్వరనుత కృష్ణ
నిర్మలకమలదళేక్షణ కృష్ణ
శ్రీధర పీతాంబరధర కృష్ణ
పాతకకాననపావక కృష్ణ
వనమాలాకౌస్తుభధర కృష్ణ
కింకరసంచయకల్పక కృష్ణ
యోగేశ్వర పురుషోత్తమ కృష్ణ
అచ్యుత గీతాశాస్త్రద కృష్ణ

శ్రీ

# రాధికాకృష్ణస్తోత్రప్రారంభః



శ్లో॥ శ్రీగోలోకాధికారిణ్యై రాధికాయై నమోనమః
శ్రీగోలోకనివాసాయ శ్రీకృష్ణాయనమోనమః॥
జగత్కారణకారిణ్యై రాధికాయై నమోనమః
జగదుత్పత్తిబీజాయ శ్రీకృష్ణాయ నమోనమః॥
సర్వామరనుతాఖ్యాయై రాధికాయై నమోనమః
యోగిజేగీయమానాయ శ్రీకృష్ణాయ నమోనమః॥
వృషభాను తనూజాయై రాధికాయై నమోనమః
నందగోపాలపుత్త్రాయ శ్రీకృష్ణాయ నమోనమః॥
దివ్యజాంబూనదాభాయై రాధికాయై నమోనమః
దేవరాణ్నీలవర్ణాయ శ్రీకృష్ణాయ నమోనమః॥
రాకాశీతకరాస్యాయై రాధికాయై నమోనమః
జితపూర్ణేందు వక్త్రాయ శ్రీకృష్ణాయ నమోనమః॥
నవేందీవర నేత్రాయై రాధికాయై నమోనమః
శుక్లవర్ణాంబుజాక్షాయ శ్రీకృష్ణాయ నమోనమః॥
జితపల్లవపాదాయై రాధికాయై నమోనమః
రక్తాంభోజ ప్రపాదాయ శ్రీకృష్ణాయ నమోనమః॥
నానాలంకారయుక్తాయై రాధికాయై నమోనమః
కౌస్తుభాభరణాప్తాయ శ్రీకృష్ణాయ నమోనమః॥
శ్యామలాంబరధారిణ్యై రాధికాయై నమోనమః
శుద్ధకాంచనచేలాయ శ్రీకృష్ణాయ నమోనమః॥
రాసమండలసంస్థాయై రాధికాయై నమోనమః
రాసక్రీడావినోదాయ శ్రీకృష్ణాయ నమోనమః॥

బృందారణ్యవిహారిణ్యై రాధికాయై నమోనమః
బృందావనవిహారాయ శ్రీకృష్ణాయ నమోనమః॥ ౧౨
కృష్ణవామదిశాస్థాయై రాధికాయై నమోనమః
రాధాలింగితదేహాయ శ్రీకృష్ణాయ నమోనమః॥ ౧౩
భక్తకామ్యార్థదాయిన్యై రాధికాయై నమోనమః
దాససందోహకల్పాయ శ్రీకృష్ణాయ నమోనమః॥ ౧౪
హరేర్మానసమోహిన్యై రాధికాయై నమోనమః
రాధికాచిత్తచోరాయ శ్రీకృష్ణాయ నమోనమః॥ ౧౫
దయాపూరితచిత్తాయై రాధికాయై నమోనమః
కృపాపూర్ణహృదబ్జాయ శ్రీకృష్ణాయ నమోనమః ౧౬
రాధికాకృష్ణయోస్తోత్ర మిదం పాపప్రణాశకం
భక్తిముక్తిప్రదం ప్రోక్తం విక్రమేశ్వరవర్మణా॥ ౧౭

ఇతి శ్రీరాధికాకృష్ణస్తోత్రం సంపూర్ణమ్.

---

శ్రీ

## గీతాయోగానుక్రమణికా.

---

శ్లో॥ విషాద సాంఖ్య కర్మాణి జ్ఞానయోగ శ్చతుర్థకః
కర్మసన్యాసయోగోఽభూ దాత్మసంయమ ఏవచ॥ ౧
విజ్ఞాన మక్షరపరబ్రహ్మయోగ స్తథాష్టమః
రాజవిద్యారాజగుహ్య విభూతీ విశ్వరూపదృక్॥ ౨
భక్తిశ్చ క్షేత్రక్షేత్రజ్ఞ గుణత్రయవిభాగకౌ
పురుషోత్తమాప్తి ర్దైవాసురసంపద్విభాగకౌ॥ ౩
శ్రద్ధాత్రయవిభాగశ్చ మోక్షసన్యాస ఏవచ
అష్టాదశైతే యోగాశ్చ గీతాశాస్త్రేతు విస్తృతాః॥ ౪

---



గిరీశనందనీశో వా క్షీరాబ్ధితనయావరః।
శ్రీదేవీసహితో భూత్వా పాతు మాం శరణాగతం॥ ౧

ధృతశార్దూలచర్మో వా జితహేమాంబరావృతః।
శ్రీదేవీసహితో భూత్వా॥ ౨

వాజీభూతమహోక్షో వా విహంగపతివాహనః।
శ్రీదేవీసహితో భూత్వా॥ ౩

కపర్దచంద్రచూడో వా కిరీటవరరాజితః।
శ్రీదేవీసహితో భూత్వా॥ ౪

శుద్ధస్ఫటికవర్ణో వా నవీనవనదద్యుతిః।
శ్రీదేవీసహితో భూత్వా॥ ౫

కపాలశూలహస్తో వా శంఖచక్రగదాధరః।
శ్రీదేవీసహితో భూత్వా॥ ౬

సూర్యేందువహ్నినేత్రో వా పుండరీకదళేక్షణః।
శ్రీదేవీసహితో భూత్వా ౭

కైలాసనగనాథో వా వైకుంఠపురనాయకః।
శ్రీదేవీసహితో భూత్వా॥ ౮

శ్రీసహితాష్టకం పుణ్యం తాపత్రయనివారణం।
రచితం భక్తిభావేన శ్రీవిక్రమేశవర్మణా॥



# వర్షర్తువర్ణనము.



## గీతితతి.

ప్రాజ్ఞుఁడు తులసీదాసుండు ♦ వానకాఱు
నిట్లు వర్ణించి యున్నవాఁ ♦ డెసక మెసఁగ:—
విరతగృహా లిందిరేశకిం ♦ కరులఁ జూచి
సంతసంబున నృత్తంబు ♦ సలుపునట్లు
కాలజలదపంక్తిని బొడ ♦ గాంచి కేకు
లాడు చుండెడు సంతోష ♦ మతిశయిల్ల.
ఖలుని ప్రేమ మస్థిర మయి ♦ నిలుచుపగిది
మెఱుపు గడుఁజంచలంబుగ ♦ మెఱయుఁ గాదె?
విద్య గలసజ్జనుఁడు వంగి ♦ వెలయుమాడ్కి
వనభరితమేఘతతి భూమి ♦ పైకి వ్రాలు.
హీను కాఱుల బుధుఁడు స ♦ హించుకరణి
రాలుచినుకులఁ బర్వత ♦ రాజి సైఁచు.
నీచుఁ డల్పసంపద గల్గ ♦ నిక్కురీతిఁ
గురిసి నంతనె సెలయేళ్లు ♦ గరము పొంగు.
మాయిజీవుండు మలినుఁడై ♦ మనెడుమాడ్కిఁ
బుడమిఁ గూడుచు సలిలంబు ♦ బురద యగును.
ఒప్పుగుణరాశి సుజనుల ♦ నొందుభంగి
నీరము సరోవరంబులఁ ♦ జేరు చుండు.
జీవుఁ డాత్మఁ జేగిన శాంతిఁ ♦ జెందుకరణి
నదులనీ రబ్ధిఁ గదిసినం ♦ ద్వ్యర శమించు.
మంచిగ్రంథముల్ నాస్తిక ♦ మనుజతతి వి
తండులవలన నడు గంటి ♦ యుండుదేవఁ

దెలియుమార్గంబు పచ్చని ◆ తృణమువలనఁ
గప్పఁబడి తెలియఁగరాదు ◆ కన్నులకును.
బ్రహ్మచారులు వేదంబు ◆ వల్లె వేయు
కరణి నీసమయంబునం ◆ గప్ప లఱచు-
సుజను వంది వివేకము దోఁచు ◆ చొప్పునఁ గడ
వృక్షతతిఁ బల్లవము లంకు ◆ రించు చుండు.
యోగ్యశాశిత్రస్థలముల ◆ నుండుఖలుల
యత్నములు గొన స్సాగక ◆ యఱువిధమున
నెన్న జిల్లేడు మొదలగు ◆ కొన్ని చెట్ల
యాకు లిలమీఁద రాలేడు ◆ వ్యర్థముగను.
క్రోధవశమున ధర్మంబు ◆ గుంకుభాతి
వానవలనఁ బరాగంబు ◆ లీన మగును.
మేలు సేయువారి ధనంబు ◆ మెండుకొనెడు
రీతిఁ బొలములపైరు స ◆ మృద్ధి గాంచు.
నాస్తి కులప్రభ వోలె ఘ ◆ నాఘనయుత
నిశల ఖద్యోతరాజి రా ◆ జించు చుండు.
కడు స్వతంత్రు లగు చేడె ◆ చెడెడుమాడ్కి
నధికవృష్టియుక్త క్షేత్ర ◆ మఱును గాదె.
బుధుఁడు మదమోహయుగళంబు ◆ బుచ్చుపగిది
విజ్ఞకృషికుఁడు గాదమ్ముం ◆ బెఱికి వేయు.
ప్రకటకలికాలమందు ధ ◆ ర్మంబుఁ బోలెఁ
జక్రవాకాదిఖగతతి ◆ సనెడు నిపుడు.
తెలివి గల వారి హృదిఁ గోర్కె ◆ గలుగ నట్టు
లూషరక్షేత్రమునఁ దృణ ◆ మొదవదు గద.
ఒప్పిదముగ నేలంబడు ◆ చుండు రాజ్య
మందుఁ బ్రజ లభివృద్ధిని ◆ బొందుపగిది
నవనితలమున నిక్కాల ◆ మందు సకల
జంతువులు వృద్ధి గాంచుచుం ◆ జనును గాదె?

ఎఱుక గలిగిన పిమ్మట ♦ నెల్ల యింద్రి
యములు శాంతించి నిలుకడ ♦ నందు నట్టు
లెచట నుండెడు తెరువరు ♦ లచటనె నిలు
తురు గదా మెండుగా వాన ♦ గురియుకతన.
విగుణ పుత్త్రుఁడు గలిగిన ♦ పిమ్మటఁ గ్గుల
ధర్మములు నిలువక వేగ ♦ తరలుఫక్కిఁ
దనరుపత్రికూలచండవా ♦ తంబువలన
వృద్ధి గనినసీరదపంక్తి ♦ యెగిరి పోవు,
సజ్జనసహావాసంబుచే ♦ జ్ఞానము మఱి
కుజనసంగతి నజ్ఞత ♦ గూరురీతి
జలజబాంధవకాంతిచే ♦ వెలుఁగు మఱియు
మబ్బుచేతను జీఁకటి ♦ మలయుఁ గాదె.
దీనిఁ బూని శ్రీవిక్రమ ♦ దేవవర్మ
యనువదించె హిందీనుండి ♦ యాంధ్రమునను.

---

# శరదృతువర్ణనము.

గీతితతి.

సాధువు తులసీదాసుండు ♦ శరదృతువును
బొగడి యున్నవాఁ డిట్టులు ♦ పోలు పెసంగ:—
వృష్టిసమయుము వృద్ధత ♦ నెనయునట్లు
తెల్లు పుడమిని నిండారి ♦ పెల్లుపూచు.
పిసినికి ముదంబు సమసెడు ♦ విధమునఁ బథ
గతజలం బెల్ల నింకు న ♦ గస్త్తి దోఁప.
బుధునిహృదయము గతమద ♦ మోహ మగుచు
నిర్మలం బగుగతిఁ దటి ♦ నీసరోవ

రముల సలిలము విమలమై ♦ ప్రాణిసమితి
మనముఁ గరము నాకర్షించుఁ ♦ గనిన దాని.
జ్ఞానిమమత వోవుపగిది ♦ నదసరోవ
రములసలిలంబు శుష్కించుఁ ♦ గ్రీష్మము గాను.
సమ్నయమున సుకృతము ప్రకా ♦ శమగుమాడ్కి
ఖంజనము లగపడు శర ♦ త్కాలమందు.
* నీతినిపుణనృపుని కార్య ♦ నిచయ మట్లు
పంకరేణురహితభూమి ♦ వఱలుఁ గరము.
బహుకుటుంబి సంపద లేక ♦ వగచురీతి
ఝషవితతి నీరు లేక వి ♦ చార మొందు.
నృహరిరతు లిచ్ఛ లేక వ ♦ ర్తించుపగిది
విశదముగ నింగి దగు మేఘ ♦ వితతి లేక
ఖండభక్తిసంయుక్తున ♦ కుండుభక్తి
వలె నపుడపుడు మాత్రము ♦ వాన యడరు.
నాలుగాశ్రమములనుండు ♦ నరులు భక్తి
నొదవినం బరిశ్రమమును ♦ వదలుభాతి
నృపులు భిక్షుకు ల్వాణిజులుఁ ♦ దపసులుఁ దమ
నెలవులను బాసి యేగుదు ♦ రెలమి నిపుడు.
హరిశరణ మొంది వర్తిల్లు ♦ నరుఁడు వోలె
లోఁతునీట నుండెడుచేఁప ♦ లు సుఖియించు.
సత్యనిర్గుణబ్రహ్మంబు ♦ సగుణ మగుచుఁ
దోఁచి నట్టులె వికసిత ♦ తోయజములు
గలిగినవి యై సరస్సులు ♦ గన్నులకతి
మోద మొసగూర్చు నిక్కాల ♦ మునఁ గనంగ.
భ్రమరసంఘాత మనుపమ ♦ ధ్వని నొసర్చు;
లలితఖగపాళి గూసెడుఁ ♦ బలువిధముల.
పరులసిరిఁ గాంచి దుర్జను ♦ ల్వగచుభంగి

* పాఠాంతరము:— విగతదుర్జయనృపకార్య ♦ వితతిభాతి.

క్షపను బొడగని చకోరివా ♦ కములు గుందు.
పురహారదోహి సుఖముఁను ♦ బొంద నట్లు
చాతకావళి గడుడప్పి ♦ చేతఁ బొగులు.
సాధుదర్శన మఘమును ♦ జంపురీతి
విమలశశి శారదాతప ♦ శ్రమ మడంచు.
భక్తు లిందిరేశుని జూచు ♦ వడువునం జ
కోరనులు శశిఁ బొడగాంచుఁ ♦ గుతుకమునను.
కులము ద్విజులదోహముచేతఁ ♦ గ్రుంకుకరణి
నీఁగలును దోమలును జచ్చు ♦ హిమమువలన
సద్గురువు లభించుటచేత ♦ సంశయమును
భ్రమమును దొలంగుభంగి శ ♦ రత్సమయము
వచ్చుటంజేసి పుడమిని ♦ బఱఁగుకీట
సంచయ మెఱుంగఁ బడక రౌ ♦ చనను గాదె?
దీనిఁ బూని శ్రీవిక్రమ ♦ దేవవర్మ
యనువదించె హిందీనుండి ♦ యాంధ్రమునను.

---

## బుద్ధిహీనులు.



[తేఁటగీతులు.]

ఆయ మెన్నక వ్యయమును జేయువారు
ఋణముఁ జేసి నేలను గొన నెంచువారు
విత్తమును బొంద లోభుల వేడువారు
జూదమున సొమ్ము గడియింపఁ జూచువారుఁ
గుడవకయు సీయకయు సొమ్ముఁ గూర్చువారుఁ
గులటఁ బెండిలి యై యాసఁ గొనెడువారు
మిసిమిగలబాలఁ బెండ్లి యామునలివారుఁ
బై మెఱుంగును గని నంత బ్రమయువారు

నెమ్మి వెలయాలిపలుకుల నమ్మువారు
బలము గలిగియుఁ బని మాని మెలఁగువారు
అలవి గాని దానిని జేయ వలచువారు
విగతకార్యంబులకొఱకు వగచువారు
స్వప్రతిభఁ జెప్పుకొని తుష్టి పడెడువారు
బరులదోషంబులనె యెంచి పలుకువారు
నితరజను లజ్ఞులని నిశ్చయించువారు
దామె విజ్ఞుల మని మదిఁ దలఁచువారు
ననియమార్ధ్యంబునఁ గడంగి యరుగువారు
నైహికసుఖంబె పురుషార్థ మనెడువారు
జగదధీశుండు లేఁ డని చాటువారు
బుద్ధిహీను లౌదురు సుమీ పుడమియందు.

---

## వానకారు.

సీ॥ వానకారున రెండవపక్షనిశిని
మబ్బుచేతను శశి లేమి మహిని నింట
సాంద్రతమ మగుతమము ప్రసారితమయి
యాఋతువుకాళికాయుక్త మగుటఁ జాటు.
మెఱుము దానివెలుఁగు నాల్క; యుఱుము భయద
గర్జనము; గాలి హాసనము; కరక లెన్న
మాలయందలిశిరములు; రాలువాన
యాతలలనుండి కాఱెడునస్ర మరయ
నలుపుతో నొప్పునష్టదిక్కులె పటంబు
కరము వెఱపించునారూపుఁ గనుచుఁ బిఱికి
రిక్కగమి మబ్బుచాటున నక్క; భక్తి
గలకృషీవలసంతతి యలరు మదిని॥

---

# నీతికందవ్రాతము



శ్రీరాధాసుందరముఖ
సారసమధుపా! ముకుంద! సభ్యతకై సొం
పారఁగఁ గందవ్రాతము
నేరచియించెదను నీతినిచయము వెలయన్.

కేశవ! భావింపంగా
నాశౌన్వితజనుఁడు దాసుఁ డగు నందఱకున్
దేశాధిపత్య మున్నను
లేశంబును సుఖముఁ బొంద లేఁడు దనమదిన్.

నారాయణ! యాపదచే
కూరెడుసమయంబునందుఁ గొంచెం బయినన్
ధీరతఁ బాయడు గాదే!
ధీరవరునిమానసంబు దృఢతర మగుటన్.

మాధవ! కామము లోభముఁ
గ్రోధము సజ్జనునిగఁ జేయుఁ గోవిదు నైనన్
బోధమును గోలుమనుజుఁడు
దాధీ సిడనీక వానిఁ దరలింపఁ దగున్.

గోవింద! యమృత మయినను
వావిరి యగునేని గరళభావము నొందున్
గావున వివేకి మితముగ
నేవస్తువు నైన వాడుటే యుక్త మగున్.

శ్రీవిష్ణూ! యధికముగా
నేవానికిఁ దెలియు వానిహృదయము సందే
హావృత మై వర్తించును
భావింపఁగ నీదుమాయ బహుచిత్రముగా.

మధుసూదన! మూఢుఁడు బహు
విధముల గౌరవము నొంది వెలయుచు నుండన్
బుధశూన్యము లగుపట్టుల
నుధ దొరకనిచోటునందు సుద్దవిధముగన్.

కనఁగఁ ద్రివిక్రమ! యెవ్వం
డొనరించెడుచేత వాని కొప్పుగఁ దోఁచున్
పను లన్యు లెంతబాగుగ
నొనరించిన వానియందు నోగె యగపడుఁగా.

కులమును గని చుట్టఱికము
సలుపుజనుఁడు వామనా! సుసౌఖ్యము నొందున్
స్థల మెఱుఁగుచు వసియించినఁ
గలుగదు గద మదికి వంత గా నంతయినన్.

వాసన కర్మఫలం బగు
వాసనవలననె జనించుఁ బ్రాణివితతికిన్
వాసిగ స్వభావము కనక
వాసా! శ్రీధర! గజాధిపతిపరిపాలా!.

గుణికంటె హృషీకేశా!
గుణివేషధరుండు దోఁచు గురుతరునివలెన్
మణివరముకంటెఁ గృత్రిమ
మణి దగు రమ్యతరకాంతిమంతం బగుచున్.

బొంకొకటి గప్పఁ బూనుచుఁ
గొంకక పది బొంకునుడులఁ గూయుదురు ఖలుల్
సంకటసమయము నందును
బొంకరు గద పద్మనాభ! పుణ్యాభిరతుల్.

పావిరి సమ్మెటవేటులు
పావకునకు లోహసహితవాసమువలనన్,

గావున దామోదర! కుజ
నావలిసహవాస మధికహానిదము సుమీ.

శంకభయంబును లోకా
తంకంబును జిత్తమునకుఁ దగులనికతనన్,
సంకర్షణ! దుర్మార్గుఁడు
జంకక రొనరించు నెగ్గు సామికి నైనన్.

నాలుకకొన నమృతంబును
హాలాహల మెదిపి యుదరమం దుండుట నా
భీల మగుఖలునిచేరిక
వెళమ శ్రీవాసుదేవ! వర్జింపఁ దగున్.

తులసీవనిఁ బ్రద్యుమ్నా!
కలంజము జనించుమాడ్కిఁ గాపురుషుఁడు స
త్కులమున నరుడుగఁ గలిగి వి
మలకులమర్యాద నగ్నిమంటం బెట్టున్.

అనిరుద్ధా! కుచ్ఛితకుల
మున నొకసమయంబునందుఁ బాడమును గాదే?
యనవద్యగుణుఁడు బొగ్గుల
గనియందు వినిర్మలమణి గలిగెడుభంగిన్.

పురుషోత్తమ! కడులెస్సగఁ
బరికింప జగంబునందుఁ బామరులును ధీ
వరులును లేరు నిజంబుగ
నరుమది భ్రమ కెఱుకకు నదనం బయి తగుటన్.

పండితుఁడు మితాలాపి య
పండితుఁడు సదస్సునందు వదరును మిగులన్
నిండినకుండ యధోక్షజ!
యుండుఁ దొణక కెపుడు నద్ది యూఁపంబడినన్.

నూతనము శ్రేయ మనియుం బు
రాతన మతిహేయ మనియుం బ్రాజ్ఞుఁడు నరసిం
హా! తలఁపకుండ నెరపును
బ్రీతిని దత్త్వం బెఱింగి విమలమనముచేన్.

ఘనికునిచెంతకు యాచక
జన మచ్యుత! యేగు నితరసన్నిధి కెపుడున్
జనదు గుడ ముండుతానం
బునకుం బిపీలికసమూహము సనును గాదే?

తనయుసు రేగినను జనా
ర్దన! మానము విడువ లేఁడు తతవీర్యుఁ డెటుల్
గన మానవిహీనుఁడు జీ
వనమునె కడు దొడ్డ దనుచు భావన సేయున్.

తలపంగ ఘనునివచనము
శిలాక్షరమువోలె మిగులఁ దిర మై యొప్పున్
జలలిపివిధమ్ముగ నీచుని
పలు కస్థిరభావ మొంది పరఁగు నుపేంద్రా!

నరునకు స్వకీయదోషము
గురిగింజవిధంబుగాను గోచర మగుఁ గా
పరుఁ డొనరించినదోషము
ధరాధరమువోలెఁ దోఁచుఁ దనమదికి హరీ!

శ్రీకృష్ణ! యసంతృప్తుఁడు
నాకమునకుఁ జనిన మేరునగముం గనినన్
లోకేప్సితసుఖముం గన
లేకుండును జుమి విషాదలిప్తహృదయుఁ డై.

# జగన్నాథ నిందాస్తుతి.



## గీ తి త తి.

ఓజగన్నాథుఁడా! నిన్ను నోకృపాన
    ముద్రి! యనుచును బిలుతురు భూరి భీతి
నంతె కాక నీ కా పేరు సుంతయేని
    చనునె? నీహృదిఁ గరుణారసమ్ము గలదె?॥

పాలొసంగెడు భామినిప్రాణములను
    గొనెడునిను వెందుఁ గలదె? పూతనను బూర్వ
మేమి చేసితివో స్మరియించు కొనుము
    మఱచినను మాత రేణుక న్మనసునుండి॥

జనులప్రాణము ల్దిను కాలసర్ప మవుగ
    యరయ నీకుఁ బాముకు సామ్యంబు గలదు
చక్రిచిహ్న మఁటుట దానిఁ జక్రి యండ్రు
    చక్రిహస్తుండ వగునీవు చక్రివి గద?

భోగ మని పడగకు నండ్రు పొంది దాని
    నద్ది భోగి నామంబుతో నమరు చుండు
భోగము లనేకములు గల్గుపురుషవరుఁడ!
    యెట్లు భోగివి గావో నీ వెంచఁ గలవె?॥

అన్ని చోట్లఁ జరింపకే యహియనియెడు
    సర్ప మనెడునాఖ్యల నద్ది చాటఁ బడెడు
నన్ని నెలవులఁ జరియించు నచ్యుతుఁడవు
    చెల్ల వే నీకు నారెండు పేళ్లఁ దలఁప?

కుండలమువోలె నది చుట్టుకొనుట జనులు
    దానిఁ గుండలి యందురు గాని దివ్య

కుండలంబులు గలనీకె కుండలి యను
　　నామ మెంతయు నొప్పు నెన్నంగ మదిని॥

నడుచుటం బాదములు లేక నాగపన్న
　　గాఖ్యలను బొందె నద్ది; నిరంఘ్రి వగుచు
ఋషుల మానసంబులఁ జరియించు నీకు
　　నొప్పు చుండెడు నానామయుగ్మ మభవ!॥

అడుగు లిలఁ గాన రామి గూఢాంఘ్రియనుచు
　　బలుకఁ బడు నద్ది; నీపాదములు విరించి
కైనఁ గానంగఁ దర మానె? కాన నీదు
　　పట్ల నానామధేయ మన్వర్థ మగును॥

అద్ది చక్షుశ్శ్రవోనామ మందుఁ దనదు
　　కనులతోడనే వినుచుంట కతనఁ, జెవులు
లేక వినువాఁడ వగునీకు నోకజాక్ష!
　　చెల్లదే తదాఖ్య నిడంగఁ? జెప్పు మీవ॥

కుటిలగతి భుజగాఖ్యను గొనియె నద్ది
　　నీవు భుజగుఁడ వలగొల్ల నెలతలకును
అద్ది మంత్రివశ్యంబు; నీ వరయ నామ
　　మంత్రివశ్యుండ వగుదు రమాకళత్ర!॥

ఇంత చాలదే? నీగుట్టు నింక బైటఁ
　　బెట్టినంతన నగుదురు పెఱలు విన్న
నీకు దాసుండఁ గావున న్నెనెఱుంగఁ
　　గొదవ గలుగదు; చెడదు నీగొప్పతనము॥

ఇంతయే కాకుఁ జాలు నాయ్యంతమందుఁ
　　జెలిమి నీపేరు స్మరియింపఁ జేసి పిదప
నీకు నిచ్చకు వచ్చెడునెలవు నిమ్ము
　　నామదేవపూజితదేవ! వాసుదేవ!

---

# మాయామహత్త్వము

శాస్త్రవిజ్ఞాని డార్విను జడమునుండి
యొకటిక జనియించె నని నమ్మె దృఢముగాను.
జయయుతుండు ధీరుఁడు నెపోలియను మూషి
కమును గనినంతనే భీతిం గలఁగు చుండె.

పండితప్రవరుఁడు గేటె పణ్యవీధి
వేఁపిఁ జూచినంతన కడు బెదరు చుండె.
జితవిరోధి యాౙమార్షలు పేకు పిల్లిఁ
జూచినంతనె మిక్కిలి స్రుక్కు చుండె.

ఇలఁ బ్రసిద్ధిఁగాంచినరాణి యెలిజబెత్తు
చా వనెడిమాట వినినంత జడియు చుండె.
కవులలో మేటి బైరను భువిని చేత్రిత
చయము గల దని నమ్ముచు జంకు చుండె.

దివ్య మగువక్త బ్రాడ్లా సుధీవరుండు
జగదధీశుండు లేఁ డని చాటు చుండె.
హింస వల దనుగాంధి దా నియ్యకొని మోఁ
గూల్చుటకు రోగపీడితగోవు నకట!

ప్రమకు మాఱుగా నిటువంటిభ్రమ గలుగుట
మాయయొక్క మహత్త్వమె మదిఁ దలంప.

# పూరుషుండు.

గీ॥ ఇడుమ గలుగంగ ధైర్యంబు విడనివాఁడు
కడఁగుపని ముగింపం బట్టు గలుగువాఁడు
దైన్య మెప్పుడు నొందక తనరువాఁడు
పుట్టువారిలో నిక్కంపుఁబూరుషుండు.
న్యాయ మెపుడును విడువక నడుచువాఁడు
చెప్పుభంగిఁ గార్యంబులఁ జేయువాఁడు
పిఱికితనమును మదినుండి పెఱుకువాఁడు
పుట్టువారిలో నిక్కంపుఁబూరుషుండు.

ఉ॥ ధూపము గాలుచు న్మనుజతుష్టిఁ బొగం దగఁ జేయు చుండఁగా
దీపము గాలుచుం దనదుదీప్తిని లోకుల కిచ్చు చుండఁగా
శ్రీపతిభక్తుఁడై జనులసేమము సేయఁ గడంగుపూరుషుం
డాపద కింక మిత్తికి రవంతయు జంకునె? పూన్కి మానునే?

---

గీ॥ శశికి జ్యోత్స్నకు మఱియును సవిత కాత
పమునకుం గల భేదమే బ్రహ్మమునకు
జీవునకుఁ గల దంచు వచించుఁ జుమ్మి
మనుజవితతికిఁ జైతన్యమతవరంబు॥

పాఠాంతరము.

గీ॥ శశికి జ్యోత్స్నకు మఱియును సవిత కాత
పమున కెటువంటి భేదమో బ్రహ్మమునకు
జీవునకు నట్టిదే యని చెప్పుఁ జుమ్మి
మనుజవితతికిఁ జైతన్యమతవరంబు॥

# దశావతారతత్త్వము.



గీ॥ జగమునకు నాది జల మాట జలచరంబె
యాదిఁ బ్రభవించె నని మీన మవనిఁ జాటు
ధరణి గోత్రిత్త్రగఁ గలుగంగ స్థలజలచర
సమితి ప్రభవించె నని చాటు కమఠవరము
అతిరజోగుణాయుతమృగ మవలఁ బొడమె
ననుచుఁ బ్రకటించుఁ గద వరాహంబు దలఁప
అవల మృగనరగుణయుతవ్యక్తిచయము
పొడమె నని చాటు నరసింహమూర్తి యెన్న
పదపడి యపూర్ణమానవు లొదవి రనుచు
వామనావతారము సేయుఁ బ్రకటనంబు
మొదట నరులు రజోగుణపూర్ణు లనుచుఁ
బరశురామావతారంబు బయలు పఱచు
పిదప నిక్కంపుగృహమేధి వెలయఁ గలిగె
ననుచుఁ దెలుపును శ్రీరామజనవరుండు
అవల నరులకు మూఁడవయాశ్రమంబు
గలిగె నని ప్రకటించెడు బలుఁడు గనఁగ
సత్యగుణరాశి సన్న్యాసి సంభవించెఁ
బిదప నని బుద్ధరూపంబు వెల్లడించు
దుష్టహరుఁడు సజ్జనసుఖదుండు నైన
స్వామి గలిగె నావల నని చాటుఁ గల్కి
చూడ రామత్రయము పరశువును గార్ము
కాశుగములను హలమును హస్తములను

దొడుగుట్టవి సాటు మనుజులు దొల్లివనుల
నఱుకు టూవలఁ బోరు టనంతరంబు
పుడమి దున్నుట క్రమముగాఁ బొడమె ననుచు.

---

సత్యమును బాయఁ జన దని; సాధుజనుల
సాయమును జేయ వలె నని; జన్మభూమిఁ
గారవించుట దగు నని; కడఁగి శ్రితుల
సాఁక వలె నని; మఱి బ్రహ్మచర్య మొనరఁ
జేయ వలె నని; శత్రుల శేష ముంపఁ
దగ దని; గృహస్థధర్మంబు దగ నొనర్ప
వలె ననియు; నుదాసీనత భవ్య మనియు;
రాగరాహిత్యమే సుఖప్రకర మనియు;
ధర్మసంస్థాపనంబు కర్తవ్య మనియు;
దెలుపు నవతారముల కార్యములు జనులకు.

---

## గర్వి యగు రాజు.



గీ॥ కన్ను లుండియు ననదలఁ గాంచ కుండు
వీను లుండియు మనవుల వినఁడు సుమ్ము
నోరు గలిగియుఁ బలుకఁడు దీరుగాను
జేతు లుండియుఁ బనులను జేయ కుండుఁ
బదము లుండియు నడువఁడు బాట నెపుడు
హృదయ ముండియుఁ గృపఁ బూనఁ డించు కైన
లోకనిందకు మది జంకు లేక యుండు
గర్వి యగురాజు శవతుల్యుఁ డుర్వియందు॥

# బాలబోధము.



గీ|| తల్లిదండ్రుల ననవరతంబుఁ బూజ
సలుపుచుండ బాలనము సేయ వలయుఁజుమ్మి
ఒదిఁగి యుండుము పెద్దలయొద్ద నీవు
నడువు మీవిశ్వవిధులను గడవ కుండ
సుస్థములుగ నుంచుము మనస్సును దనువును
పనులఁ జేయుము యోచించి బాగుగాను
అప్పుఁ గొను టగుఁ జుమ్మి నింద్యమ్మ దలఁప
దానిఁ గొన నగు నేని బిఱానఁ దీర్పు
ఇరువునకుఁ దగునట్లు మందిరముఁ గట్టు
చేయు నిజవృత్తిని దురాశఁజెంద కుండ
దరను దగ్గించి యమ్మకు ధాన్యములను
అరక్కజదినంబున శుభ మభ్యఁజనంబు
ఇల నిరోధ ముత్తమము; నిర్వృతి యధమము
పరులయావుల నడ్డగింపకుము నీవు
పెఱల కెఱిఁగింపకుము నీదువిత్తగరిమ
ఇచ్చుదాని గ్రహీతయె యెఱుఁగు టొప్పు
దానధర్మములను జేయఁ బూను మెపుడు
ఇతరులకు నిచ్చి పిమ్మట నే భుజింపు
శాస్త్రకథితంబులందు నశ్రద్ధ దగదు
నిక్కముగ నెఱింగినదానినే నుడువుము
అన్యులను వేఁడు టది నైచ్య మగుచు జుమ్మి
చనెడువఱకు సద్గ్రంథంబులను జదువుము
పలుకుచుండుము ప్రియవాక్యములనె యెపుడు
కపటమైత్రి యుపద్రవకరము సుమ్మి
విషయసక్తుల సంగంబు విడుచు టొప్పు

సజ్జనులమైత్రినే సదా సలుపఁదగును
పొదల నీయకు మెప్పుడును మదినివంత
సతత మఖిలాధిపతిభక్తియుతుఁడ వగుము॥

---

## నీతిగీతులు.



తనువు శుష్కింప వాడును మనసు; దాన
బుద్ధిబలమడుగంటుట పొసఁగుఁగాన
జనుఁడు సుస్థముగా నిజతనువునుంప
సర్వదా యత్నమొనరింపఁ జనును గాదె?
జనుఁడు మితిలేనిబంగారుఁ దనగృహమున
కూర్ప సర్వదా చింతతోఁ గుందుచుండుఁ
గాని మృతినొందుతఱిఁ జిల్లిగవ్వనైన
బాళిఁ దనవెంటఁ గొనిపోవఁ జాలఁ డకట!
ధనమునందును బ్రతుకునందును నరుండు
దనివిఁ గనఁడెంతధనముఁ బొందినను మఱియుఁ
బొందఁగోరును; శతవర్షము లిల మనిన
మఱియు మని యుండఁగోరును మమతవలన.
అంత చనుటకంటెఁ గొంత దక్కుట మేలు
కునృపనగరికంటె వనము మేలు
మానహానికంటెఁ బ్రాణహానియె మేలు
పడఁపుఁగూడుకంటెఁ బస్తు మేలు.

---

## చమత్కార గీతియుగము.



ఏద్ది తృష్ణాకరము? శశి కెద్ది గుఱుతు?
చిన్నికృష్ణుండు వ్రజమునఁ జేసె నెద్ది?
నిసువ దేమగు? నాగుఁబా మొసఁగు నెద్ది?
యెద్ది సురలకు సంతస మొసఁగఁ జేయు?
నోయి కెట్టి సంస్కృతరూప మొనవు? రాము
మానసము నెద్ది హరియించె? మౌన కనుచు
నొకడుఁ బ్రశ్నింప మఱి యొకం డూఁది పలికె
లలిని "హేమసారంగలీలా" యనుచును॥



## అశ్లీలవిగ్రహవిషయము.

. కొన్ని ప్రాచీనదేవాలయములపై నశ్లీలవిగ్రహములు గలవు గదా. అట్లుండుటకుఁ గారణ మేమి యని కొందఱునన్ను నడుగు చున్నారు.

దేవదర్శనమునకొఱకు నేగువారి మానసనిశ్చలతను బరీక్షించుటకై యట్టి విగ్రహములు నిర్మింపంబడె నని కొందఱును, దేవాలయములకు దృష్టిదోషముదగులకుండుటకై యట్టి విగ్రహములు నిర్మింపంబడె నని మఱి కొందఱును జెప్పుదురు. కాని— మొదటిపక్షమువారి పలుకులె నిజమగునేని, మనపూర్వులను బ్రతారకు లన వలసి వచ్చును. అట్టి విగ్రహములను జూచునపుడు సాధారణజనులమానసము చలింపకుండునా? ఒకయువకునియెదుట మనము గూర్చుండి దబ్బతొనలను నమలుదు మేని వానినో రూరకుండునా? ఇఁక రెండవపక్షమువారిపలుకులే నిజ మగునేని, మనపూర్వులను జ్ఞానహీను లన వలసి వచ్చును. జనులదృష్టిదోషమువలన జాతికట్టడము గూలు నని జ్ఞానులు నమ్ముదురా? కనుక నట్టి విగ్రహములనిర్మాణమునకు వేఱుకారణముండవలెను. నాకుం దోఁచుకారణ మిట వివరింతును.

అశ్లీలము లని యిప్పుడు పరిగణింపఁబడు కార్యములు సృష్టిస్వభావము లగుటవలనఁ బూర్వులు వాని నంతనింద్యములుగాఁ దలంపకుండిరి. నాయీయాశయము సర్వదేశస్థితకవికృతకావ్యసమర్థితము. ఇట్లనుటవలన వారట్టిపనులను బట్టబయటనే చేయు చుండిరనుట నాయుద్దేశ్యము గాదు. ఇప్పటిమనుజు లెవ్వరు నట్టిపనులను బహిరంగముగాఁ జేయ కున్నను, శునకాదిగ్రామ్యమృగములును గుక్కుటాదిగ్రామ్యపక్షులును బహిరంగముగాఁ జేయునశ్లీలకార్యమును జూచి సహించునట్లె, పూర్వు లశ్లీలవిగ్రహములను జూచియు నశ్లీలవర్ణనములను వినియు నవి స్వాభావికము లనునుద్దేశము గలిగి సహించుచుండిరి.

సృష్టింపఁబడు ప్రత్యేకపదార్థమును బ్రకృతియొక్క వికారమే యనియుఁ బ్రత్యేకపదార్థములోపల బ్రహ్మము విరాజిల్లు ననియు నా స్వమతము. ఆమతానుసారముగా జగముయొక్క బహిర్భాగము ప్రకృతిమయము నంతర్భాగము బ్రహ్మమయమును. జీవము గల ప్రత్యేకపదార్థసృష్టికి సమవాయకారణము మిథునకర్మమె యనుట సుస్పష్టము. "బ్రహ్మాండ మేవ పిండాండం" "దేహో దేవాలయః ప్రోక్తః" అను వచనములనుబట్టి జగముయొక్క సూచనయె దేవాలయము; బ్రహ్మముయొక్క సూచనయె దానిలోనిమూర్తి. కనుక దేవాలయముయొక్క బహిర్భాగము ప్రకృతిమయ మని సూచించుటకె యందు నశ్లీలవిగ్రహము లమర్పఁబడెను.

---

## ఆశయము.

---

ఈమాసము (జనవరి 3వ) ద్వితీయసప్తాహప్రారంభమునఁ జెన్నపట్టణమునందు నాంధ్రదేశముయొక్క యోగక్షేమములకొఱకు నాంధ్రమహాసభ జరుగనై యుండుట సమంజసము. జగదీశునికృపవలనఁ దత్సభాకార్యములు యుక్తముగా నెఱవేఱుం గాక!

ఒకానొకప్పుడొకసభఁ గూర్చి యందుఁ గొన్నిప్రస్తావనలు గావించి నంతనె సభ్యులమనోరథములు నెఱవేఱవు. పట్టుదలతోడఁ బనులు సేయు చుండినం గాని కార్యములు సఫలములు గావు.

క॥ పనః తాను బ్రియత్నముచే
తన కా వవి బహుమనోరథము లున్నంతన్
దనగుహ నిద్రించినహరి
ఘనముఖమునఁ జొచ్చునే? మృగప్రకర మెట్టిక॥

కనుక నాంధ్రమహాసభాసభ్యులు సభ ముగిసినతోడనే తమకర్తవ్యము పూర్ణ మయిన దని తృప్తి నొందక వాంఛితకార్యములు సఫలము లగువఱకును యుక్తవిధానముల నాచరించు చుండ వలె నని హెచ్చరించువాఁడను.

చెన్నపట్టణమునందుఁ బ్రకటిత మగు నాంధ్రపత్త్రికారత్నమాంధ్రదేశముయొక్కయుఁ దద్దేశీయులయొక్కయు క్షేమలాభముల కొఱకు మొదటినుండియుఁ దగుశ్రద్ధతోఁ బాటు పడు చున్నది. జగదాధిపతికృపవలన నది యాంధ్రులసమాదరణమువలన వర్ధిల్లును గాక!

---

## 'నన్నయభట్టియుగము'
### (కొన్ని యాక్షేపణములు)



నన్నయభట్టారకుని నివాసస్థానము తణు కనియు, సంస్కృతమహాభారతము నిర్వచన మనియు, నాంధ్రమహాభారతము గద్యపద్యాత్మకముగా రచింపఁబడుట నూతనపద్ధతి యనియు, జంపువుగాఁ గావ్యరచనము ద్రావిడసాంప్రదాయ మనియును గ్రిందటివారపుఁగృష్ణాపత్త్రికయందుఁ బ్రకటిత మయ్యెను.

తణుకు నన్నయ్యనివాసస్థాన మయినట్లు ప్రమాణ మొసంగఁబడ లేదు. ప్రమాణవిహీన మగుసిద్ధాంతము గ్రహింపం బడదు. సంస్కృతమహాభారతమునందు వచనములు గలవు. చంపూరచనము ద్రావిడసాంప్రదాయ మన వీలు లేదు. అది సాంస్కృతసాంప్రదాయమె. తల్లక్షణము:—గద్యపద్యాత్మకం కావ్యం చంపూ రి త్యభిధీయతే॥ ఇతి?

---

## 'నన్నయభట్టయుగము'

నాకుఁ దోఁచుదానిని వెల్లడించుటయె న్నామతము. వాదోపవాదములను బెంచి పత్త్రికల నించి కాలహరము సేయువాఁడను గాను. నామతమ్మును లోకము నిజేచ్ఛానుసారముగా గ్రహింపవచ్చును.

సంస్కృతమహాభారతమునందు వచనములు గల వని నేను దెలిపితిని. దానిని శ్రీయుత శిష్టారామకృష్ణశాస్త్రిగా రంగీకరించిరి. వచన మిట్టు లుండ వలె నని కాని, యింత వట్టు లుండ వలె నని కాని నియమము లేదు. అది ఛందోబద్ధము గా కుండుటయె నియమము.

చంపువు సాంస్కృతసాంప్రదాయమె యని నుడివితిని. సంప్రదాయ మనఁగా గురుపారంపర్యము. సంప్రదాయమె సాంప్రదాయము. బ్రాహ్మణములందును వైదికాఖ్యానములందును సంస్కృతమహాభారతమునందును వచనములు గల వనియుఁ జంపువు గద్యపద్యాత్మకమనియును శ్రీశాస్త్రిగారు సెలవిచ్చుటవలనఁ జంపువు సాంస్కృతసాంప్రదాయమె యని వా రంగీకరించి రనుట దెల్లము. కాఁబట్టి "కృష్ణాపత్త్రిక" యొక్క గతసంచికయందు వెలువడిన వారిసుదీర్ఘప్రత్యుత్తర మనావశ్యకము.

నన్నయార్యుని నివాసస్థాననిర్ణయమునకు సుస్పష్ట మగుప్రాచీన పండితప్రమాణ మియ్యవలెను. ఊహముతోడనె నిశ్చయింపఁబడిన యర్వాచీనులప్రమాణము సంగీకరించుట యసమంజసము. వారు "తణు" కన్న, నేను "పణు" కందును. ఊహమునకు మేర లేదు గదా!

---

## "చాతుర్వర్ణ్యమ్"

"చాతుర్వర్ణ్యం మయాసృష్టం గుణకర్మవిభాగశః" అను గీతావాక్యమున్నందులో "చాతుర్వర్ణ్యమ్" అనుపదమునకు నాలుగుజాతు లని

కొందఱర్థనిర్ణయమును జేయుచున్నారు. అది సరియగునర్థము గాదు. గీతోద్దేశ మట్లే యగునేని "చతుర్వర్ణాః" అని కాని "చాతుర్వర్ణాని" యని కాని యుండి యుండును. అట్లు లేదు. చాతుర్వర్ణ్య మనఁగా నాలుగుజాతులధర్మ మని యర్థము. అనఁగా బ్రాహ్మణధర్మము, క్షత్రియధర్మము, వైశ్యధర్మము, శూద్రధర్మము నని తాత్పర్యము. ఈ నాలుగుధర్మములు సకలదేశములందు నెల్లప్పుడును గలవు.

---

## శ్రీకృష్ణుఁడు జారుఁడా?

సంపాదకమహాశయా,

ఈ నెల (మే 3౮) తే౧౨ది ప్రకటింపఁబడిన భవదీయపత్రికయం దున్న "బృంద" ను జదువుటవలన నాకుఁ గొంచెము మోదమును మిక్కిలిఖేదమును గలిగెను. మోదమునకుఁ గారణము తద్విషయ చమత్కృతి. ఖేదమునకుఁ గారణము యోగేశ్వరుం డయిన శ్రీకృష్ణునియందు జారత్వారోపణము.

శ్రీకృష్ణుఁడు పండ్రెండుసంవత్సరములకంటె నెక్కుడు కాలము గోపీగోపులతోడఁ గలసి యుండ లేదు. ద్వాదశాబ్దముల బాలుఁడు జారుఁ డగునా? అతఁడు రాసక్రీడ సలిపి నట్లు మాత్రము సంస్కృతభాగవతమునందుఁ గలదు. రాస మొకవిధ మగునృత్యము; కాని—జారత్వము గాదు. అర్వాచీనకవులు దమయిచ్ఛకు వచ్చునట్లు పద్యములను బాటలను గల్పించి యతనిని మహాజారునిగాఁ జేసినందులకు మన మందఱమును విషాదింప వలెను. అట్లుండ నతనిజారత్వముకొఱకు నేఁటి కవులుసైతము కథలను గల్పించుట మిక్కిలిఖేదకరము గాదా? తమకథలనాయికానాయకు లగుటకు భారతదేశమునందు ముప్పదియైదుకోట్ల జను లుండ నిప్పటికవులు పురాణస్త్రీపురుషులను దడవ నేల?

గోవిందశబ్దముయొక్క తత్సమప్రథమైకవచనరూపము గోవిందుఁడు; "గోవిందు" కాదు.

[illegible]

---

## "క్త్వార్థేకారసంధి"



"క్త్వార్థేతో నద్భవేత్సదా" అధర్వణకారికావళి.
"క్త్వార్థేతో నైవ సర్వదా" హరికారికావళి.
"క్త్వార్థం బైనయిత్తునకు సంధి లేదు" బాలవ్యాకరణము.
"క్త్వార్థకయికారమునకు సంధి లేదు" వెంకయ్యవ్యాకరణము.

"ఆ॥ వె॥ వారిజాతనేత్ర! క్త్వాప్రత్యయాంతార్థ
ములు వచింతుఁ దెలుఁగుపలుకులకును
బైస్వరంబు లుండుపట్టులఁ బ్రకృతిభా
వంబు గాని సంధి వాటపడదు॥"

అప్పకవీయము.

"గీ॥ ఇడగ వచ్చును ల్యప్పుపై నిత్యసంధి
మాత్ర మొక్కొక్కచోటను మట్టుమీఱు"
కవిసంశయవిచ్ఛేదము.

ఇట్లు లక్షణవేత్తలు తమతమ లక్షణగ్రంథములయందు వ్రాసియున్నవారు. నన్నయభట్టీయ మనంబడు నాంధ్రశబ్దచింతామణియందుఁగాని, అహోబలపండితీయమందుఁ గాని, ఆంధ్రభాషాభూషణమందుఁ గాని, శబ్దలక్షణసంగ్రహమందుఁ గాని, ప్రౌఢవ్యాకరణమందుఁ గాని, సర్వలక్షణసారసంగ్రహమందుఁ గాని యీవిషయ ముదాహరింపఁబడియుండ లేదు. ఈసంధి పనికి వచ్చు నని చెప్పినవారు భారతాదులలోని కొన్ని ప్రయోగములను జూపుచున్నారు. అవి లేఖకపాఠకప్రమాదపతితము లని తక్కినవారు వానిని సవరింప యత్నించు చున్నారు.

పై నుదహరించినసూత్రములనుబట్టి క్త్వార్థేకారమునకు సంధి లేదనువారు కొందఱును, ప్రాచీనకవులలోఁ గొందఱప్రయోగములను బట్టి యట్టిసంధి గల దనువారు కొందఱునుండుటవలనఁ దత్సంధిని గూర్చి మదీయాశయము నిట వివరింతును:—

పైని జెప్పఁబడినసూత్రములందు నప్పకవీయమును, బాలవ్యాకరణమును వెంకయ్యవ్యాకరణమును దత్సంధి గూడ దని సుస్పష్టముగాఁ జెప్పినను, అథర్వణకారికావళియు హరికారికావళియును దానిని గేవలము నిషేధింప లేదు. మఱి కవిసంశయవిచ్ఛేదము గొన్నిచోటులఁ దత్సంధిఁ జేయ వచ్చు నని సుస్పష్టముగాఁ జెప్పుచున్నది. అథర్వణకారికావళీమతమున నది కేవలము నిషిద్ధమే యగు నేని, "నభవేత్సదా" యని యుండక "నభవేత్కదా" యనియె యుండును. హరికారికావళీమతమున నది కేవలము నిషిద్ధమె యగు నేని, "సర్వదా" యని యుండక "సర్వథా" యనియె యుండును. మూఁడు వ్యాకరణము లాసంధి లేమి నిత్యమనియు, మఱిమూఁడువ్యాకరణము లది వైకల్పిక మనియు నుడివెడిని. అట్టిసంధిని జేసినపూర్వకవులమతమును దత్సంధి వైకల్పిక మనియె. కనుక శ్రోత్రశ్రుతి కింపగుచోటఁ దత్సంధిని జేయ వచ్చుననియును వెగటుగా నుండుచోటఁ జేయ రా దనియును నిర్ణయించుట సమంజసము. పరపదము మొదట ఇ, ఈ, ఎ, ఏ లుండు నేని చెవి కింపుగా నుండును. ఉ॥ కో రిచ్చెను; మునిఁ గీఁడెను; అణఁ చెత్తెను; చే సేగెను. పెఱయచ్చులుండు నేని చెవి కింపుగా నుండదు. ఉ॥ వి నడిగెను; వ చ్చాఁగెను; తి నుంచెను; ప ట్టూఁదెను; చే రైక్యము; క నొదిగెను; తలఁ చోర్చెను; అ నొడుకఱచెను.

---

## ధారుణీరూపము.



ధరాధరిత్రీధరణిః (ధరణీ) ఇత్యాదినామములు గలభూమిని "ధారుణి" యని కొందఱు తెలుఁగువారు వాడుచున్నారు. అట్లు వారు వాడుటకుఁ గారణము నన్నయార్యుఁడును నన్నెచోడుఁడును "ధారుణి" యని వాడియుండుటయె. ఆకవీశ్వరు లిద్దఱు వాడినంతనె యారూపము శస్తము గా నేరదు. సంస్కృతశబ్దరూపములను శాసించు నధికారము వారికి లేదు. వారు వాడినంతనె తప్పొప్పు గాదు. తప్పు

తప్పు. "సోమయాజికొడుకు శునకంబుఁ గొట్టిన నది యుచితాచార మనఁగఁ దగునె?" ఆకవీశ్వరులును మనుష్యులె. మనుష్యులకు భ్రమప్రమాదములు గలుగును. కవీశ్వరుల భ్రమప్రమాదములను "మహాకవిప్రయోగ" మనియు, ఋషులభ్రమప్రమాదములను "ఆర్షప్రయోగ" మనియు నందురు. ఆసమాసద్వయతాత్పర్య మట్టిప్రయోగములు వారికె తగును; కాని యన్యులకుఁ దగ దనుటయె- భూమి ధరించునది; కావున "ధారిణి" యనఁబడును. "ధరణి" యొక్క తద్ధితరూపము "ధారణి" యగును. కనుక "ధారిణీ" ధారణి" ధారణీ" రూపములె శస్తము లనియు "ధారుణి" రూపము శస్తము గా దనియు నెఱుంగ నగును.

---

## పయనపుఁజెలికాఁడు

అది వైశాఖపూర్ణిమానిశ. చంద్రబింబ మను "రేరాణిపూవు" జలరాశి యనునిలను గలిగి నీలాకాశ మనునారామమునందు విరాజిల్లు చుండెను. ఎండవేఁడిమిని బొగిలిన పుడమి వెన్నెల యనుగందము నలందుకొని యానంద మొందు చుండెను. విశదఘనశకలములు మలయానిలచలితము లయి తెలియనిస్థలములకు నేగు చుండెను. రిక్కలపిండు నాగరీశరీరాలంకృతాలంకారప్రకరము వలె నక్కడక్కడఁ జక్కఁగా నొప్పు చుండెను.

తొమ్మిదిగంట లయినతరువాత నేను వాల్తేరు రెయిల్వే స్టేషను నకు వెళ్ళి పురికి నేగ నున్న రెయిలు బండియందుఁ గలయొకమూడవతరతిపెట్టెయొక్క కొనగదిలోఁ బ్రవేశించితిని. అది జనశూన్య మయి యుండుటవలన నుత్తరీయమును గప్పికొని యొకబల్లపైని బండుకొంటిని- చింతాశీలు రగుకవులకుఁ గాని, ప్రకృతిశాస్త్రజ్ఞులకుఁ గాని జనశూన్య మగుగది దొరకు నేని వారిమనములందు నూతనవిషయము లుద్భవించుటకు వలను పడును; కాని- నావంటిసాధారణనరున కది నిద్రాస్థాన

మె యగుం గదా! నే నాగదిలోఁ బ్రవేశించినపిమ్మటఁ గాఁబోలు నా చెలికాఁడు నా కెఱుక పడకయె యందుఁ బ్రవేశించెను. అంత నాబండి గూసి కొంతదవ్వు నడచి పిదపఁ బరు గెత్తుచు వాతశ్రోతము నీఁదుచుఁ బోవు చున్నట్లు ప్రతీత మయ్యెను. అప్పుడు నాకుఁ జిన్నకునుకు వచ్చెను. అంత నాచెలికాఁడు నేఁ బండుకొనుటం గని నాముక్కు నొక్క కురిచీ యనుకొని కాఁబోలు దానిపై నధివసింపఁగా నాముక్కు నెవ్వరో సూదితోఁ బొడిచినట్లు తోఁప "జనశూన్యకోష్ఠమునందు సూదితో నా ముక్కుం బొడిచి హాస్య మాడువ్యక్తి యెవ" రని తలపోసి, నేను జడుండను గా కుండుటవలన, "ప్రతిక్రియ సేయుటయె కర్తవ్య" మని భావించి నాచేతిని బై కెత్తి నాముక్కుమీఁదఁ బడ వైచితిని. టక్కరి యగునానెచ్చెలి నాచేతిపాటును దప్పించుకొని కూనరాగముఁ దీయుచు గ్రద్ద వలె నాచుట్టును దిరుగ సాగెను. మఱి కొంతసేపటికి సలసి కాఁబోలు నా మెడను బీటగాఁ జేసి యందు వసించెను. అంతతో నూరకుండక రక్తశోషణచుంబనదానముకొఱకు నాయంగకములఁ దాఁకఁ గడంగుటఁ బరేంగితజ్ఞాని నగునేను గ్రహించితిని. జనుఁడు భద్రవ్యవహారమువలన మిత్రుఁడు నభద్రవ్యవహారమువలన శత్రువు నగును. నాగరకతతో నిండి పిక్కటిల్లునికాలమునందు నానెచ్చెలి యాదిమయుగ జనవ్యవహారమును సలుప యత్నింప కుండె నేని, నే నుపయుక్తాతిథ్య మిచ్చి యుండనా? అతిథిసత్కారమునకుఁ బ్రసిద్ధి గాంచినభారత దేశమునందు జన్మించినవాఁడను గానా?.

పాఠకులు నానెచ్చెలిని గుర్తించియె యున్ననుఁ, బరిచయమును గలిగించుట యాచార మగుటవలన నట్లు లొనర్చువాఁడను. నానెచ్చెలి చిన్నచింతాకు వంటిఱెక్కలును దుమ్మెద వంటికంఠనాదమును బొంది, గానాభిలాషమును రక్తపానకుతూహలమును గల శ్రీ వీరాధివీరవర శ్రీ మశకరాజుగారు. ఆయన మనుజులకె కాక, పశుపక్ష్యాదులకును సుపరిచితుఁడు. నిజచరణములకు ధరారజము సోఁకు నని నానెచ్చెలి నడువక వ్యోమయానము వోలె నాకసమున నెగురుచుండును. సామంతు లాతనికి జడిసి రాత్రులందు దోమతెరజెయిలునఁ బడి యుండి, కలుగునుండి

బైటకు వెడలునెలుక వోలెఁ బ్రాతఃకాలమునందు బైటకు వత్తురు. వారి కాపద వాటిల్లు నేమో యని వారిమంచములచుట్టును నానెచ్చెలి రే యంతయు గస్తీ దిరుగు చుండును; మఱియు వారు పై మఱచి నిద్రింప కుండునట్టులు గానము చేయు చుండును; అంతేకాక దోమ తెర యందు రంధ్ర ముండు నేని, దానిగుండా లోనఁ బ్రవేశించి డాక్టరు వోలె నింజంక్షనుల నిచ్చును.

"శఠే శాఠ్యం సమాచరేత్" అనున్యాయము ననుసరించి నేను నామెడపై నొక పెద్దచఱపుఁ జఱచి, నానెచ్చెలి ననుఁ బాసి దివి కేగె ననియు నాతనిబంధుగు లక్కడ లే కుండుటవలన శవసత్కారాదికర్మములను నేనే చేయ వలసి యుండు ననియుఁ దన్మరణసమాచారము వెల్లడి యగు నేని, నే నురికంబమునందు వ్రేలాడ వలసి యుండు ననియు ను దలంచితిని; కాని- చతురుఁ డగునతఁడు నాచఱపును దప్పించుకొని తనగుణగుణనాదముచేత నన్నుఁ దిరస్కరించి చివ్వ వలెఁ బై కెగిరి వచ్చి నానడిపీఁపున వసియించెను. అంత నే నతిక్రుద్ధుఁడ నై యిట్లు గర్జించితిని:—"ఓరీ- మూఢా! పాపీ! పాషండా! పతంగకులపాంశువా! నే నింతదనుక సహించితిని; కాని- యింక సహింపను. నేను ధన మిచ్చి టిక్కెటు కొని, యీబండి నెక్కి యున్నవాఁడను. నీవో టిక్కెటు లేకుండ నిందుఁ బ్రవేశించి నన్ను వేధించు చున్నవాఁడవు. నీవు టి; టి ఐ; కంటఁ బడకుండుటవలన నిట్లు చెలరేఁగితివి. ఆతఁడు గాంచి యుండె నేని, ని న్నొకయర్ధచంద్రప్రయోగముతో శ్రీకృష్ణజన్మస్థానమునఁ జేర్చి యుండును. అది దప్పిన దని సంతసింపకుము. ఇదిగో నేను యుద్ధమును బ్రకటించి ని న్నెదుర్కొని పీడించ మడంచెదను. యముఁడు దన కవిలెలో నున్ననీపేరుపైని గీఁత గీయ గంటమును బూనెను. నీరూపు మాపుటకుఁ గృతనిశ్చయుండను." ఇట్లని యొకపెద్దచఱపు నాపీఁపుపైని చఱచితిని. ఆదెబ్బ మశకరాజున కొకింతేని హాని గలిగింప లేదు. కాని- నాపీఁపునకు నొప్పి గలిగించెను. అంత నేను నిలుచుండి పిల్లి యెలుకపైకిఁ బులి కుందేలుపైకి డేగ పులుఁగుపైకిఁ గవియునట్లు దోమదో

రపైకిఁ గవిసితిని. అట్లయ్యు నతని కేమియుం జేయం జాలనైతిని. అతఁడు నా కందక దవ్వు దవ్వున నెగురుచుండెను.

అంత నేను గూరుచుండి యిట్లు లాలోచింపఁ దొడఁగితిని:— “నేను నాచెలికానికంటె నధికుండనా? జగదీశసృష్టసమస్తజీవులకు నాహారవిహారశయనభయాదులు సమానములే కదా! కర్తవ్యాకార్యకరణమునందు నందఱును సములే కదా! అందు మనుజుఁడు దనకు బుద్ధివివేకము లున్నంతమాత్రముచేత గర్వించి స్వార్థపరుఁడై తనతోడిప్రాణులను నిష్కారణముగాఁ బీడించి తాను సుఖపడ నెంచును గదా! నాచెలికాఁడు. కేవలము తనపొట్టసొదఁ దీర్చికొనుటకె నామీఁద వ్రాలెను. కనుక నట్టిసేఁత దోషావహము గాదు. అతఁడు దనపొట్టలోఁ బట్టునంతనెత్తురు నా దేహమునుండి త్రాగుటవలన నాకుఁ గలుగులోఁటతిస్వల్పాతిస్వల్పమె. కాని- నే నాతనిరూపు మాపుటవలన నతనికిఁ గలుగులోఁటపరిమితము గాదే? అయ్యో! నే నెంత ఘోరకార్యము నొనరింపఁ బూనితిని!” ఇట్టు లాలోచించి ప్రకాశముగా నిట్లంటిని:— “ఓయీ! నేను నిన్నుఁ జంపను; నిక్కముగాఁ జంపను. నీవు భీతి నొంది దూర మేగ నక్కఱ లేదు. ఏ డడుగులు గలిసి నడిచినంతనె మైత్రి గలుగు నందురు. అట్లుండ నింతదూరము గలిసి పయన మొనర్చినమనము మిత్రులము గాకుందుమా? మన మిద్దఱము నెఱుంగ రానితమఃపుంజమునుండి యుదయించి యీజగద్రంగస్థలమున నటియించి తిరుగ నాతమఃపుంజమునందే లీన మగుదుము గదా!” ఇట్లు నానెచ్చెలికి సంబోధించి నిమీలితనయనుఁడ నయినంతనె నిద్రాదేవి నన్నుఁ గౌఁగిలించెను. కావున బల్లపైఁ బండితిని.

“కాఫీ- టీ; సిగరెట్- బీడీ; కూలి- కూలి” మొదలగుశబ్దముల వలన మేలుకొని వెలికిఁ జూచితిని. నేను దిగనున్నస్టేషనునందె బండి నిలిచి యుండుటవలన నేను బండిదిగితిని. నానెచ్చెలి నన్ను వెదకుచు నాబండియందె పరిభ్రమించుచుండెను. ఆబండి యాతని నెటకుఁ గొని పోయెనో నే నెఱుంగను. ఈజగమున సంయోగవియోగములు కావడికుండలు.

---

# ఇతిహాసలేఖకులకు విజ్ఞప్తి.

ఇప్పుడు మనదేశముయొక్క యితిహాసము పూర్ణాంగ మంతగా యుండ లేదు. కాని- అందులకై ప్రబలప్రయత్నములు చేయఁబడు చున్నవి. ప్రయత్నకారులలోఁ బ్రప్రథములు పాశ్చాత్యపండితులు. వారు మనదేశమందలి ప్రాచీనగ్రంథములను, శిలాతామ్రశాసనము లను, మఱి కొన్ని విషయముల్లను సాధ్యానురూపముగా విమర్శించి మన దేశచరిత్రాంశములను గొంతవఱకుఁ దెలిసి కొని హానిని బత్రికల యందును, బుస్తకాకారముగాను బ్రకటించి యున్నారు; మఱి ప్రకటిం చు చున్నారు. అట్టిప్రకటనములకొఱకు సంఘములు సైతము స్థాపిం పంబడి యున్నవి. ఇప్పు డిప్పుడు మనదేశమందలి కొందఱుపండితులు వారి ననుకరించు చున్నారు. కాని- మనపండితులప్రయత్నావళియొక్క బాల్యదశ యింకను బాయ లేదు. దానిముఖ్యకారణము ధనలోపమే యగును. మనదేశపండితులు ప్రాయశః ధనవంతులుగారు; ధనవంతులు ప్రాయశః పండితులుగారు; ధనికు లట్టి పనులకొఱకుఁ దమధనమును వెచ్చించుట కిచ్చగింప కుండుట దుఃఖకరవిషయము. అందువలనఁ బను లు లెస్సగా నెఱవేఱ కున్నవి. ధనికు లితిహాసప్రయోజనమును బాగు గా నెఱిఁగి, తన్నిర్మాణముకొఱకు నిజధనము నుండి కొంత వెచ్చించుట సముచితము. ఇతిహాసము జనసంఘముయొక్క బాగోగులను దెలు పుచు దేశవాసులను సుచరిత్రవంతులుగాఁ జేయును. ఇతిహాసము లేని దేశము సుసభ్యదేశములలో వాసి కెక్కఁజాలదు. భారతదేశము ప్రాచీనచరిత్రహీన మయిన దని కొంద ఱందురు. కాని- ఆవాక్యము సత్య మయినది గాదు. సమగ్రభారతదేశముయొక్క ప్రాచీనేతిహాస మేకాకృతిగా రచింపఁబడ కున్నను, దదంతర్గత విభిన్నప్రదేశముల ప్రా చీనచరిత్రాంశములు వేదములందును, ధర్మసూత్రములందును, అర్థ శాస్త్రములందును, బురాణములందును, గావ్యనాటకాదులందును, శి లాతామ్రశాసనాదులందును వర్ణింపంబడి యున్నవి. వాని నన్నింటి సత్యార్థముల్లను సమీచీనముగా గ్రహించి మనదేశముయొక్క

సాంగేతిహాసమును రచించుట కష్టతమకార్యము. ఇతిహాసలేఖకులు పైని పేర్కొనంబడినగ్రంథములనే కాక మిస్టరు స్మిత్తు, మిస్టరు హంటరు మొదలయిన పాశ్చాత్యదేశస్థులయొక్కయు శ్రీయుక్త రమేశచంద్రదత్త, హీరాలాల, వెంకయ్య మొదలయిన స్వదేశస్థులయొక్కయుఁ బొత్తములను, యవనులయితిహాసములను, బౌద్ధజైనధర్మగ్రంథములను జక్కగాఁ జదువ వలెను. ఈదేశముయొక్క యితిహాసమును గాలానుసారముగాను, బరిపాలనపద్ధతిప్రభేదానుసారముగాను బురాణయుగ మనియు, శాసనయుగమనియు, యవనయుగమనియు, నాంగ్లయుగమనియు నాలుగుభాగములుగా విభజించుట యుక్తము. ఆయాయుగములందలిప్రదేశములస్థితిగతులు, పరిపాలకులరీతినీతులు, జనులయాచారవ్యవహారములు, భాషలయున్నతినతులు, మతములజననప్రచారములు మొదలగు సకలోపాదేయవిషయములు నాయాభాగములందు నుండ వలెను.

వేదమునకు "త్రయీ" యను పర్యాయపద ముండుటవలన ఋక్కు, యజుస్సు, సామ మనునవి మూడే వేదము లని కొందఱందురు. కాని- అథర్వము నాలుగవవేద మయి యుండుటవలనను, వేదశబ్దము చతుస్సంఖ్యావాచకప్రసిద్ధిని గాంచుటవలనను వారినుడి సరియయినది గాదు. మంత్రభాగమును, బ్రాహ్మణభాగమును, ఉపనిషద్భాగమును గలిగియుండుటవలన వేదమునకుఁ ద్రయీశబ్దము పర్యాయపద మయ్యెను. కాని- ఆపస్తంబసూత్రమునందు "మంత్రబ్రాహ్మణయోర్వేదనామధేయ*" మని కలదు. ఆపస్తంబమతానుసారముగా నుపనిషద్భాగము బ్రాహ్మణభాగాంతర్గత మని యెఱుంగ నొప్పును. ఋక్కనఁగాఁ బద్య మనియు, యజుస్సనఁగా గద్య మనియు వేదపరిభాష. మంత్రభాగము గొంత పద్యాత్మకముగాను, గొంత గద్యాత్మకముగా నున్నది. గద్యపద్యాత్మక మయినసమగ్రమంత్రభాగము పూర్వ మేకముగా నుండె ననియు, దానిని యజ్ఞముకొఱకు వేదవ్యాసమహర్షి ఋక్శాఖ, యజుశ్శాఖ, సామశాఖ, అథర్వణశాఖ యనునామములతో లోకంబునఁ బ్రవర్తింపఁ జేసె ననియును బురాణప్రసిద్ధము. యజ్ఞమునందు హోత పఠించుభాగమునకు ఋగ్వేద మనియు, అధ్వర్యుఁడు పఠించుభాగమునకు యజు

ర్వేద మనియు, ఉద్గాత పఠించు భాగమునకు సామవేద మనియు, బ్రహ్మ పఠించు భాగమునకు నథర్వవేద మనియును వ్యవస్థ గలిగెను. అట్లయ్యు నొక వేదమందలిమంత్రభాగ మిం కొక వేదమునందుఁ గన నయ్యెడిని. సామవేదముయొక్క సమగ్రమంత్రభాగము, నథర్వవేదముయొక్క రమారమి నగము మంత్రభాగమును ఋగ్వేదమంత్రభాగమునుండి గ్రహింపంబడెను. యజుర్వేదము ప్రాయశః శ్రౌతసూత్ర మట్లు యజ్ఞకరణవిధానగ్రంథమే యగును. కనుక ఋగ్వేదముయొక్క సమగ్రమంత్రభాగమును, ఋగ్వేదమునందు లేనియథర్వవేదమంత్రభాగమును నిర్దుష్టమంత్రభాగ మను టొప్పును. ఈమంత్రభాగకథితవిషయావళిని గూర్చి బ్రహ్మాండపురాణ మిట్లు నుడువు చున్నది.

శ్లో॥ మంత్రా నవవిధా ప్రోక్తా
ఋగ్యజుస్సామలక్షణాః,
స్తోత్రం నిందా ప్రశంసా చా
క్రోశ స్తోష స్తథైవ చ,
ప్రశ్నానుజ్ఞా తథాఖ్యాన
మాశాస్తి ర్విధయో మతాః.

ఈశ్లోకార్థము సుబోధము. దీనివలన వేదమంత్రభాగము కేవలము యజ్ఞప్రతిపాదకమే కా దనియు, దానియందలి స్తుతి నిందాప్రశంసాదు లైతిహాసికుల కుపాదేయవిషయము లనియును దెలియ నగును. ప్రత్యేకశాఖ యేకాధికబ్రాహ్మణయుక్త. ఋక్శాఖయొక్క మైతిరేయ, కౌషీతకి యను రెండుబ్రాహ్మణములు మాత్ర మిప్పుడు గనఁబడుచున్నవి. యజుశ్శాఖయొక్క బ్రాహ్మణములు రెండు:— శుక్లయజుశ్శాఖయొక్క బ్రాహ్మణము శతపథము; కృష్ణయజుశ్శాఖయొక్క బ్రాహ్మణము తైత్తిరీయము. సామశాఖయొక్క యెనిమిదిబ్రాహ్మణములలోఁ దాండ్యబ్రాహ్మణము ప్రధాన మయినది. దానిని గొందఱు పంచవింశబ్రాహ్మణ మందురు; మఱి కొందఱు మహాబ్రాహ్మణ మందురు. అథర్వశాఖయొక్క బ్రాహ్మణనామము గోపథము. కృష్ణయజుశ్శా

ఖయొక్క తైత్తిరీయబ్రాహ్మణమునందు మంత్రభాగము సైతము మి శ్రమ మయి యుండుటవలన దానిని కేవలము బ్రాహ్మణ మనుట యనుచితము. ఈ బ్రాహ్మణములందు సైతము చరిత్రాంశము లున్నవి. కనుక వాని నన్నింటిని విమర్శించి చరిత్రాంశములను గ్రహింపఁ దగును.

ఉపనిషత్తులు సంఖ్యాతీతములు. అందు నూటయెనిమిది మాత్ర మిప్పు డీ దేశమునందుఁ గనఁ బడుచున్నవి. అందుఁ గొన్ని బ్రాహ్మణ తుల్యములు; కొన్ని బ్రాహ్మణప్రతిపాదకములు; కొన్ని యోగశాస్త్ర బోధకములు; కొన్ని మంత్రశాస్త్రజ్ఞాపకములు; మఱి కొన్ని సన్న్యాసధర్మప్రతిపాదకములు. ఆయుపనిషత్తులను బరిశీలించి వానినుండి చరిత్రాంశములను గ్రహింపఁ జనును.

సూత్రగ్రంథములు సైతము శాఖాభేదానుసారములుగా నున్నవి. అవి సూత్రాత్మకము లయి యుండుటవలన వానిని సూత్రము లందురు. బ్రహ్మాండపురాణమున సూత్రశబ్దనిర్వచన మిట్లున్నది.

శ్లో॥ అల్పాక్షర మసందిగ్ధం
సారవద్విశ్వతోముఖం,
అస్తోభ మనవద్యం చ
సూత్రం సూత్రవిదోవిదుః॥

సూత్ర మనఁగా నల్పాక్షరమయము, నసందిగ్ధార్థబోధకము నగు ననవద్యవాక్య మని పైశ్లోకముయొక్క తాత్పర్యము. సూత్రచయరచితగ్రంథము సైతము సూత్రనామవ్యవహృతము. యజ్ఞాదికథితగ్రంథమునకు శ్రౌతసూత్ర మనియు, గృహ్యాకర్మవిధానకథితగ్రంథమునకు గృహ్యసూత్రమనియు వర్ణాశ్రమధర్మవిధానకథితగ్రంథమునకు ధర్మసూత్ర మనియు వాడుదురు. వానిని యాజ్ఞవల్క్య, ఆపస్తంబ, ఆశ్వలాయన, గౌతమప్రభృతిఋషులు రచించిరి. ఆసూత్రగ్రంథములను విమర్శించి చరిత్రాంశములను గ్రహింప నొప్పును.

శుక్రనీతికౌటిల్యాదులయర్థశాస్త్రములందును జరిత్రాంశములు గ లవు. వానిని గ్రహించుట సమంజసము.

పురాణ మనినంతనే ప్రాచీనగ్రంథ మని స్ఫూచిత మగును. పురా ణశబ్దనిర్వచన మిట్లున్నది.

శ్లో॥ సర్గశ్చ ప్రతిసర్గశ్చ
వంశో మన్వంతరాణిచ,
వంశాను చరితంచేతి
పురాణం పంచలక్షణం॥

జగత్తుయొక్క సృష్టివర్ణనమును, దానినాశనకథనమును, రాజ వంశమహర్షి వంశకీర్తనమును, మన్వంతరముల వివరణమును, వంశానుచ రితరూపకోపాఖ్యానమును గలగ్రంథమునకుఁ బురాణ మందురు. నిర్వ చన మిట్లున్నను, ఇప్పటిపురాణములందు నుపరికథితవిషయపంచక మిం చుమించుగా నుండి, నదీక్షేత్రవ్రతాదులమహిమములును, శ్రాద్ధకల్ప మును, పితృపాఖ్యానమును పూజాదివిధానములును, మంత్రోద్ధారాది నానావిషయములు నుండును. అంతేకాక, కొన్ని పురాణములందు విష్ణుమహిమప్రతిపాదకకథలును, గొన్నింటియందు శివమహిమప్రతి పాదకకథలును, గొన్నింటియందు దేవీమహిమప్రతిపాదకకథలును, మఱి కొన్నింటియందు నన్యదేవతామహిమ ప్రతిపాదకకథలును జేర్పఁ బడి యున్నవి. మతబాహుళ్యమునుబట్టి గ్రంథబాహుళ్యము కల్పిత మయ్యెను. కేవలచరిత్రాత్మకప్రాచీనపురాణాంశనిచయము న్యూనా ధికముగాఁ గలిగి యుండుటవలనఁ బురాణములయొక్క నామములందు ను, గర్తృత్వమునందును మార్పు గలుగ లేదు. అది నిక్కముగాఁ బురాణములప్రామాణ్యమును వృద్ధిపఱచెడిని. పురాణములకంటెను బు రాణాఖ్యాన మతి ప్రాచీనము. అది గురుశిష్యసంవాదరూపముగాఁ జాలఁ గాలము వఱకుఁ బ్రవర్తించెను. పురూరవచక్రవర్తి కాలమునందుఁ గాఁబోలు, వాయుబుషి నైమిశారణ్యవాసులకుఁ బురాణాఖ్యానమును బ్రప్రథమమునఁ జెప్పెను. సంవాదరూపకాఖ్యానము మహాభారతే యు,

ధనేమయ్యమందు సంహితానామముతోఁ గ్రంథాకారమును ధరించెను. పురాణాఖ్యానరచయితయు, మహాభారతముయొక్క మొదటిగ్రంథము యిన యజ్ఞసంహితారచయితయు బాదరాయణవ్యాసుఁడు. ఇతఁడు పరాశరపుత్త్రుఁడు. ఈవ్యాసుఁడు వేదవ్యాసుఁడు గాఁడు. వేదవ్యాసునకు నితనికి నించుమించుగా నూటయేఁబది సంవత్సరములయంతర ముండును. ఇతఁడు పురాణసంహితను రచించినట్లు వాయుపురాణమున నిట్లున్నది:

శ్లో॥ ఆఖ్యానై శ్చాప్యుపాఖ్యానై
ర్గాథాభిః కల్పజోక్తిభిః,
పురాణసంహితా శ్చక్రే
పురాణార్థ విశారదః॥

వ్యాసమహర్షి తనమొదటిశిష్యుఁ డయినసూతునకు నుక్తసంహితను జెప్పెను. దానిని సూతుఁడు తనశిష్యషట్కమునకుఁ జెప్పెను. ఆయార్గురిలో ముగ్గురు మాత్రమే సంహితాకర్త లయిరి. ఆసంహితాచతుష్టయమే పురాణములజననకారణ మయ్యెను. వానియందు వేదశాఖలందుఁ బోలెఁ బాఠభేదములు గలవు. మఱియు నానాలుగును బైని చెప్పఁబడినయైదులక్షణములతో నొప్పుచున్నవి. ఆసంహితలయాధారముచేతఁ బదునెనిమిదిపురాణములు రచింపఁబడెను. ఆపురాణముల పేరుల మొదటియక్కరములతో నీక్రిందిశ్లోకము చమత్కారముగా రచింపఁబడి యున్నది:—

శ్లో॥ మద్వయం భద్వయంచైవ
బ్రత్రయం వచతుష్టయం,
అనాపలింగకూస్కాని
పురాణాని పృథ క్పృథక్॥

౧. మత్స్యపురాణము; ౨. మార్కండేయపురాణము; ౩. భవిష్యపురాణము; ౪. భాగవతపురాణము; ౫. బ్రహ్మపురాణము;

౭. బ్రహ్మాండపురాణము; ౭. బ్రహ్మవైవర్తపురాణము; ౮. వరాహపురాణము; ౯. వామనపురాణము; ౧౦. వాయుపురాణము; ౧౧. విష్ణుపురాణము; ౧౨. అగ్నిపురాణము; ౧౩. నారదపురాణము; ౧౪. పద్మపురాణము; ౧౫. లింగపురాణము; ౧౬. గరుడపురాణము; ౧౭. కూర్మపురాణము; ౧౮. స్కాంధపురాణము. వీనిలో మత్స్యబ్రహ్మాండవాయుపురాణములందు సంహితాభాగ మధికము. భాగవతవిష్ణుపురాణాదులయందు సంహితాభాగము రూపాంతరముగాఁ జెప్పఁబడెను. అగ్నిగరుడపురాణములయందు సంహితాభాగము గనంబడదు. అంతేకాక యగ్నిపురాణమునందు నామలింగానుశాసనముయొక్క కొంతభాగమును, సుశ్రుతముయొక్క కొంతభాగమును, నలంకారశాస్త్రముయొక్క కొన్ని యంశములును గలవు. గరుడపురాణమునందు మంత్రశాస్త్రవిషయము గొంత గలదు. భవిష్యపురాణమునందు రాజపుత్రస్థానముయొక్క కొందఱువీరులచరితములును, శంకరరామానుజకబీరాది మతప్రవర్తకుల జీవితములును, యవనచక్రవర్తుల చరిత్రములు, నింక నితరాధునికవిషయములును వర్ణింపఁబడెను. పురాణము లిట్టిప్రక్షిప్తవిషయములను గలిగి కలగూరగంప లట్లుండుటవలన వానియందు సంహితాభాగము గనంబడదు. అయినను బురాణములకర్తృత్వము వ్యాసునియందు న్యస్తమయి "అష్టాదశపురాణానాం కర్తా సత్యవతీసుతః" అని చెప్పఁబడెను. ఉపపురాణ మనుపేరుతో సైతము కొన్ని పొత్తములు గలవు. కనుక సకలపురాణోపపురాణకథితవిషయములను బాగుగాఁ బరిశీలించి చరిత్రాంశములను స్వీకరించు టొప్పును.

ప్రాచీనార్వాచీనకవుల కావ్యనాటకాదులయందుఁ గొన్ని చరిత్రాంశములు సూచితము లయి యున్నవి. మనదేశమందలి కొన్నిపుస్తకములు నామమాత్రావశిష్టము లయినవి. మఱికొన్నింటిపేరుల నయిన నెఱింగినవారు లేరు. ఐతిహాసికు లనాదరమును జూపక యున్న కావ్యనాటకాదులను గూడఁ జక్కఁగా విమర్శించి విషయగ్రహణము సేయఁ జనును.

మన దేశమందలి శిలాతామ్రశాసనములలో నింక నెన్నియో కనఁబడ నున్నవి. అందుఁ గొన్ని పెట్టెలయడుగునను, గొన్ని ఘోరార ణ్యమధ్యములందును, మఱికొన్ని భూగర్భమునందు నుండవచ్చును. శాసనములను విమర్శనపూర్వకముగాఁ జదువవలెను. శాసననిర్మాతలు ప్రాయశః విద్యావంతు లయి యుండరు. ఉదాహరణమునకై “వాని నిబంపించి” యని చెక్కవలసినదానిని భ్రమించి బాకుఁ దలకట్టు దగి లించినచో “ వానినిచంపించి ” యై గర్హితార్థ మిచ్చును. పాఠకుఁడు నైత ముచితజ్ఞుఁడై యుండవలెను. “రామునికుక్క” యనుదానిని బ ఠించునప్పుడు “రామునియొక్కకుక్క” యని గ్రహించుట యుక్తమో, కాక “రామునకుఉక్క” యని గ్రహించుట యుక్తమో పాఠకుఁడు నిర్ణయింప వలసి యుండును గదా!

ఉపరికథితపుస్తకములను, శాసనములను జదివినంతనే యితిహాస లేఖకులు గాఁ జాలరు. వారిబుద్ధి విశద మయి యుండవలెను, విశదము కానిబుద్ధి గలవారిలేఖనము యదార్థముగా నుండదు. భాషాపాండిత్య మును, భాషాస్వాతంత్ర్యమును, ఊహోదారత్వమును, సంకుచితత్వరా హిత్యమును, బూర్వసంకల్పసిద్ధాంతబుద్ధిహీనతయు, అనిర్ధారితసిద్ధాంత సహితపరివర్తనమును, మతాభిమానహీనతయు, ధర్మాభిమానరాహి త్యమును, అప్రతిహతతర్కవాదమును, అపవాదభీతిత్యాదులును విశ దబుద్ధిమంతులలక్షణము లని తెలియం దగును.

నాయీవ్రాఁతయందు నించుకంత సార ముండు నేని దాని నితి హాసలేఖనోద్యములు గ్రహింతురు గాక.

---

# గురునానకుఁ

మహమ్మదీయులలో నానాసంప్రదాయములు సృష్టింపఁబడుచుండఁగా నట్టి హిందువులప్రభతోడఁ బ్రతిభ దఱుఁగుచుండఁగా జగదీశుఁడు గురునానకుని భారతమునకుం బంచెను. కలదు గదా గీతయందు:—

శ్లో॥ యదా యదా హి ధర్మస్య గ్లాని ర్భవతి భారత! అభ్యుత్థాన మధర్మస్య త దాత్మానం సృజా మ్యహం॥ అని. ధర్మసంరక్షణార్థము భారతముయొక్క పూర్వభాగమునందు శ్రీచైతన్యదేవుఁ డవతరించినప్పుడె పశ్చిమభాగమునందు మహాత్ముఁడయినానన కావిర్భవించెను. నానకు శ్రీ॥ శ. ౧౪౬౯ యందుఁ బంజాబంతర్గత మగులాహోరుజిల్లాలోని రావీనదీతీరమున నున్నతిలోండి యనెడియూర జనించెను. ఆగ్రామము యొక్క యాధునికనామధేయము రాయపురము. అది శిఖులతీర్థస్థానము. దానిని వారు "నాన్కానాసాహెబ్" అందురు. సాహెబనుపదము గురుముఖీభాషయందు సమ్మాననీయార్థబోధకము. కనుక "నాన్కానాసాహే" బనఁగా మాననీయనానకజన్మస్థాన మనియెఱుంగ నగును. ఆయన "ఖత్రి" కులమునఁ బుట్టెను. "ఖత్రి" క్షత్త్రిశబ్దభవము. అతనితండ్రి కరణకార్యము సేయుచుండిన "కాలు" అనువాఁడు; తల్లి తృప్త. నానకు దనయేడవయేఁట నొక్కనాఁడె యక్షరమాలికను నేర్చి తలంపునకై దాని నొకపద్యముగా రచించె నఁట! అతని కౌదార్యము సహజగుణము. ఒకప్పు డతనితండ్రి యతనికి నలుబదిరూపాయ లిచ్చి యుప్పును గొని తెమ్మని పంపఁగా నతఁ డాపైకమును క్షుధితసాధువుల పోషణమునకై వినియోగించెను. అది గని యతనితండ్రి కపురతాలాంతర్గతమగు సులతానాపురమునం దున్న యతనిసోదరియింటి కతనిని బంపించి వేసెను. అప్పు డాపురమున నవాబుగా నున్న దౌలతఖానుని కొలువునందుఁ గోశాధ్యక్షపదవి యతనికి లభించెను. అప్పుడు గూడ ధనాగారమునుండి ధనమును వెచ్చించుచు నతఁడు సాధుజనపోషణము నెరపఁ దొడంగెను. దాని నెఱింగి నావా బాతనిపైని ధనాపహారణదోషము మోపి శిక్షింప నెంచి నిలువపైకమును లెక్కలను బరిశీలింపఁ జేయ

సర్వమును సరిగా నుండె నట! అతఁడు దనపదునాఱవయేఁట సులక్ష్మి యనుసాధ్విని వివాహమాడెను. ఆదంపతులకు హరిచంద్రుఁడును లక్ష్మీదాసుఁడు ననునిద్దఱుపుత్త్రులు గలిగిరి.

అతఁడు దనముప్పదియాఱవయేఁట గృహస్థాశ్రమమును బరిత్యజించి మర్దానా, లహనా, బాలా, రామదాసులను నలుగురుశిష్యులతో నేకేశ్వరమతమును బ్రకటించుచు దేశాటనము సేయఁ దొడంగెను. ఆ శిష్యులలో మర్దానా పంచమకులజుఁడు. ఈశ్వరుఁ డొక్కఁడె యనియు, నందఱకు నేకేశ్వరారాధనమె కర్తవ్య మనియు, విగ్రహారాధనమును బహుదేవోపాసనమును నిష్ప్రయోజనము లనియు, జాతిభేదము వలదనియు, సతీదాహమును నిర్బంధవైధవ్యమును మాదకద్రవ్యసేవనమును ధూమ్రపానమును శిశుహత్యయుఁ బరనిందయుఁ దీర్థయాత్రయును నిషిద్ధకర్మములనియు, రాజభక్తియుఁ గృతజ్ఞతయుఁ బరోపకారమును న్యాయవర్తనమును నిష్పక్షపాతమును సత్యవాదిత్వమును సరళత్వమును గర్తవ్యకార్యము లనియు నాతనిబోధనములు. అతనిశిష్యసంఖ్య క్రమక్రమముగాఁ బెరుఁగ సాగెను. అసహిష్ణువు లయినపిశునుల పలుకులను బాటించి ఢిల్లీ పాదుషాయయినయిబ్రాహిములోడి యామహాత్ముని జెఱసాలయందు నుంపించెను. ఇబ్రాహిమును బేబరు క్రీ॥ శ॥ ౧౫౨౬ నందు గెలిచినపిమ్మట నతఁడు కారాగృహముక్తుఁ డయి నిజగృహమునందు సన్యాసిగానె కొంతకాలము నివసించెను.

అతఁడు జలంధరజిల్లాయందుఁ గర్తారపుర మనునామముతో నొకపట్టణ మేర్పఱచి యందు నొకధర్మశాలను బ్రతిష్ఠించెను. ఆ స్థలమునందే యాతఁడు క్రీ॥ శ॥ ౧౫౩౯ యందుఁ గీర్తిశేషుఁ డయ్యెను. అతఁడు వేమనయోగి వోలెఁ దన్నె సంబోధించుచు గీతరూపముగ లోకమున కుపదేశించుచుండెను. అతఁ డొక యాశుకవియై యుండెను. మఱియు నాతఁ డొకప్పుడు సన్యాసివేషముతోడను మ ఱొకప్పుడు ఫకీరువేషముతోడను మతబోధనము సేయుచుండెను. అతనిమతావలంబకులను నానకపంథిజనులు, లేకనానకసాహీజనులు, లేక శిఖు లందురు. అతఁడు నిజమతప్రచారము సేయుచు జగన్నాథక్షేత్రము, కటకము,

చెన్నపురి, సింహళము, లాహోరు, డిల్లీ, కురుక్షేత్రము, కామరూపము, బృందావనము, కాశ్మీరము, పేషవారు, హరిద్వారము, హిమాగశిఖరము, బాగ్దాదు, మక్కా మొదలగు పెక్కుపవిత్రదేశములందుఁ బర్యటనమొనర్చెను.

అతఁడు హరిద్వారమున కరిగినప్పు డక్కడఁ గొందఱు పూర్వముఖు లయి గంగానదియందు జలదర్పణము సేయు చుండుట గని తాను బశ్చిమాభిముఖుఁ డయి జలదర్పణము సేయుచుండ నట్లు సేయుటకుఁ గా రణముఁ గొంద ఱడుగఁగాఁ గొంతదూరమునఁ దన కొకపొలము గల దనియు దానిపంట యెండ కుండుటకై నీరు వోయు చున్నవాఁడ ననియు నతఁడు సెప్పఁగా వారు నవ్వసాగిరి. అది గని మీ రేల నీరు వోసెద రని యతఁ డడుగఁగా మేము పితృదేవతలకై తర్పణము సేయుదు మనిరి. "మీరు వోయుజలము పరలోకమున నున్న పితరులకుఁ జేరు చుండఁగా నేను బోయుజలము గొంతదవ్వుననే యున్న పొలము నందలి పంటకుఁ జేరదా?" యని యతఁడు నుడివెను. అతనిభావగర్భితోపదేశము నెఱింగి వారు స్తబ్ధు లయిరి. అతఁడు దేవాలయములకును మసీదులకును బ్రతిషేధము లేక పోవు చుండెను. అతఁ డొకనాఁడు జగన్నాథాలయమున కేగఁగా నపుడు శ్రీస్వామికి నారతి యిచ్చు చుండుట గని యీభావము గలగీతము హిందీలోఁ బాడెను:—

గీ॥ ప్రభువ! నింగి నీ కారాత్రి పాత్రము, నుడు
చయము దాపినముత్తెముల్, శశియు రవియు.
వెలుఁగుకపురంపుముక్కలు, మలయపవన
మతులధూపంబు, వనసుమవితతి సుమము;
నజపగాయత్రి భేరియు, ననిల మొప్పు
చామరంబు, నై తనరారు జగమునందు॥

అతఁడు గొన్ని యద్భుతకార్యములను జేసెను. అతఁడు మక్కాకు వెళ్లి "కాబా" మందిరమువైపు పాదములను జాఁచి పండుకొని

యుండ నొకమహమ్మదీయుఁడు దేవునివైపు పాదములను జాఁచుట పాతక మనెను. అది విని దేవుఁడు లేనిదిక్కున నాపాదముల నుంచు మని నాన కనఁగా నమ్మహమదీయుఁ డాతనిపాదముల నేదిక్కున కీడ్చి యుంచెనో, యాదిక్కుననే యామందిర ముండుట గనుంగొన నయ్యె నఁట! అతఁడు కటకమునందు మతబోధనము సేయ నచ్చటిప్రభు వతనిమతమునం దాసక్తుఁ డగుట యెఱింగినయాప్రభుని గురుఁడు కుపితుఁ డయి నానకును శిక్షించుట కొకశాఖోటశాఖను గైకొని యతనివాసస్థానమయిన "కాళియాపాదా" యనుస్థలమునకు వెళ్లి యతనిప్రభావమును గని లజ్జితుఁ డయి యాకొమ్మ నక్కడనె పడవేసి మరలి పోయెను. అంత నానకు "నాదంతధావనము కొఱకు నీకొమ్మను భగవంతుఁ డిచ్చె" నని చెప్పుచు నాకొమ్మనుండి యొకపుడుకను విఱిచి దానితోఁడఁ బలు దోమి దాని నక్కడఁ బాతిపెట్టెను. ఆపుడక మొలచి రెండున్నరమూరలవిరివిగలచెట్టయి నేఁటికి నక్కడ వర్ధిల్లుచున్నది. అంతవిరివి గలచెట్టాజాతియందుఁ గాన రాదు. దానిని శిఖులు "దాంతన్‌సాహెబ్" (మానసీయ మగుపలుదోముపుడక) అనియు, దానియొద్ద నున్నమఠమును "గురుద్వారదాంతన్‌సాహెబ్" అనియు నందురు. గురునానకెన్నియొమహిమలను గనం జేసెను. వాని నన్నింటిని వ్రాయఁ బూనినచో నొకపెద్దపొత్త మగును.

ఆయన నిజమరణసమయ మాసన్న మగుట దెలిసికొని తనశిష్యులలో లహానా యనువానికి "అంగదుఁ" డనునామ మిడి యతనిని దనపీఠమున కధిపతిగాఁ జేసి యతనిశిరముపై ఛత్రమును దాను స్వహస్తముతోఁడఁ బట్టెను. అతనిశవమును దహించుటకు హిందూశిష్యులును బూడ్చుటకు మహమ్మదీయశిష్యులును గోరఁగాఁ దనశవముపై నొకదుప్పటిని గప్పి యొకప్రక్కఁ గొన్నిపూలను హిందువులును రెండవప్రక్కఁ గొన్నిపూలను మహమ్మదీయులు నుంచి వెళ్లి, మఱుచటిదినము వచ్చి చూచునపు డెవరిపూలు వాడి యుండవో, వారు దమమతాచారానుసారముగాఁ దనయంత్యక్రియను జరిగింప వలె నని చెప్పి యాయన

పరమపదము సేరెను. శిష్యుల ట్లొనర్చి మఱునాఁడు వచ్చి చూడఁగా నిరుపక్కలపూలును వాడకయె యుండెను. ఆదుప్పటి నెత్తి చూడ దానిక్రింద నమ్మహాత్మునిశవము లేక పోయెను! అంత నారెండుతెగల వా రెవరిపూలను వారె గ్రహించుటయె కాక, యాదుప్పటిని రెండు తునకలుగాఁ జీల్చి చెఱి యొకతునకను గొని చని రావీనదీతీరమునందు హిందువు లొకయాలయమును మహమ్మదీయు లొక "సమాధి" ని నిర్మించి వానియందు నాయ్యాపదార్థముల నిడిరి. నానకు ప్రతిమార్చన విరోధి. కనుక నతనితరువాత జను లర్చనాసక్తులు గా కుండుటకుఁ గాఁబోలు జగదీశుఁడాయాలయమును సమాధిని నేటిపాలు గావించెను. గురునానకునిమతము హిందువులయొక్కయు మహమ్మదీయులయొక్కయు నేకేశ్వరమతమె. అతనితరువాతఁ దొమ్మండ్రు గురువు లయిరి. మూడవగురు వయినరామదాసుఁడు రామదాసపుర మనుపేర నొకపట్టణ మేర్పఱచి యందు "అమృతసర" మను సరస్సును త్రవ్వించెను. అతనికొడుకును నాలుగవగురువు నయినయర్జునుఁ డక్కడ నొకస్వర్ణాలయమును గట్టించి యందు శిఖులప్రథమధర్మగ్రంథ మగు "గ్రంథసాహెబు" నుంచెను. మఱియు నందుఁ గబీర, నానక, రామానందప్రభృతులబోధనగ్రంథములు గలవు.

శిఖులకుఁ గకారపంచక మవశ్యధారణీయము:— ౧. కేశము (నిండుజుట్టు); ౨. కంగాయి (దువ్వెన); ౩. కచ్ఛము (కచ్చ); ౪. కడా (చేత నినుపకడియము); ౫. కృపాణము (ఖడ్గము).

---

# సప్తాశ్వతత్త్వము.



సూర్యునకుఁ గల రథము బంగారుతోఁ జేయఁబడిన దనియు, దానికి నొక్కటియె చక్రముండి యేడుగుఱ్ఱములు పూన్పఁబడి యుండు ననియు మనపురాణములందుఁ గలదు. "సప్తనామకైకో

శ్వాః" అని యుండుటవలన సూర్యునిరథమునకుఁ బూన్పం బడినగుఱ్ఱ మొక్కటియే యనియు, నది సప్తనామముతో నొప్పు ననియు మతభేదము.

సూర్యునకు రథము గలదా? అది యున్న దని నమ్మినను, రథము బంగారుతోఁ జేయఁ బడునా? ఏడుగుఱ్ఱములు లేక యొక్కగుఱ్ఱ మీడ్వఁగా నేకచక్రరథము చలించునా? అనుసందేహములు సామాన్యజనులకుఁ గలుగక మానవు. ఇట్టిసంశయములు గలవారు పురాణకథితవిషయములు పొల్లు లందురు; కాని వానితత్త్వముల నెఱుంగుటకుఁ బ్రయత్నింపరు. పురాణకథితవిషయములలోఁ గొన్ని పండితులవలనఁ దెలియం దగి యుండును. కనుక సందిగ్ధవిషయములను బొల్లు లని నిరసింపక పండితప్రవరుల నాశ్రయించి యెఱుంగుట కర్తవ్యము.

సూర్యగోళము చలనము గలది యగుటవలన నది యొకరథముగా నుత్ప్రేక్షిత మయ్యెను. ఆగోళము బంగారువన్నె గల దగుట ప్రత్యక్షమే కదా. కనుక సూర్యగోళమే సువర్ణరథముగా వర్ణిత మయ్యెను. క్రాంతివృత్తమే యేకచక్రముగా నుపలక్షింపంబడెను. ఇఁక గుఱ్ఱముల నుగూర్చి, లేకగుఱ్ఱమునుగూర్చి నుడువుదము. నీటిమబ్బుపైని బ్రసరించుసూర్యరశ్మినే యింద్రధను వందురు. అది శ్యామలోహితపీతహరితపిశంగధూమలనీలవర్ణము లను నేడురంగులతో నొప్పుచుండుట సుప్రసిద్ధము. కనుక సూర్యరశ్మి యేడురంగులు గల దని కొందఱమతము. ఏడురంగులు నేక మగునపుడు శ్వేతవర్ణమగుటవలన సూర్యరశ్మి యొకరంగు గల దని మఱికొందఱమతము. "వీతిః" అను సంస్కృతశబ్దమునకు గుఱ్ఱ మనియు, దీప్తి యనియు, నర్థములు గలవు [వీతిరశ్వేఽశనే గతౌ, ప్రజనే ధావనే దీప్తౌ- ఇతి హైమః.] ఆహేతువువలన నేడురంగులకిరణములు గలసూర్యునకు "సప్తవీతిః" అనునామము మొదటఁ గలిగెను. గోళము రథముగాను, గ్రాంతివృత్తము చక్రముగాను వాడఁ బడుటవలన వీతిశబ్దముయొక్క యర్థము గుఱ్ఱమే యని నిశ్చయింపంబడి "సప్తవీతిః" అనుపదము పిమ్మట "సప్తాశ్వః" అనుపదముగా మాఱి వ్యవహరింపంబ

డెను. [భాస్వద్వివస్వత్సప్తాశ్వః- ఇత్యమరః]. సూర్యకిరణము లొక్కరంగు గలవే యనుపక్షమువారు ఏకమునకు మాఱుగా "సప్త" పదము స్థూలతః వాడఁ బడినను వస్తుతః అది యొక్కటియే యని సమర్థించుకొనిరి. ఏడురంగులును ప్రత్యక్షమగుటవలన సూర్యునకు సప్తపీతి నామమే జనరంజనమ్ము.

సూర్యుని తేజము సాయంసమయమునందు నగ్నిలోఁ బ్రవేశించును. [సౌరం తేజ స్సాయ మగ్నిం సంక్రమతే-ఇతిశ్రుతిః]. ఇ వ్విషయమే యుపమానముగా రఘువంశకావ్యమునందుఁ బ్రయోగింపంబడెను:-

శ్లో॥ స రాజ్యం గురుణాదత్తం ప్రతిప ద్యాధికం బభౌ।
దినాంతే నిహితం తేజ స్సవి త్రేవ హుతాశనః॥

ఏడురంగులు గలకిరణములు ప్రవేశించుటవలననే యగ్నికి 'సప్తార్చి' నామము గలిగె నని తెలియందగును [సప్తార్చిర్దమునాశ్శుక్రః—ఇత్యమరః].

కనుక సప్తాశ్వశబ్దము సప్తపీతిశబ్దమునకు బదులుగా వాడఁబడి పరిపాటి గల దయ్యె ననియు, మొదటిరూపము "సప్తపీతిః" అనియు, నిజకిరణాళి యేడురంగులతో నొప్పు చుండుటవలన సూర్యునకు సప్తపీతినామము గలిగెననియు నెఱుంగఁ దగును.

గీ॥ అర్క గోళంబె హాటకస్యందనంబు
కాంతివృత్తంబె యేకచక్రమ్ము సుమ్ము
సప్తహాయములె రాణించుసప్తవర్ణ
కరము లవి యింద్రధనువునఁ గనఁ బడెడిని॥

---



ఆంధ్రసాహిత్యపరిషద్ద్వాదశ తమవార్షిక

# సభాధ్యక్షకోపన్యాసము.

మహాశయులారా!

పండితరాజులును, రాజులు నధిష్ఠించినపీఠంబును నా కొసంగి నన్ను గౌరవించినందులకుఁ దమకు వందనశతంబు నర్పించువాఁడను.

సభాధిపతి ప్రారంభమున నుపన్యసింప వలె ననెడినియమమును బాటింప నే నిప్పు డిక్కడ నిలువఁబడ సాహసించితిని. అంతేకాని తా రెఱుంగనివానిని జెప్పి తమమెప్పునుబడయఁ గలనను నాసతో నేను నిలుచుండ లేదు. స్పష్టముగా నుచ్చరింపం జాలనిచిలుకనోటినుండి స్వీయవాక్కులనే నాగరికులు విని సంతోషించు చుండునట్లు వ్యక్తపఱుపలేనినావలన నిజభావములనే యెఱింగి తాము ముద మొందుదు రనువిశ్వాసమే నావక్తృత్వమునకుఁ గారణము.

పండితకవివరులారా!

ఉపన్యాసంబుల నొనర్చుటకును వినుటకును గాలాతిక్రమణ మయిన దనియును గార్యానుష్ఠానసమయ మాసన్న మయి యున్న దనియును నా నమ్మకము. కనుక నాంధ్రభాషాభివృద్ధికొఱకు నాకుం దోఁచెడికర్తవ్యకర్మములనుమాత్రమే నివేదింతును.

ఆంధ్రభాషాయోష రాజమహేంద్రునికాలమందును గృష్ణదేవ రాయలసమయమునను మహోన్నతపదవిఁ గాంచుటకును బిమ్మట దీనదశ నొందుటకును గలకారణము రాచమన్ననయ యనుటకు సందియము లేదు. తలయుఁ దోఁకయు లేనిదియును నిన్న గాఁక మొన్నఁ బుట్టినదియు నగు నురుదుభాష యిప్పుడు శ్రీనిజాముగారి యాదరమును బడయు చుండుటంబట్టి యత్యున్నతస్థానమున కేగుచున్నది. శాస్త్ర

డేలయనువాదములకొలకు శ్రీ నిజాముగారు ప్రత్యేకవత్సరమున వెచ్చించు చుండురూపాయ లేఁబదివేలు. అందువలననే హైదరాబాదనగరము బి.ఏ. శ్రేణి గల కేవలోరుదూకళాశాలచేత నేకాక, ఉరుదువిశ్వవిద్యాలయముచేత సైతము విరాజిత మగుచున్నది. కొలఁదికాలముననే యాకళాశాలయందు ఎమ్. ఏ. శ్రేణిఁగూడ నుంతు రని విని మిగులనానందించితిని. అట్లయినను రాచమన్ననను బొందనికతన భాషవృద్ధి నొందఁజాల దని చెప్పలేము. ఈశ్వరచంద్రవిద్యాసాగరునికాలము వఱకును శైశవమును విడిచెనో లేదో యనుసందియంబునకు గుఱిగా నుండిన వంగభాషాయోషామణి యిపుడు పూర్ణయౌవనమును దాల్చి సర్వాంగసుందరి యయి యొప్పుచుండుటయే కాక, రవీంద్రనాథునివంటి పుత్త్రరత్నములఁ గనఁ గలుగుటకుఁ గారణములు వంగపండితులయధ్యవసాయమును, దద్దేశవాసులప్రోత్సాహమును. రాచమన్నన యంతగా లేకున్నను, వంగదేశవ్యాప్తకారణద్వయ మయిన నిచటనుండిన నాంధ్రవాణి వంగవాణితోఁ దులఁ దూఁగకుండునా? ఇప్పు డయినను ధీనిధుల రగువారు యుక్తగ్రంథరచనను బ్రారంభింప వలెను; మఱి జనసాధారణము మిమ్ముఁ దగురీతిఁ బ్రేరేపింప వలెను.

బాగుపఱుచుటకుఁ బూర్వ మోఁగులను బాఱఁ దోల వలెను. కనుక నాంధ్రభాషయందు నెలకొని యున్నదోషములను సంస్కరించుట ప్రథమకార్యము. ఇప్పటిపాఠశాలలయందలి పాఠ్యపుస్తకములం దున్నతప్పులను బుధవరేణ్యులగు బ్రహ్మశ్రీ వేదము వేంకటరాయశాస్త్రిగారు నిజాధ్యక్షోపన్యాసమున నుగ్గడించి యుండుట తా రెఱుంగుదురు. కావున నేను మఱి కొన్నితప్పులను బేర్కొని కాలహరణము సేయను. కాని, “వాచకము” లని వాడఁబడుచున్న పొత్తములలో “ఆనందవాచకములు” కొంతకొలంతను దొలఁగించె నని చెప్పఁ గలను. అయిన నవి చాలవు. కనుక సలక్షణములును విజ్ఞానప్రదములును శ్రేణ్యానురూపములు నగుపాఠ్యపుస్తకములు మఱి కొన్ని ప్రకటింపఁబడవలెను; మఱి తగువారే పాఠ్యపుస్తకనిర్ణేతలుగా నుండునట్లు చేయవలెను.

దేనికయినను నియమ ముండవలె ననియును నియమము నతిక్రమించుట పండితధర్మముగా దనియును మన మెఱింగి యుండుటవలన మనభాషకు నియమ మావశ్యక మని యనుకొన నక్కఱ లేదు. మనకున్నలక్షణగ్రంథములును వ్యాకరణములును యుక్తముగా రచింపంబడి యుండ లేదనియును వానియందుఁ జాలినన్ని సూత్రములు లేవనియు నందఱకుం దెలియును. ఇంతేకాక, వాడుకలో నున్నభాష పెరుఁగుచుండుటవలనఁ బురాతననిబంధనముల నప్పు డప్పుడు పండితులు సంస్కరించు నాచారమును గలదు. కావున నాంధ్రభాషకుఁ దగువ్యాకరణ మొకటి రచింపఁబడుట యత్యావశ్యకము. తద్రచయిత లనేకులుగాను సంస్కృతాంధ్రభాషాద్వయాభిజ్ఞులుగా నుండవలెను. మఱి యదిపరిషత్తుయొక్క సమ్మతిని బడయ వలెను. గ్రహింపఁబడి యుండనిశబ్దరూపములలోఁ గొన్నింటిని దానియందుఁ జేర్ప వచ్చును. కాని, ఒకానొక ప్రాచీనకవి ప్రాసముకొఱకో వళికొఱకో గణముకొఱకో కక్కుఱితిపడి యక్రమముగాఁ బ్రయోగించి యున్నపదమును మాత్రము చేర్ప రాదు. ఏల యనఁగా:—అట్టిదానిని మహాకవిప్రయోగ మనుచు నితరులు ప్రయోగింపరు. అందులకు నిదర్శనమును గనుఁడు. "క॥ జ్ఞానము కేవలకృప న। జ్ఞానికి నుపదేశవిధిఁ బ్రకాశము సేయం। గా నది సకలధరిత్రీ। దానంబునకంటె నధికతరఫలద మగున్॥" అని శాంతిపర్వమున నున్నట్టు లుదహరించి దీనినే లక్ష్యముచేసికొని యప్పకవి యొకనూతనయతిని సృజించి లక్షణము వ్రాసిన నది ప్రౌఢకవిసమ్మతంబు కాలేదు. ఉపర్యుక్తపద్యమందలి "ప్రకార" మనుపదమునకు మాఱుగా "ప్రచార" మని కాని ముద్రితప్రతులయందున్నట్లు "ప్రజనిత" మని కాని మహాకవి యయినతిక్కనసోమయాజి ప్రయోగించి యుండ నోపు. అట్లు కాదేని యతండును మనుష్యుండే యగుటవలనఁ బొరపడి యుండ నోపు. "ప్రదీయతాందాశరథాయమైథిలీ" అని యాదికవి యయిన వాల్మీకి ప్రయోగించినంతన దాశరథిశబ్దమును అకారాంతముగా వ్యవహరింతుమా? ఇట్లు నాకుఁ దోఁచిన రెండుపలుకులను బలికితిని. అంతే కాని, గ్రాహ్యాగ్రాహ్యశబ్దనిరూపణ మనునది పండితులకార్యము;

పండితులను సమకూర్చి యొక యాంధ్రవ్యాకరణమును ద్వారగా రచి యింపించుటవలన స్వభాషకు మేలు చేసి శాశ్వతకీర్తిని గనుట యీపరి షత్తుయొక్క కార్యము. సకలకలాశాస్త్రపురాణేతిహాస కావ్యనాట కాదులతోఁ గూడినదే సాహిత్య మనుట తెల్లమే కదా. అవన్ని యు లేని యాంధ్రభాష సాహిత్యముగలది యగునా? మనాంధునాలు గుశాస్త్రములలో మాత్ర మొకటి రెండేసిపుస్తకము లున్నంతనే యాంధ్రభాషయందు గ్రంథములన్నియుఁ గల వని నుడువఁజాలము. పూర్వకవులదృష్టి పురాణములచేతనే, మధ్యకవులదృష్టి ప్రబంధముల చేతనే, యాధునికకవులదృష్టి నవలానాటకములచేతనే యాకర్షింపఁ బడుటవలన నాంధ్రభాషయందుఁ గలలును శాస్త్రములు ననువాది తము లగుటకుఁ గాని యుత్పన్నములగుటకుఁ గాని వీలు కలుగ దయ్యెను. విజ్ఞానచంద్రికామండలి కొన్ని శాస్త్రములను బ్రకటించి మ నవందనములకుఁ బాత్రమయి తగుప్రోత్సాహము లేకుండుట నిపుడు విశ్రాంతి నొంది యున్నది. దానికి యుక్తసహాయ్య మొనర్చి యది మఱి కొన్ని శాస్త్రములను బ్రకటింపఁ గలుగునట్లు చేయుట యాంధ్రు లకర్తవ్యకార్యము. కలలయొక్కయు శాస్త్రములయొక్కయు జ్ఞాన ముండినం గాని దేశ మభివృద్ధి నొందదు. దానికై యాంధ్రు లందఱు ను సంస్కృతాంగ్లభాషల నేర్చికొనుట యెన్నఁటికిని జరుగదు. కనుక జనసామాన్యముయొక్క జ్ఞానాభివృద్ధికొఱకు శాస్త్రముల యనువాద ము గాని రచన గాని చేయుటయే పండితులకు ధర్మము. రచనకంటె ననువాదమే సుకర మగుటంజేసి ముందుగా సంస్కృతాంగ్లాది భాషల యందున్న శాస్త్రముల నన్నింటి ననువదింపవలెను. ఆంగ్లాదిభాషలనుం డి యనువదింపఁబడు శాస్త్రములకు వలయుసాంకేతికపదములను వంగ దేశమునఁ బ్రకటితమయి యున్న శాస్త్రీయపదనిఘంటువునుండియే గ్రహించుట సమంజసము. అట్టి నిఘంటువు వంగదేశమునందుఁ బ్రక టింపఁబడి యున్నట్లు నాస్నేహితు లొకరు నాకుం జెప్పి యున్నవారు. శాస్త్రవిషయము గ్రహించుటకు గష్టముగా నుండును. శైలి కఠిన మగునేని యది గ్రహించుటకుఁ గష్టతర మగును. కావున శాస్త్రము

లశ్శైలి సులభముగా నుండవలెను. పర్యాయపదముల నధికముగా వాడుచుఁ గఠినశబ్దములతో నిండునదియే కవితకుండుసొంపని కొందఱు తలంతురు. కాని, మృదుపదములను గలిగి భావము బాగుగాఁ బ్రకటింపఁబడినకవితయే మిగులసొగసుగా నుండు నని యట్టివారుగ్రహించుట యుక్తము. శాస్త్రీయములు శ్రేణ్యనుకూలములుగా ననఁగాఁ బిల్లలకును బెద్దలకును బనికి వచ్చునట్లు రచింపఁబడ వలెను. మఱియు జనులసత్ప్రవర్తనాభివృద్ధికై యుదారస్వభావులజీవితములును నితిహాసములును బ్రకటింపఁబడ వలెను.

వంగభాషనుండి కొన్నినవలలు మాత్ర మిప్పటికి ననువదింపఁబడి యున్నవి. ఆభాషయందు మంచిగ్రంథము లెన్నియో కలవు. అవి యనువాదితము లగుట లెస్స.

ఆంగ్లనవలానాటకముల ననుసరించి జనించి యున్నవియును స్వతంత్రముగా వెలసి యున్నవానిలో ననేకములును రసభావరహితములయి యపశబ్దములతోడను విగతార్థపదములతోడను నిండి సందర్భశుద్ధి శూన్యము లగుచు శ్రుతికటువులుగా నున్నవి; మఱియును సంవాదవాక్యములలోవి భారతాదులవచనశైలిని ధిక్కరించుచున్నది. పఠింప నట్టివి భాషావృద్ధికరములు గావు; తద్ధ్వంసకరములే యగును. కనుక సామర్థ్యము చాలనివారు "మౌనమే భూషణము మూఢమానవులకు" అను పద్యపాదమును స్మరించుకొని మౌన మూనుటయే మేలు.

భాషాభివృద్ధికి విమర్శనగ్రంథములు మిక్కిలిసహకారులు. వాదప్రతివాదముల నేర్పు తప్పు విమర్శన మన నెట్లుండునో మనపండితులకుఁ దెలియ దనుటయే కాక, తద్విధానమును వా రాంగ్లవిమర్శనగ్రంథములనుండి నేర్చుకొనవలసి యున్న దని చెప్ప సాహసించినందులకు నన్ను వారు మన్నింతురు గాక. "అక్కడక్కడఁ గొన్ని తప్పు లున్నను మృదుమధురపదభూయిష్ఠ మయి మొత్తము మీఁద గ్రంథము సలక్షణముగానే యున్నది" అనువాక్యముతోడఁ గాని యున్నవో లేనివో కొన్ని దోషములను నిరూపించుచుఁ గవిని దిట్టుటతోడఁ గాని విమర్శనము

సి పోవు నని మనపండితులయభిప్రాయము. అది సరి కాదు. కవి చతు రుం డయి యుండఁగా విమర్శకుఁడు చతురతరుఁడు గా వలెను. ఇంక "పండితా స్సమదర్శినః" అనునుడికిఁ దార్కాణముగా విమర్శకు లగు వారు నిష్పక్షపాతబుద్ధి గలవా రయి గ్రంథకథితపాత్రపోషణాదులను క్రమముగా వెల్లడించుచు నందలిగుణాగుణములను జూపింప వలెను. అ ట్టివిమర్శనములే భావికవులకు మార్గదర్శకము లగును. కనుక సద్విమ ర్శనముగ్రంథము లాంధ్రభాషయందుఁ గలుగునట్లు చేయవలెను.

కొమర్రాజు వేంకటలక్ష్మణరావుగారి పరలోకగమన మాంధ్ర దేశమునకుఁ దీఱనిలోటును గలిగించెను. అందుల కందఱమును వంత నొందు చున్నవారము. మనవంతకుఁ బ్రతీకార మాయనప్రారంభించిన "విజ్ఞానసర్వస్వ" మచిరకాలంబున ముగియునట్లు చేయుటయే. శ్రీసూ ర్యరాయ నిఘంటువును వెసఁ జూడ వేడుక గలవార మని మన మను కొన నక్కఱ లేదు కదా!

నేను వచించినవాక్యములలోని కఠినపదములకుఁ గలకారణము నాకున్నభాషాభిమానమే యగుటవలన నన్ను మన్నించి వానియం దున్నగుణలేశములనే గ్రహింప మిమ్ము వేడుచు విరమించుచున్నాను.

---

# ఊర్మిలాదేవి.



సీతారాములపూతచరితములను వ్రాసి తమజీవితములను సార్థ కములుగాఁ జేసి కొనినవారు పెక్కండ్రు గలరు. వారియందు మొద టివాఁడు వాల్మీకిమహర్షి. వారియందే యన నేల? లౌకికచ్ఛందస్సు నాశ్రయించి కవిత సెప్పినవారియందు నతఁడు మొదటివాఁడు. కనుకనే యతని నాదికవి యనియు, నతఁడు రచించినరామాయణము నాదికా వ్య మనియు నందురు. అతఁడు లౌకికచ్ఛందస్సులలో మనోహరము లగు పెక్కింటి నాశ్రయించి మృదుమధురపదములతోడను, జిత్తాకర్షక

ము లగువర్ణనములతోడను రామాయణమును బాడెను. అంతేకాక, జనులస్వభావచిత్రిణమునందును, జరిత్రసృష్టియందును, బాత్రపోషణము నందును, ధర్మములను మృదువుగా నుపదేశించుటయందును దత్కవివ రునినేర్పు సాటి లేనిది.

తనకావ్యమునందలి పాత్రిముల నుత్కృష్టాదర్శములుగాఁ జిత్రిం చి యతఁడు సమకాలికులవలనను, దరువాత జనించినవారివలనను మె ప్పు నొంది తనశాశ్వతకీర్తిని నిజదేశమునందే కాక, జగమంతటను వ్యా పింపం జేయఁ గలిగెను. అతనికావ్యమునందలి కథానాయకానాయకు లయినసీతారాము లాదర్శస్త్రీపురుషులుగా వర్ణింపం బడుటయే కాక, కథితసమస్తపాత్రములును మెలునకుఁ గాని కీడునకుఁ గాని యాదర్శ రూపులు.

రామాయణపాఠకు లెల్లరును సీతారామలక్ష్మణభరతశతృఘ్నాంజనేయాదుల మహత్తమగుణగణములకు విముగ్ధులగుచు వారి యెడ నతమస్తకు లగుదురు. అనేకశతాబ్దములనుండి దాసీభూతు లయి యుండుటవలనఁ దనుమనోబలములను గోలుపోయిన భారతీయులు మా త్రిము వారు దేవత లనియు, వారిచర్యలు లోకోత్తరము లనియు భా వించి, పుణ్యార్జనముకొఱకే రామాయణపఠనశ్రవణములను గావిం చుచుఁ దృప్తి నొందుదురు; కాని- పొంద దగు ఫలములను మాత్రము పొంద లేకున్నవారు.

కథితపాత్రిములను యథోచితములుగా వర్ణించినవాల్మీకిమహర్షి సాధ్వీశిరోమణియయిన యూర్మిలాదేవి నుపేక్షించుట యత్యంతశ్లోచనీయము. ఆయువ దేనియందును వినుతగుణగణయయినసీతాదేవికిఁ దీసి పోవు నది గాదు. ఆమె జనకరాజనందని; దశరథేశ్వరునికోడలు; అద్వితీయవీరుఁడును భాతృభక్తుఁడు నయినలక్ష్మణస్వామికి సహధర్మిణి; నవయౌవన; మఱి నూతనవధువు. ఆమె యక్క వనవాసక్లేశము కంటెఁ బతివిరహామె యధికతరబాధాకర మని తలంచి పతి నెడఁబా యఁ జాలక యతనివెంట వెళ్లఁగాఁ దాను బతియానతి శిరమునఁ దాల్చి

సకలోపభోగపరిపూర్ణమయిన రాజభవనమునందు సధవ లయినతోడికోడండ్రితోడ నివసించుచుఁ జతుర్దశాబ్దములు పతివిరహదుఃఖమును సహించి యుండుట సామాన్యకార్యము గాదు గదా! ఆమె యింద్రియసంయమమును, మనోదార్ఢ్యమును లోకోత్తరము లనక తప్పదు. అట్టిసాధ్వీలలామ యేకారణమువలననో వాల్మీకిమహర్షి దృష్టికి దూరమయినను, స్వభావవర్ణప్రియుండయిన కాళిదాసమహాకవిదృష్టికిని, శ్రీకంఠపదలాంఛనుం డయినభవభూతిదృష్టికిని, దక్కినకవివరుల దృష్టులకును దట్ట కుండుట మిక్కిలివిషాదకరవిషయమే.

ఆమెగుణములను గవివరులు కీర్తింపనిహేతువువలన వాసికి లోటు గలుగునా? అవి విజ్ఞులహృదయములకుఁ దట్ట కుండునా? దైవజ్ఞులు దమపంచాంగములందు గ్రహణమును వ్రాయఁ మఱచిన, నది గనఁబడ కుండునా? నిష్పక్షపాతబుద్ధితోడ రామాయణమును జదువువారు సీతాదేవికంటె నూర్మిలాదేవి యధికతర యని యనక మానరు.

## దైత్యులు.



దైత్యులు, దైతేయులు, అసురులు, దనుజులు, దానవులు, రక్షస్సులు, రాక్షసులు, కోణపులు, క్రవ్యాత్తులు, క్రవ్యాదులు, అస్రపులు, ఆశరులు, అసురులు, యాతుధానులు, అనుశబ్దములు పర్యాయపదములుగా సంస్కృతనిఘంటువులందు వ్యవహరింపంబడి యుండుటవలన వారందఱు నేకజాతిజాతు లనియును, ఘోరస్వభావు లనియును, హీనచరిత్రు లనియును, నరమాంసభక్షకు లనియును బెక్కుజనులతలంపు. పురాణములను లెస్సగాఁ బరిశీలించినచో నట్టితలంపు భ్రాంతిమూలక మనియే యేర్పడును. పురాణవిషయములను జర్చించుటకుఁ బూర్వము తత్తచ్ఛబ్దములకుఁ బండితు లిచ్చిననిర్వచనములను జేరుకొందము. (కశ్యపుని ప్రథమభార్య యయిన దితికిఁ బుత్త్రులగుటవలన దైత్యులు, మఱి దైతేయులు; సురలేనివా రగుటవలన అసురులు; (కశ్యపుని వేఱొకభార్య

యయిన) దనువునకుఁ బుత్త్రు లగుటవలన దనుజులు, మఱి దానవులు; (రక్ష త్యాత్మాన మే వేతి రక్షః; రక్ష ఏవ రాక్షసః) తమప్రాణములనే రక్షించుకొనువా రగుటవలన రక్షస్సులు; రక్షస్సులే రాక్షసులు. రాక్షసులు కేవలము తమప్రాణములనే రక్షించుకొనువారా? తమభార్యలప్రాణముల నయినను, బిడ్డలప్రాణముల నయినను రక్షింపనివారా? ఇది యేటి నిర్వచనము? శబ్దార్థమునందు లేని "తమప్రాణములనే" యను నాకాంక్ష యేల? "ఆశ్రితుల" నను నాకాంక్షగూడదా? రక్షించువా రగుటవలన రక్షస్సులు, రక్షస్సులే రాక్షసులని కర్మపదలోపముఁ జేసి చెప్పినను, బండితులనిర్వచనముకంటె నసమంజసముగా నుండదు. కుణపములను (శవములను) దినువా రగుటవలన కౌణపులు; మాంసమును దినువా రగుటవలన క్రవ్యాత్తులు, మఱి క్రవ్యాదులు; రక్తమును ద్రావువా రగుటవలన అస్రపులు; హింసించువా రగుటవలన ఆశరులు; ప్రాణములను దీయువా రగుటవలన అసురులు; వ్యథ పెట్టువా రగుటవలన యాతుధానులు. ఇట్లు వ్యవహరింపఁబడు చున్న పర్యాయపదములయొక్క నిర్వచనములను ముగించుటవలన నిఁకఁ బురాణవిషయములను దడుముదము.

ఒకవిషయ మన్ని పురాణములందు నేకవిధముగా నుండక భిన్నభిన్నరూపములను దాల్చి యుండును. అట్లగుటవలన సర్వసాధారణజనాదృతపురాణకథిత విషయములనుబట్టియే చర్చించుట యుక్తము గదా. కశ్యపప్రజాపతికి దితి, అదితి, దనువు, వినత, కద్రువయను నైదుగురుభార్యలు. అందు దితివలనఁ గలిగినవారు దైత్యులు లేక దైతేయు లని పిలువఁబడిరి. అదితివలనఁ గలిగినవా రాదిత్యులు లేక యాదితేయు లని చెప్పఁబడిరి. దనువువలన గలిగినవారు దనుజులు లేక దానవు లని నుడువఁ బడిరి. వినతాసంతతి గరుడాదిపక్షినిచయము; మఱి కద్రువాసంతతి వాసుకిప్రభృతిసరీసృపచయము.

కృతయుగమునందు దైత్యాదిత్యులకు జరామరణముల నొందక మనవలె నను నిచ్ఛ గలుగఁగా వారు పాలకడలిని దచ్చిరి. [వాల్మీకి

రా. బా. కా. స. ౪౫, శ్లో. ౧౫, ౧౬, ౧౭, ౧౮]. అప్పుడు పాల కడలియందు వరుణునిసుత యయిన వారుణి (సుర) జనించి, వరింప రాఁగా దానిని దైత్యులు నిరాకరించిరి; ఆదిత్యులు గ్రహించిరి. [వాల్మీకి రా. బా. కా. స. ౪౫, శ్లో. ౨౩, ౨౪]. సురను గ్రహింప కుండుటవలన దైత్యు లసురు లయిరి; సురను గ్రహించుటవలన నాదిత్యులు సుర లయి మోదముఁ బొందిరి.

శ్లో॥ అసురా స్తేన దైతేయా
స్సురా స్తే నాదితేస్సుతాః,
హృష్టాః ప్రముదితా శ్చాసన్
వారుణీగ్రహణోత్సుకాః॥

వాల్మీకి రా. బా. కా. స. ౪౫, శ్లో. ౨౪].

పాఠకులారా! వరించివచ్చిన సురనే నిరాకరించిన దైత్యులు రక్తపాయులును, శవభక్షకులు నయి యుందురా? వారిలోఁ గొందఱు రణరంగమునందు రౌద్రరస ముద్రేకించినపుడు వైరిరక్తమును ద్రాగి యుండ వచ్చును. దుస్సేనునిరక్తమును భీమసేనుఁడు ద్రావినట్లు మహాభారతమునందుఁ గలదు. ఒక్కచుక్క యయినను మిగులకుండ రక్తవీర్యునిరక్తమును గాళికాదేవి పాన మొనర్చినట్లు దేవీపురాణము నుడువుచున్నది. దైత్యదానవులలోఁ గొందఱు జిహ్వాచాపల్యవశు లయి యజ్ఞరహితవివిధమాంసభక్షణము సలిపి యుండ వచ్చును. యజ్ఞశేషము గానిమాంసమును దినుటవలననే వారు కోణపు లని నిందింపఁ బడిరి.

[శ్లో॥ యజ్ఞాయ జగ్ధ ర్మాంసస్యే
త్యేష దైవో విధి స్స్మృతః,
అతో ఽన్యథా ప్రవృత్తి స్తు
రాక్షసో విధి రుచ్యతే॥

మనుస్మృతి, అ. ౫, శ్లో. ౩౧]

పచ్చిపీనుఁగులనే మెసవువా రుండరు గదా! యజ్ఞదత్తమాంసము దేవతలును, యజ్ఞశేషమాంసమును ఋషులును దినుట సుప్రసిద్ధవిషయము.

ఆధిక్య మాలోచింతుమా, దైత్యు లగువాయునిర్‌ృతులు దిక్పాలకులు. కృత్యము లాలోచింతుమా, బలిచక్రవర్తి మహాదాత; ప్రహ్లాదవిభీషణులు పరమభాగవతులు; రావణబాణాసురులు శైవశ్రేష్ఠులు; మయుఁడు శిల్పివరుఁడు. దైత్యదానవులశక్తియు, నధ్యవసాయమును, శౌర్యవీర్యగాంభీర్యౌదార్యములును సుప్రసిద్ధములు. వారిలోఁ గొందఱు యజ్ఞనాశకులును, బరవనితాగతులును, బ్రాణిహింసకులు నున్నంతనే వారి నందఱను యాతుధానులు, నాశరులు, నాసురులు నన వచ్చునా? దేవత లందఱును, మానవు లందఱును బవిత్రచరిత్రులా? దేవతలకు రా జగునింద్రునిచర్యలను బరికింతము. అతఁ డెందఱతపస్సులను జెఱపఁ బ్రయత్నింప లేదు!! యజ్ఞమును జెఱచుట పాపమును, దపమును జెఱచుట పుణ్యమునా? అతఁడు తనసవతితల్లికడుపునఁ జొచ్చి గర్భమును భేదించుట యుక్తకృత్యమా? అహల్యను జెఱచుట పవిత్రకార్యమా? వృత్రాసురుని జంపుట పౌరుషమా? జంభాసురాదులను జంపుట హింసాకరము గాదా? అధిపతి వెల్లడి యగుటవలన నిఁకఁ బెఱదేవతల నటుంచి మానవులఁ జూతము. నరవరు లయినశిశుపాలదంతవక్త్రజరాసంధదుర్యోధన దుశ్శాసనాదులపనులు నింద్యములు గావా? మహాత్ముఁడుతగ్గాకు, త్రైమూరు, నాదర్షా మొదలయిన ప్రభులచేత లెట్టివి? గతించినవారిని వెదక నేల? ఇప్పటిజనులలో నసంస్కృతమాంసము మొదలగునభక్ష్యవస్తుప్రకరము, నుడికియు నుడుకని మత్స్యమాంసములను, బచ్చిగుడ్లను దినువారును, బరాంగనామానభంగము సేయువారును, బరద్రవ్యాహర్తలును, బ్రాణిహింసకులును, మఱియు నతిదారుణకర్మకరులు నుండుట మన మెఱుంగుదుము గదా. ఉపరికథితాచరణములవలన సఖలదేవతలును, నిఖిలమానవులును నింద్యచరిత్రులగుదురా? పాఠకులారా! వ్యక్తిగతాచరణములవలనను, సమయోపయుక్తాచారములవలనను సమగ్రకులమును దూషించుట గాని, భూషించు

ట గాని యుక్తము గాదు. సురాసురనరులకు వైవాహికసంబంధము లుండుట దెల్లము. పులోమదానవుని కూతురు శచి. ఆమె యింద్రుని మహిషి. బ్రహ్మపుత్రికయయిన యహల్య మానవుఁడయినగౌతమున కియ్యఁబడెను. దమయంతిచేత వరియింపఁబడుట కింద్రాదిదిక్పాలకులు ప్రయత్నించిరి. ఊర్వశి పురూరవునివలనను, మేనక విశ్వామిత్రునివలనను సంతానములం గనిరి. వజ్రనాభునికూఁతు రయినప్రభావతిని ప్రద్యుమ్నుఁడును, బాణాసురునికూఁతు రయినయుష ననిరుద్ధుఁడును బెండ్లి యాడిరి. ఇట్టివి మఱికొన్ని గలవు. ఇట్లుండ నసురులు నిందితు లయి రేల? తత్కారణములను లెస్సగా నాలోచింపఁగా వారియందు దేవతలకుఁ గలద్వేషభావమును, దేవతలయందు మనుజులకుఁ గలపక్షపాతిత్వము నని సహృదయులహృదయములకుఁ దట్టక మానదు.

విష్ణుపురాణాదులందు నసురులచరిత్రావళి విపులముగా వర్ణింపఁబడియున్నను, వారికి రక్షోరాక్షసనామములు గలిగినవైనము స్ఫుటముగాఁ గానరాకుండుట శోచనీయము. నిజగుణకర్మములవలన నసురులందఱు నేకకులజులును, క్రూరాత్ములును, సభ్యత్వహీనులును గారనియుఁ, బ్రత్యేకకులమునందును దుష్టచరిత్రులు గొందఱుందు రనియు, నట్లున్నంతనె సమగ్రకులము నిందితముగాఁ జాల దనియు నుపరికథితవిషయములను మనమున నిడి దీర్ఘముగా నాలోచించువ్యక్తి దప్పక నమ్ము నని నమ్మెదము.

---

## వానరజాతి.



సృష్టిక్రమోన్నతపద్ధతి గల దని డార్వినుపండితుం డూహించి నుడివినమతమును మనపండితు లంగీకరింప కున్నను, పాశ్చాత్యు లందఱు నంగీకరించిరి. ఆపండితునిమతమున మర్కటంబు లొకానొకజాతిజంతువులుగాఁ బరిణామ మొందెను; ఆపరిణతజంతువులు మనుజులుగాఁ బరిణామ మొందుటవలన దజ్జాతి యిపుడు లోపించెను.

ఆమతము సందేహాస్పదము. ఏల యనఁగ:—మర్కటంబు లిన్నియు నుదాహృతజాతిగాఁ బరిణామ మొందినచో, మర్కటంబు లిప్పుడు లే కుండ నుండవలెను. అవి కోటానఁగోటులుగఁ గానంబడుచున్నవి గదా! మర్కటంబులలోఁ గొన్ని మాత్రమే పరిణామమును బొందె ననినచోఁ, దత్పరిణతజాతిజంతువులలో నైతము కొన్ని మాత్రమే మనుజులుగఁ బరిణామ మొంది మఱి కొన్ని మిగిలి యుండవలెను. అట్లుగాక, యాజాతియంతయు లోపించెను. మర్కటంబులలోఁ గొన్నియుఁ దత్పరిణతజాతి జంతువులన్నియుం బరిణామమును బొందె ననుట యుక్తియుక్తము గాదు. అట్లు లోపించుటకుఁ దగినకారణమును గాని యాపరిణతిజాతియొక్క నామమును గాని తన్నివాసస్థానమును గాని యాపండితుండు నుడువ లేదు. ఊహింపం బడినది వివరింపం బడం జాలదు గదా!

ఆపండితునియూహము గొందఱకు నిజ మయినదియే యగును. పరిణామమును బొత్తిగఁ బొందకున్నను, మర్కటంబులకును మనుజులకును మధ్యమున నొకజాతి యుండెను. ఆజాతికి మర్కటంబులకుంబోలె వాలాదులును మనుజులం బోలె బుద్ధ్యాదులు నుండెను. తా నెఱుంగుట వలన మనయాదికవి యాదికావ్యమునం దాజాతిని విపులముగ వర్ణించి యున్నవాఁడు. దానియునికిపట్టు కిష్కింధ; నామము వానరము లేక ఋక్షము. వానర = నరఇవ = నరునివలెనుండునది. ఋక్ష=ఋష్యతే అనేన గహనం = దీనిచేత వనము పొందం బడును. అను రెండు నిర్వచనములనుబట్టి యాలోచింపఁగఁ దజ్జాతి మనుజజాతిని బోలి యుండి వనములందు నివసించు చుండె ననుట స్పష్టము. ఆజాతిలో వానరు లనియు ఋక్షు లనియు రెండుతెగలవా రుండిరో, లేక ఋక్షవిరజుఁ డను వాఁడు వాలిసుగ్రీవులజననములకుఁ గారణ మగుటవలన వానరఋక్షపదములు రెండును దజ్జాతికిఁ బర్యాయపదంబులో నవ్విషయంబు సందిగ్ధంబు. వా రిరుఁదెగలవారే యన్నను, గుణకర్మాదులవలన నారెండు నంతర్జాతు లనుటయే సమంజసము. వారు హీనబుద్ధు లగుటవలన వారిని మర్కటంబు లనియు భల్లూకంబు లనియు నార్యులు ననార్యులును

హేళనము సేయుచుండిరి. హేళనమునందు మనుజులను బశువు లనుట విచిత్రవిషయము గాదు.

వారిలో వాలి మహావీరుండును, హనుమంతుండు మహాపండితుండును, సుషేణుండు ఘనవైద్యుండును, జాంబవంతుం డతిధీమంతుండును, నలుండు కారుకర్మదక్షుండును,నీలుండు సేనానివరుండు నయినంతమాత్రమున వా రందఱు నార్యానార్యులతోడ సము లని చెప్పుటకు వలనుపడదు. నాగరకతయందు వా రార్యానార్యులకుం దగ్గిఱే యుండిరి. ఆర్యానార్యులతోడ వారికి వైవాహికసంబంధము గలిగి ప్రబలెను. తద్రక్తసంబంధకారణమువలన వారిమర్కటగుణంబులు క్రమక్రమంబుగా లోపింపంగ వా రార్యానార్యులలోం గలిసి పోయిరి. కనుకం దజ్జాతి పరిణామమొందె ననుటకంటె లీన మయ్యె ననుటయే యుక్తియుక్తము. జావా మొదలగు ప్రదేశములం దిప్పటికిని దోంక గలమనుజు లరుదుగాం గనంబడుదురు. ఇట్లాజాతిలయము సంభవింపంగ వానరబుక్షనామములు క్రమముగా మర్కటభల్లూకపర్యాయములలోం జేరెను. అంతే కాని, యాజాతివారిని మర్కటభల్లూకంబు లని భావించుట యనుచితము. వారు మర్కటభల్లూకంబులే యయినచో, వారిస్త్రీ లిందప్రసూర్యాగ్నివాయువులను మోహింపం జేసినంతటిసుందరు లయి యుందురా? వారికన్యకను– జాంబవతిని శ్రీకృష్ణభగవానుండు పెండ్లి యాడి యుండునా? వారిలో వివాహబంధ ముండునా? ఉండె నని నను, తమ్ముని భార్య నంటరా దనియు "దేవరాచ్చసుతోత్పత్తిః" అను ధర్మానుసారముగ నన్నభార్య నొకప్పుడు గ్రహింప వచ్చు ననియు న్యాయము లుండునా? వారు చేలాలంకారములను ధరించి యుందురా? వారికి లజ్జాదిగుణము లుండునా? వారు కోటలను పేటలను నిర్మించుకొని యుయ్యెలమంచములు మొదలగు పరికరములను వాడుచు మంత్రిసామంతులతోడ రాజ్య మేలు చుందురా? మనుజదనుజులతోడ మాటలాడం జాలి యుందురా? క్రమము దప్పక పనులను యుక్తముగ నెఱవేర్చి యుందురా?

కావున వానరజాతియు ఋక్షజాతియు లేక తజ్జాతియుగసంయుక్తమయినయొకజాతి వేఱుగానుండె ననియుఁ దజ్జాతిజులు క్రమక్రమముగ నార్యానార్యులలోఁ లీనమయి పోయి రనియు భావించుటయే నిర్బాధకము; మఱి సమంజసము.

---

## అమరసింహుఁడు.



సంస్కృతనిఘంటువులలోఁ సుప్రసిద్ధ మయి సమస్తపండితమాన్య మగుచు "అమర" మనుసాధారణవ్యవహారము గల "నామలింగానుశాసననామకనిఘంటు రాజమును రచించినవిబుధవరేణ్యుఁడు— అమరసింహుఁడు.

సంస్కృతశబ్దములయొక్క లింగజ్ఞానమును ధాతువులయొక్క పదజ్ఞానమును మహాపండితులకే దుర్జ్ఞేయ మగుచుండ నిఁక నల్పజ్ఞులగతి నుడువ వలెనా? అట్లుండ సామాన్యజ్ఞానము గలవారికి సైతము సంస్కృతశబ్దపర్యాయపదములు మాత్రమే కాక, తల్లింగభేదమును సుబోధ మగునట్లు మీఁదఁ బేర్కొనిననిఘంటువరమును భూలోకమున కొసంగి నిజనామమును సార్థకము సేయుచుఁ గీర్తికాయముతో వెలయు సుధీవరునినామము సింహోపాధియుక్తమై యుండుటవలన నతఁడు క్షత్రియుఁ డనుట నిక్కవము.

నిజకులమును దెలియఁ జేయుటకొఱకు క్షత్రియులు దమనామములతుద "వర్మ" "సింహ" "రాజ" అనుపదత్రయములో నొకదానిని జేర్చెదరు. సింహశబ్దమునుండియే "సింఘ" రూపమును "సింగ" రూపమును గలిగినట్లు రాజశబ్దమునుండియే "రాయ" రూపమును "రావు" రూపమును గలిగెను. ఆశబ్దములు క్షత్రియులనామాంతములందే చేరుట విధి యయినను, నియమరహిత మగునిక్కాలమునఁ బెఱవారిపేరులందును జేరు చున్నవి.

తాను నిజనిఘంటునాందిశ్లోకమునందు మూర్తినిర్దేశమును జేయకుండుటవలనను ద్విమూర్తులనామావళికి ముందే బుద్ధదేవుని పేరులను వచించి యుండుటవలన నాతఁడు బౌద్ధధర్మావలంబకుఁ డని నిశ్చయింపఁ దగును. అతనికాలమున బౌద్ధులకు నార్షమతస్థులకు నైకమత్యము మన దేశమందలి మతతత్త్వయమువారి కున్నదానికంటె నెక్కుడుగా నుండె ననుట మాళవికాగ్నిమిత్రనాటకాదులవలన సువిదితము.

శ్లో॥ ధన్వంతరిక్షపణకామరసింహశంకు
బేతాళభట్టఘటకర్పరకాళిదాసాః
ఖ్యాతో వరాహమిహిరో నృపతే స్సభాయాం
రత్నాని వై వరరుచి ర్నవ విక్రమస్య॥

అను విక్రమార్కచరిత్రమునందలి శ్లోకమువలన నతం డుజ్జయినియందు విక్రమార్కుని యాస్థానపండితులలో నొకం డయి యున్నట్లు విదిత మగుచున్నది, "విక్రమ" లేక "విక్రమార్క" నామము కేవలము బిరుదమే యనియు నట్టినామముతోడ నొప్పినన్నృపతియే శ్రీకుండుటవలన నతం డుజ్జయినిని బాలించె ననుట బొత్తిగఁ గల్ల యనియు నిప్పటివైతిహాసికులలోఁ గొంద అనుచున్నను, మనదేశమున నతనిచరిత్రముండుటయే కాక, యతనిశకము వ్యవహారింపం బడుచుండుటవలన నతఁ డుండి యుజ్జయినిని బాలించినవారిలోఁ బ్రసిద్ధి నొందె ననుటయే సమంజసము.

అమరసింహుఁడు విక్రమార్కాస్థానస్థితుఁ డగుటవలనను క్రీస్తుశకాబ్దమునఁదు ౫౭ చేర్పఁగా విక్రమశకాబ్ద మేర్పడుటవలన నిప్పటికి రెండువేలయేండ్లకు ముందే యతఁడు జనించెను.

అతనితలిదండ్రులనుగూర్చియు నుత్పత్తినిగూర్చియు నిర్దేశము నందుఁ గలప్రవాదము నిట వివరింపం బడును:—ఉజ్జయినీనివాసి యైనశబరస్వామి యనుబ్రాహ్మణబ్రహ్మచారి యొకఁడు విద్యార్థియై కాశికేగుచుండెను. అప్పుడు కాశికిఁ గొన్నికోసులదూరమునందు దారిప్రక్క

నున్న మఱ్ఱిచెట్టు నాశ్రయించి యుండినయొకానొక బ్రహ్మరాక్షసుఁడు బ్రాహ్మణాకారముతో నాచెట్టుక్రింద నిలుచుండి యాదారిని నడుచువారిని "పచేఃనిష్ఠాయాం కింరూపమ్" ("పచ్" ధాతువునకు నిష్ఠాప్రత్యయయోగమందు నేరూపము గలుగును?) అని ప్రశ్నించుచుండెను. ఆ ప్రత్యయము పాణినికథిత మగుటవలనను దద్వ్యాకరణ మప్పు డంతగా వ్యాపించి యుండక పోవుటవలనను శ్రోతలలోఁ గొందఱు నిరుత్తరులగుచుండిరి; మఱి కొందఱు "పక్త" మనుచుండిరి. అట్టివారి నారాక్షసుఁడు భక్షించి బ్రతుకుచుండెను. ఇట్లుండ నాదారి నేగుచున్న శబరస్వామి యట్లే ప్రశ్నింపఁ బడఁగాఁ బాణినిసూత్రములను మాత్రమే యెఱింగి యుండుట నతఁడు "పక్వ" మన నారక్కసుఁడు సంతసించి యతనిని దనయొద్ద నుంచి యాతనికిఁ దగునాహారాదు లొసంగుచు మహాభాష్యమునే కాక, తనకుఁ దెలిసిన సమస్త విద్యల నచిరకాలంబున నేర్పి యతని నొకమహాపండితుని జేసి తానుశాపాంతమును గాంచి ముక్తి నొందెను. ఆమహాపండితుఁడే పూర్వమీమాంసయొక్క శాబరభాష్యరచయిత యై యుండ వచ్చును. అతనిని జంద్రవర్మ యని కొందఱందురు. చంద్రవర్మనామధేయ మాతనికి రెండవది యై యుండెఁగాఁబోలును. అతఁడు మరలి స్వస్థానమున కేగుచుండఁగా మార్గమున నున్న యొకానొకగ్రామమునందు నివసించుచుండినశూద్రి యొకతె యతనిని జూచి భక్తిమెయిఁ దనయింటికిఁ గొని చని తానును దనయేకమాత్రకన్యయు నతనికి సకలలోపచారములు సలుపుచు సేవించుచుండిరి. ఆతఁడు వారిభక్తిపాశబద్ధుఁ డయి కొన్ని దినములు వారియింట నివసించెను. రూపయౌవనసంపన్న యైనయాశూద్రకన్య యతనియందు బద్ధానురాగ యై యతనిని దప్ప వే ఱొకనిని బెండ్లాడ నని తనతల్లి కెఱింగింప నామె యతివినయముతోఁ దనకూఁతునుద్దేశము నావిబుధేశునకు విన్నవించెను. అతఁ డందుల కంగీకరింపక యక్కడనుండి వెడలి నిజగృహమును జేరెను. సుతానురోధవశమున నాశూద్రియుఁ దనసందనిని వెంటం గొని యుజ్జయిని కేగి తత్పురిపాలకుఁ డయినశ్రుతకీర్తిమహారాజును దర్శించి భయభక్తులు గదురఁ బ్రణమిల్లి కన్నీళ్లు గార్చు

చుఁ దనకూఁతుకోరిక నాపబ్రభువునకు విన్నవించెను. అనులోమవివాహాపబ్రథ యప్పుడు పబ్రచారమున నుండుటవలన మహారాజు సదయహృదయుఁడయి శబరస్వామిని దనసమ్ముఖమ్మునకుఁ బిలిపించి, యాతని గుణజ్ఞానరూపలుబ్ధుఁ డయి యతనికిఁ దనయేకమాత్రపుత్త్రిక నొసంగ నిర్ణయించి, మొదటఁ దనపురోహితునిపుత్త్రిని దరువాతఁ దననందనిని బిదపఁ దనకోశాధికారి యయినవైశ్యునిదుహితను దుద నాశూద్రిసుతను బెండిలి సేసి తనరాజ్యమును సమర్పించెను. శబరస్వామియు నలుగురుభార్యలతో రాజభోగము లనుభవించు సుఖముండెను.

అంత నాబ్రాహ్మణివలన విక్రమార్కాస్థానపండితవరులలోనివాఁడైనవరాహమిహిరుఁడును, క్షత్త్రియవలన భర్తృహరియును విక్రమార్కుఁడును, వైశ్యవలన భిషగ్వరుఁడైనహరిచంద్రుఁడును విక్రమాస్థానవిబుధేశులలోనిశంకుఁడును, శూద్రవలన నమరసింహుఁడును జనించిరి. హరిచంద్రుఁడు నవరత్నములలో నెన్నం బడకున్న, నాతఁడు విక్రమునియాస్థానమునందే వైద్యుఁడుగా నుండఁ బోలును. కొడుకులు పెద్ద లయినపిమ్మట రాజ్యార్హుఁడైనభర్తృహరికి రాజ్య మొసఁగి, విక్రముని యువరాజుగా నొనర్చి, తక్కినతనయుల కుపయుక్తపదవు లేర్పఱిచి శబరస్వామి బ్రహ్మధ్యానపరాయణుఁ డగుచుఁ దనశేషకాలమును గడపెను. భర్తృహరియుఁ గొంతకాలము రాజ్యభారమును వహించి విరక్తుఁ డయి దానిని దనసోదరుని పైని మోపి తాను సన్యసించెను. అంత విక్రమార్కుఁడు పెద్దకాలము రాజ్యమేలుచు మితి లేని కీర్తిప్రతిష్ఠల నార్జించెను.

ఈపబ్రవాదమునే యధోఽంకితశ్లోకము స్థిరపఱచు చున్నది:—

శ్లో॥ బ్రాహ్మణ్యా మభవ ద్వరాహమిహిరో జ్యోతిర్విదా మగ్రణీః
రాజా భర్తృహరిశ్చ విక్రమనృపః క్షత్త్రాత్మజాయా మభూత్
వైశ్యాయాం హరిచంద్రవైద్యతిలకో జాతశ్చ శంకుః కృతీ
శూద్రాయా మమర ష్ష డేవ శబరస్వామిద్విజ స్యాత్మజాః॥

ఇట్లుండఁగా బ్రాహ్మణివలనఁ గలిగినవాఁడు వరరుచి యనియు, క్షత్త్రియవలనఁ గలిగినవాఁడు విక్రమార్కుఁ డనియును, వైశ్యవలనఁ గలిగినవాఁడు భట్టి యనియు నతఁడుభట్టికావ్యమును రచించుటయే కాక, విక్రమార్కునికి మంత్రిగా నుండె ననియును, శూద్రివలనఁ గలిగినవాఁడు భర్తృహరి యనియును గొంద ఱందురు. అది చింతనీయము.

---

## పతిసహగమనము.

జగమందలి దేశములలో భారతమే పాతివ్రత్యమున మిన్న యన్న నత్యుక్తిగా నేరదు. ఇట్లనుటవలనఁ బెఱదేశముల మానినీమతల్లులు భ్రష్ట లని కాని, భరతఖండపుఁబడతు లందఱును బతివ్రత లని కాని నాయాశయము గాదు. పతియందు సతిప్రీతి గలనాతి యెక్కడ నైన నుండును. కాని- తనపతియే తనకుఁ దో డనియు జో డనియు నీ డనియు తేఁ డనియు మఱి దేవుఁ డనియును బతిచిత్తమే తనచిత్త మనియును బతి గతించినపిమ్మట నీలోకము కేవలశోకమయ మనియును దృఢముగా నమ్ముటయే కాక, పత్ని సర్వావస్థలయందును బతికి సహధర్మచారిణి యై యుండ వలె నని బుద్ధిం దెలియుసతి యీదేశమునందుఁ దక్కఁ దక్కిన దేశములందు లేదు. ఇది నిశ్చయము. అందులకు నిదర్శనముగా నూఱేండ్లకు ముం దీదేశమందలి సతీమణులలోఁ గొందఱు పతిసహగమనము చేసి యున్నారు. పతిసహగమన మనఁగా మగఁడు మరణించినతరువాత మగువ సుస్నాతయై తొడవులను దొడిగి పతిశవమువెంటం జని సొద మీఁదఁ బద్మాసనముగాఁ గూర్చుండి నిజపతిశవమును దన తొడల నిడుకొని—అట్లుకానిచోః- బతిశవముప్రక్కఁ బండుకొని, చిచ్చు రగిలింపించి నిశ్చలచిత్తముతో భస్మీభూత యై సురపురమున కేగుట. దానినే "సహగమన" మనియు "సతి" యనియు "గుండమునఁ బడుట" యనియును వాడుచుండిరి. నేలను గొంచెము లోఁతుగాఁ ద్రవ్వినపిదప

నట్టిసాధ యాపూర్వంబడు చుండుటవలన దానికి "గుంటి" యను వాడుక గలిగెను.

ఆయాచారము మన దేశమునుండి గతించుటవలన దానిని విను నప్పుడు మనకుభయ వింత గలుగును. అది గతించుటకుఁ గారణము రాజశాసనమే యగును; కాని- మన దేశమందలి పాతివ్రత్యలోపము గాదు.

పందొమ్మిదవ క్రైస్తవశతాబ్ద ప్రథమపాదమునందు బ్రహ్మసమాజస్థాపనాచార్యుం డయిన రాజా రామమోహనరాయని ప్రరోచనము వలన లార్డు విలియము బెంటింకు రాజప్రతినిధిగా నున్నప్పుడు "పతిసహగమననిషేధశాసన" మేర్పడెను. అది పాటింపం బడువఱకును బతిసహగమనము లక్కడక్కడ జరుగుచునే యుండెను. మన దేశజుం డయిన రామమోహనుం డది క్రూరాచారమని యాందోళనము చేసినంతనే క్రైస్తవమతప్రచారకు లాతనివెనుకఁ దాళము వేయుచు "హిందువులు మగలు చచ్చినయనదలను గాలుసేతులు గట్టి పతులశవములతోఁ గాల్చెడికూరకర్ము" లని పాడఁ దొడంగిరి. ఎంత వింత! దేవుఁడు పశుపక్ష్యాదులను దమపొట్టలకొఱకే సృజించె ననియును బ్రాణులవధ పాపకార్యము గా దనియును నమ్ము క్రైస్తవులు, పతివ్రతామహిమ మెఱుంగం జాలక, స్వార్థముకొఱకు వంకాయ నైనను ద్రెంప నిచ్చగింప నిభారతీయు లనాథలను బలిమిని గాల్చి చంపుచుండి రనుట యతిసాహసము గాదా?

"అమృతబజార" పత్త్రికాస్థాపకుండును నాంగ్లభాషాలేఖకుల లోసుప్రసిద్ధుండు నయిన శ్రీశిశిరకుమారఘోషుని "పిక్చర్సు ఆఫ్ ఇండియను లైఫు" పుస్తకమునందలి ౫౫వ పుటయందు నున్న పతివ్రతాతిలకముయొక్క విచిత్రచరిత్రమును జదివిన క్రైస్తవాదులు తమదురభిప్రాయమును మార్చుకొని యుందు రని నమ్మవచ్చును. ఆచరిత్రము సుప్రసిద్ధ మగుటవలన దాని నిట వివరించుట మాని శబ్దప్రమాణమూలములై నాకు విశ్వాసమును గలిగించిన రెండుచరితముల నిట వ్రాయుదును.

అందు మొదటివాఁడు--నారసింహపితామహుని కిద్దఱు తమ్ములుండిరి. అందు ప్రథముఁ డయినజగన్నాథదేవుఁడు జయపురాంతర్గత జగన్నాథపురమును ద్వితీయుఁ డయిననరసింహదేవుఁడు నవరంగపురమును బాలించిరి. నరసింహదేవున కిద్దఱుభార్యలు. ప్రథమకుఁ జైతన్యదేవుఁ డనుపుత్త్రుఁ డుండెను. ద్వితీయ వంధ్య. ఇట్లుండఁగా నరసింహదేవుఁడు దివి కేగుటకుఁ గొన్ని నెలలకుఁ ముందాతఁ డొకయేకాదశియందు యథాపూర్వ ముపవసించి ఫలాహారము గొనుటకుఁ గూర్చుండి యుండఁగాఁ జిన్నభార్య యాయనకడ నిలిచి యుండెను. పెద్దభార్య ఫలాహారపదార్థములను దెచ్చి వడ్డించుచుండెను. అప్పు డాయన చిన్నభార్యను జూచి "నీసవతి పుత్త్రవతి యగుటవలన నామె యింకఁ గొంతకాలము జీవించి యుండఁ దగును. నీకు మ ఱెవ్వరును లేకుండుటవలన నీవు మత్సహగమనము సేయుట యుక్తము. అట్లు చేసెదవా?" యని యడుగఁగా "అట్లే తప్పక చేసెద" ననెడి యామెప్రత్యుత్తరము ఫలాహారవస్తువులను గొని వచ్చుచున్న పెద్దభార్య చెవిం బడెను. అంత నామె మందహాసముతో వారిని సమీపించి "యేమి ప్రశ్నోత్తరములు జరుగుచున్న" వన వారు శంకితులయి మౌనముద్రలను ధరించిరి. "అప్పుడు చేయవలసిన దాని నిప్పుడు చెప్ప నేల?" యని తాను దెచ్చిన వస్తువులను వడ్డించి యామె చనెను. అట్లు జరిగిన కొన్ని నెలలకే నరసింహదేవుఁడు దివికిం జనెను. అప్పు డాయనపెద్దభార్య చిన్నభార్యను జూచి "పతియెదుటఁ బ్రతిన చేసితివి గదా! ఇప్పుడు సహగమనమునకై సిద్ధపడు" మనఁగా నామె గడగడవడంకుచు సవతియడుగులం బడి గద్గదస్వరముతో "అక్కగారూ నేను దెలియక యప్పుడు ప్రతిన యొనర్చుట నిక్కము. కాని- యిప్పుడు చిచ్చును దలంచినంతనే నాకు పెచ్చుగు భయము గలుగుచున్నది; సాదం జొరం జాల" నని విలపించెను. అప్పుడు మందహాసముతోఁ జెల్లెలి నూఱడించుచు "నాతనయుని నీవు గనినట్లే భావించుచుఁ బాలించుచుండు" మని యామెకును "మరణించునదే సవతితల్లి యనియు నున్నదే కన్నతల్లి యనియును మదిఁ నెంచి మెలంగుచుండు" మని తనయునకు నాదేశించి యప్పరమపతివ్రత మహానందభ

రితె నై పతిశవముతోడఁ జితి నారోహించి సురపురమున కేగెను. ఆ స్థలము నేఁటికి నొప్పుచున్నది.

ఇఁక రెండవది:—మాడుగులునందు జనించి యింటుంబించుగా నఱువదియేండ్లు జీవించి యిప్పటికిఁ బదియేండ్లక్రిందటఁ బరలోకమున కేగినదండాపురపు వీరపరా జనుక్షత్రియువరుఁ డాంధ్రకవి యగుటవలన నతనిని విశాఖపట్టణమండలవాసులలోఁ గొంద ఱయిన నెఱింగి యుందురు. అతని కొక భార్యయుండెను. ఆమెపేరు వెంకమ్మ. ఆమెకు వివాహమయిన మూడవదినమునందే- ఆమెచేతికంకణము విసర్జింపఁ బడకముందే- యామెభర్త శూలరోగపీడితుఁ డయి యీలోకమును విడిచెను. అప్పు డాపతివ్రతాశిరోమణి వివాహవస్త్రముతోడఁ బెనిమిటితోఁ బెండ్లిపీఁటమీఁద గూర్చుండినట్లే పతిశవముతోఁ జితిపై వసించి స్వర్గమును జేరెను. మాడుగులునందలియాస్థలి "వెంకమ్మగుండ" మను పేర వెలయుచుఁ బూజింపఁ బడుచున్నది.

ఒక్కొక్క మండలమున నిట్టిసతీమణు లెందఱో యుండిరి. అయిన నిప్పటి కింతటితో విరమింతును. లౌకికబుద్ధు లగుపాశ్చాత్యులు పారలౌకికబుద్ధు లగుభారతజనుల మహత్త్వము నెఱుంగం జాలరు గదా!!

---

## నాటకములు.



జీవుఁడు సుఖస్వరూపుఁ డగుటంజేసి సుఖము నొందఁ దా నెల్లప్పుడును గోరుచుండును. జ్ఞాన ముండినం గాని, సుఖలాభంబు గలుగదు. కావుననే సకలజంతుసంతానములలో జ్ఞానజీవుం డగునరుండె నిజం బయినసుఖంబుం బొందం జాలును. మనుష్యుఁడు విజ్ఞానముం గని యైహికాముష్మికసుఖంబులం బడయుటకొఱకే కరుణాపారావారుం డగునప్పరమపురుషుండు వేదంబులను బ్రసాదించెను. వేదంబులు ప్రభుసమ్మితంబులగుటంజేసి యం దుదాహరణంబు లుండవు. కనుకఁ ద దుక్తములయిన- జ్ఞానాస్పదనీతులు సోదాహరణములుగా నున్నచోఁ బాఠకుల

మానసంబులందు గాటముగా నాటుకొను నని తలంచి కృపాళు రగు ఋషిపుంగవులు పురాణములందు రచియించి ప్రకటించిరి. పురాణమ్ములు మితప్రసమ్మితమ్ము లగుట నొక్కొక్కచోట నీతి నొక్కివక్కాణించు చుండును. అట్లు పలుకుట సుకోమలహృదయు లగుకొందఱకు నించుక వెగటు పుట్టించు నని యెంచి. తదుక్తకథలనె కవివరులు వివిధవర్ణనాంశములతోఁ గాంతాసమ్మితంబు లగుకావ్యంబులను జేసిరి. కావ్యములు కేవలశ్రావ్యములగుటచేత నంతగాఁ జిత్తాకర్షకములు గా వనియు నవి దృశ్యప్రబంధములుగా నున్నచోఁ జూపఱయుల్లంబులందు నీతివల్లు లల్లిబిల్లిగా నల్లుకొని పల్లవించు ననియు నాలోచించి లోకోపకారు లగుకవిరాజులు పండిత పామరప్రమోదదాయకసంగీతమిళితములుగా నాటకములను విరచించిరి. నాటకములు జనులయున్నతిసాధనములనుట నిస్సందేహము.

విబుధోత్తముల యుపన్యాసంబులను వినుటచేతనే మఱి కవిసత్తముల నాటకములను గనుటచేతనే పశ్చిమఖండవాసులు నాగరకాగ్రగణ్యులయి రన్నచో, నది యత్యుక్తి గా నేరదు. కాఁబట్టి నాటకరచనము ను దదభినయమును నత్యంతావశ్యకములు.

భరతఖండమందలి భాషలలో హిందీభాషయె నాటకయోగ్యమయిన దనియు నాంధ్రభాష బొత్తిగా నుపయోగింప దనియు నట్లు గాకున్నఁ బూర్వకవులు నాటకములను దెనిఁగించి యైన నుండరా? యనియు నొక్క రనిరి. అ ట్లనుట సరికాదు. ఏల యన:—దేశభాషలయందు లెస్స యయిన దని ప్రఖ్యాతి గాంచిన తెనుఁగుభాష భావప్రకటనమునకుఁ బనికి రా దనఁ జాలము; మఱి నాగరకు లగునాంధ్రులు సూచింపఁ దగినయర్థమును సూచింప నే ర రన లేము. కావున నాటకప్రయోగమునకుఁ దెనుఁగు గడుఁదగిన దని నుడువుటకు వెనుదీయము.

కవిత్వము సైతము కాలానుగుణము. నన్నయాదులు పురాణములను దెనిఁగించిరి; పెద్దనాదులు కావ్యములను గల్పించిరి; ఇప్పటికవులు వచనప్రబంధములను నాటకములను సైతము రచించుచున్నారు.

పురాణములను దెనిఁగించినవారు తెనుఁగుభాష కావ్యనిర్మాణమున కుప యోగింప దని యెంచి రనియును, గావ్యకర్త లాంధ్రభాష నాటకరచన మునకును వచనప్రబంధములకును వలను పడ దని తలంచి రనియును జె ప్పుట యతిసాహసము. కవు లెప్పుడును నిజాభిమతము ననుసరించి కబ్బంబులను జేయు చుందురు. కనుక నన్నయపెద్దనప్రముఖపూర్వకవు లకు నాటకరచనమునందు నభిరుచి గలుగమిం దదర్చనమును వారు మానుకొని రనుటయే యుక్తియుక్తము.

నాటకమునందుఁ బాత్రోచితభాష నుపయోగింప వచ్చునా? కూడదా? యనువిషయము విచారింతము. మహాకవి- కాళిదాసాదులు పాత్రోచితభాషనె యుపయోగించి యుండుట సుప్రసిద్ధము. ఆంగ్లేయ కవులు సైతము పాత్రోచితభాషను వ్యవహరింతురు. పల్లెయందలిగొ ల్లవాఁడు పట్టణమం దున్న పండితునివలెఁ బలుకుట "పిట్ట చిన్నది; కూ తపెద్దది" యనునట్లు స్వభావ విరుద్ధమయి హాస్యాస్పదముగా నుండు ను. స్వాభావికము లగునాటకములె జనులమనమును మిగులరంజింపఁ జేయఁ గలుగును. ఆతత్త్వంబు నెఱింగినకొందఱు ధీరులు తమనాటక ములయందుఁ బాత్రోచితభాషను వాడుచున్నారు. అట్టిభాష గ్రా మ్యమనియును దూష్యమనియును గబ్బంబులందు వాడఁ గూడని దని యును గొందఱు పండితోత్తములు సాటుచున్నారు. పాపము! ఇట్టి వారిదూషణములకు జడిసియే కాఁబోలు నొకకవి తననాటకమునందుఁ దెనుఁగుతె న్నెఱుంగనితురుష్కప్రభునినోట స్వచ్ఛము లగునాంధ్రప దంబులను బలికించి రసభంగంబు గావించెను! పండితోత్తములారా! పా త్రోచితభాషను వాడువారు గ్రామ్యభాషాజ్ఞానము లేనివారు కారు; పూర్వంపుఁగబ్బంబులందు గ్రామ్యప్రయోగంబులు లేక పో లేదు. అవి లేకున్నచో ననింద్యగ్రామ్య మనుశబ్దము సృష్టింపఁ బడ కుండును. ప్రాణాపహారక మగువిషము సన్నిపాతరోగి కొసంగఁ బడునపుడుఁ హిత కర మగునట్లు కావ్యానర్హ మగు గ్రామ్యభాష నాటకమునందుఁ బా త్రోచితముగా వాడఁ బడునపుడు పూజ్యమే యగును.

గ్రామ్యభాష నియమము లేని దయి యొక్కొక్కమండలిమునఁ నొక్కొక్కవిధముగా వాడఁబడుచుండుటవలన నాంధ్రుల కందఱకుం దెలియని దది ప్రయోగయోగ్యము గా దని మఱి కొందఱమతము. విమర్శింపఁగా నొకభాషకును మఱియొకభాషకు నుండు నంతభేద ముండక, యీభాషమాత్రభేద ముండుటం జేసి, కవి నిజముగ డలప్రచలితగ్రామ్యభాషను వ్యవహరించినచో, నది యిక్కాలపుజనసామాన్యమునకుఁ దెలియకుండునా? కాఁబట్టి యట్టి వాదము నిరర్థకము.

ఇప్పటినాటకములలోఁ గొన్నిటియందు సందర్భశుద్ధి లేకుండుట గన్పట్టెడిని. అది ముఖ్యముగా నుండవలయు నని పెనఁగులాడు వా రేరును గాన రారు. సందర్భశుద్ధి లేనినాటకములు సరసులమానసములకు నుల్లాసము సల్పఁ జాలవు. కావునఁ గవీశ్వరులు సందర్భశుద్ధిం బాటించి నీతిబోధకము లగునాటకములను రచించుచు జనులు విజ్ఞానసంపన్నులయి యైహికాముష్మికసుఖంబు లొందునట్లు సేయుదురు గాత!

---

## బలి.

బలం త్యనేన బలిః—బలపాణనే. ( దీనిచేత బ్రతుకుదురు. ) అని బలిశబ్దముయొక్క నిర్వచనము. కనుక బలి యనుపదము పూజార్థమయినకానుకకును బ్రజలు ప్రభువులకొఱకు నిచ్చుకప్పమునకును బర్యాయముగా వాడఁబడు చున్నది.

భూతము లనఁగాఁ బ్రాణులును బిశాచములును; వానికై సమర్పింపఁ బడెడియాహారము "భూతబలి" యనం బడును. కాని, "నరబలి" యను పదమును మాత్ర మట్టు లన్వయింపక, "నరులే బలిగా నగుట" లేక "నరులనే బలిగా నిచ్చుట" యని యన్వయింప వలసివచ్చెడిని. అట్లన్వయించుటకుఁ గారణ మట్టికూరాచార మీదేశమున నుద్భవిల్లుటయె.

ఖోదువారనునొకతెగవారీదేశారణ్యప్రదేశములందు నివసించు చున్నారు. వారికిఁ బ్రధానదేవుఁడు సూర్యుఁడు; ప్రధానదేవత భూదేవి. వారిపొలములు చక్కఁగా ఫలించుటకొఱకును వారిగ్రామములందు విస్ఫోటకాదిరోగములు గలిగినపుడు తచ్ఛాంతికొఱకును వారు "భూదేవి" నుద్దేశించి "మెరియా" (నరబలి) నిచ్చు చుండెడివారు. "మెరియా" కు నుపయోగించినవారికి వయోనిర్ణయమును లింగభేదమును లేకుండెను. మానవమాత్రులందఱును దానికిఁ బాత్రులె. వా రప్పుడప్పుడు దొంగిలింపం బడుచుండినను, సాధారణముగాఁ గొనఁబడు చుండిరి. ఒక "మెరియా" యొక్క వెలయేఁబదిమొదలు రెండువందలరూపాయలవఱకగుచుండెను. "మెరియా" యొక్క విధివిధానంబుల నిట వర్ణించుట యనావశ్యకము. అందులకై తేఁబడినవారు లెస్సగాఁ బెంపఁబడి, తుదకు నఱకఁబడు చుండెడివా రని చెప్పినం జాలును. ఈభయంకరాచారమును మాన్పుటకు ౧౮౩౭వ సం॥ మేజరు కాంబెలు నియమింపబడెను. ౧౮౪౧వ సం॥ జనవరి తేలాది యమావాస్య యయ్యెను. నాఁడు రమారమి ౨౪౦ మంది బలి గావింపఁ బడినట్లును, ౧౮౩౭-౪౬ సంవత్సరములనడుమ ౭౧౭ గురు పురుషులును, ౭౮౦ గురుస్త్రీలును బలియయి యమసదనమున కేగక, తనచేత విముక్తులై బ్రతికినట్లును నాతనివిజ్ఞాపనమువలన మనకుఁ దెలియు చున్నది. ఖోదువా రిప్పుడు "నరబలి" ని మానుకొన్నను, ఎనుపోతులు మొదలగు మేకంబులను, గుక్కుటంబులు మొదలగు పులుఁగులను బలిగా నిచ్చుటను మాత్రము మానుకొనలేదు. అయ్యో! పాపము! అనాగరులును విద్యావిహీనులు నగువారిపని కేమి? నాగరులయి విద్దెలచేత విరాజిల్లు చున్న యగ్రజాతులవారును రాజులును జ్ఞానహీనులయి దేవీపూజల కనియు మ్రొక్కుబళ్లకనియుం జెప్పుచు దిక్కులేనిజంతువులను సుంతయైనం గనికరము లేక యంతకనిశాంతంబునకుం బంపించు చుండుట కడు శోచనీయము గదా!! జంతుహింసనం బనుదురాచార మీదేశమున నెప్పు డెట్లుకలిగెను? అవ్విషయ మిక్కడ నొక్కింత యాలోచింతము. అనాదులగువేదములయొక్క మంత్రములందుఁ బ

శుహింసనుగూర్చి చెప్పఁ బడియున్న ట్లనంజాలము. కాని, బ్రాహ్మణ ములయందు నది యందందు గోచరించెడిని. ఆశ్వలాయన బౌద్ధాయనా పస్తంబ కాత్యాయనద్రాహ్యాయనాది శ్రౌతసూత్రంబులయందుఁ బశు హింసతోఁ గూడినయజ్ఞవిధానంబులు వక్కాణింపం బడి యుండుటవలన జైమిని నిజమీమాంసా శాస్త్రింబునఁ బశుహింసనము యజ్ఞమునందు విహిత మనియుఁ దద్ఇతరకార్యములందు నిషిద్ధ మనియును సిద్ధాంతీక రించెను. కావునఁ బ్రాచీను లయినయార్యులు యజ్ఞకర్మమునందే పశుహింసనమును జేయుచు యజ్ఞశేషమాంసమును మాత్రము భుజిం చు చుండిరి. మఱియుఁ దమపొట్టకొఱకే జంతువులను గిట్టించు చుండిన వారిని క్రవ్యాదుల నియును కౌణపు లనియును దిరస్కరించు చుండిరి. క్రవ్యాదు లనఁగా మాంసభక్షకులు; కౌణపులనఁగా శవభక్షకులు. యజ్ఞములను దూషించి మానినవా రనార్యులు. వా రిప్పటి గ్రామదేవ తాదాసులవలెఁ దమ దేవతలకు జంతువులను బలిగా నిచ్చుచుఁ దిను చుండిరి. అట్టివారిని దస్యు లనియును దాసు లనియు నార్యులు నిందిం చు చుండిరి. మఱియు నార్యులకు ననార్యులకును ఘోరంబు లయిన పో రాటంబు లెన్నియో జరుగు చుండెను.

మాంసాశనప్రలోభన కారణమునఁ గాఁబోలు ఛాగాదివిశసన యుక్తం బయినయజ్ఞంబు గోమేధరూపమును దాల్చి, పిమ్మట హయ మేధాకారంబును బూని, తుట్టతుదకు భయంకర మయిననరమేధాకృ తిని ధరించెను. నరమేధసమాచారము రామాయణాంతర్గత శునశ్శేఫో పాఖ్యానవిదితము.

ఆర్యులయజ్ఞక్రమ మభివృద్ధిఁ జెందినట్లే యనార్యులపూజాబలి క్రమము పెంపు నొంద సాగెను. పక్షులతోఁ గూడినబలులు పశువుల తోడను, పశువులతోఁ గూడినవి మనుజులతోడను నొప్పెను.

యజ్ఞను విత్తవ్యయప్రయాససాధ్యము. అందుచేతనే కాఁబో లు నార్యులలోని స్మృతికర్తలు పితృకార్యమునందును నతిథిసత్కార

షునందును మాంసభక్షణము కర్తవ్య మనిరి. ఆర్యులు వోలె యజ్ఞములను జేయ లేనట్టియు ననార్యులు వోలె క్షుద్రార్చనల నొనర్ప నొల్లనట్టియును దాంత్రికులు వామాచారకౌలాచారములను గల్పించి జీవహింసను వృద్ధిపఱుప జొచ్చిరి. జంతుసంతతిలో నుత్తమజీవు లగు మానవులను ఖానుట పాడిగా దని కాబోలుఁ దాంత్రికులు వారిని సైతము తమదేవులకు బలిగా నర్పించు చుండిరి.

ఇట్లీదేశమున జంతుహింసనము వృద్ధియై పాతకము పెటిగెను. అప్పుడు కృపాపారావారుం డగుజగదీశుండు బుద్ధదేవు నీదేశంబునం బుట్టించెను. కరుణాంతరంగుం డైనబుద్ధుండు జీవహింసను దొలగించుట కుఁ బ్రధానసాధనము యజ్ఞయజనములను మాన్పుటయె యని నిశ్చయించుకొని, వాని నాచరింప రా దని జనులకు బోధించెను. అమ్మహాత్ముని బోధనమువలన హింసాదేవి కొంతకాల మడఁగి యుండి మరలఁ దల యెత్తసాగెను. తరువాత జనించినయశోకవర్ధనమహారాజు "అహింసా పరమో ధర్మః" అను వాక్యమును దన నెమ్మనమున నిమ్ముగా నమ్మినవాఁ డగుటవలన ననేకోపాయంబులచేత హింసాదేవిని మట్టిపెట్టెను. ఆకాలంబుననే "శ్లో॥ అశ్వాలంభం గవాలంభం సన్యాసం పలపైతృకం! దేవరాచ్చ సుతోత్పత్తిం కలౌ పంచ వివర్జయేత్" అనుశ్లోకరాజ మాదిత్యపురాణమున నుదయించి యుండఁ బోలును!

అశోకవర్ధనమహారాజు సురరాజపురంబున కేగినపిమ్మట నిర్దేశంబు హింసాదేవికి మరల నాటపట్టయ్యెను.

పాఠకులారా! ఇట్లు జంతుహింసనదురాచారోత్పత్తిని గనుంగొంటిమి. మనము దినదినాభివృద్ధిగా జ్ఞానవంతుల మగు చున్నవారము; మఱి జ్ఞానమార్గంబున ముక్తిని సాధింపఁ బూనుకొనినవారము. జ్ఞానమార్గోపదేశకు లందఱును హింస వల దన లేదా? దాని నింక నయినను మనము మాన వలదా? కనుక బలిశబ్దముయొక్క తత్త్వార్థమునే గ్రహింతము. భూతబలి యనఁగాఁ బ్రాణులకై సమర్పింపం బడునాహార మనియె నిర్ణయింతము.

పరమసాధ్వి యయిన శ్రీవిక్టోరియాచక్రవర్తినిగారి పరిపాలన కాలమున "నరబలి" రూపు మాసినట్లె కరుణార్ద్రహృదయు లగు శ్రీజార్జిచక్రవర్తిగారి పాలనసమయమునఁ "బశుపక్షిహింసనము" నశించు ను గాక!

# కర్మము.

కర్మమును జేయ నక్కఱ లే దని కొందఱును, కర్మము ఫల రహిత మగుటవలన నెట్టిదాని నైన నాచరింప వచ్చు నని మఱి కొంద ఱును, గర్మమును విడిచినం గాని ముక్తి చేకూర దని వే ఱొక కొందఱు ను దలంచు నీకాలమున దానిస్వరూపస్వభావావశ్యకముల నిట వ్రా యుట యనుచితము గాదు గదా.

కర్మ మనఁగా కరణము, కృత్యము, కార్యము లేక పని. అది యనాది యనియును దత్ఫలభోగముకొఱకే జీవుఁ డనేకజన్మము లెత్తు చు సుఖదుఃఖముల ననుభవించు చుండు ననియును గర్మఫలము నాశ మయినం గాని మోక్షము లభింప దనియును గొందఱు మతాచార్యు లు నుడివిరి. "కర్మణా బధ్యతే జంతు ర్విద్యయా చ విముచ్యతే" "జా తస్య హి ధ్రువో మృత్యు ర్ధ్రువం జన్మ మృతస్య చ." దేని మొదలు మనకుం దెలియదో, దాని ననాది యందుము.

కర్త యగుజీవునిప్రథమోత్పత్తిసమయమున కర్మ ముండు ట యసంభవము. కనుక కర్మము జన్మపరంపరకును సుఖదుఃఖములకు ను గారణము గా దనియును జీవునకు జన్మపరంపర లే దనియును గొంద ఱు మతాచార్యుల మతము.

ఈలోకంబునఁ గొందఱు సర్వసుఖంబుల ననుభవించు చుండుట యును, గొంద ఱనేకదుఃఖములఁ గుందు చుండుటయును, గొందఱు దోషు లదండితులుగా నుండుటయును, గొందఱు నిర్దోషులు దండితు

లగు చుండుటయును మన మెఱుంగుదుము. ఇందులకుఁ గారణము సర్వేశ్వరునియుద్దేశ మని కాని, జీవునిస్వప్రయోజకత్వ మని కాని, హఠాత్సంభవ మని కాని చెప్పుట సమంజసము గాదు. సర్వేశ్వరు నుద్దేశమే యనినచో, నిష్పక్షపాతియును సర్వసముఁడు నగునాతఁ డొకజీవునకు సుఖములను మఱొక జీవునకు దుఃఖములను గలిగించునా? జీవునిస్వప్రయోజకత్వమే యనినచో, జీవుఁడు దుఃఖమునే యెఱుంగ కుండ నుండ వలయును. హఠాత్సంభవమే యనినచో, నది యట్లేల కావలెను? మఱొక విధముగా నేల కాఁ రాదు? కాఁబట్టి యిట్టివానిని గారణము లనరాదు.

ప్రత్యేకజీవుఁ డీలోకంబునఁ గాయక్లేశ మొందు చుండుటయే సర్వేశ్వరోద్దేశ మయినట్లును, భాగ్యవంతులు సైతము దేహారోగ్యము కొఱకు వ్యాయామము సలుప వలసి యుండుట యందులకుఁ దార్కాణ మయినట్లును నొకానొకరు వ్రాసిరి. స్వీయకాయారోగ్యముకొఱకుఁ బ్రాతఃకాలముననో సాయంసమయముననో భాగ్యవంతులు స్వేచ్ఛగాఁ జేయువ్యాయామమును "నిన్న నొకమెతు కయినను గంటఁ బడ లేదు గదా! నేఁ డయినం బడునో? పడదో?" అనుబెంగతో సూర్యోదయప్రభృతి సూర్యాస్తమయపర్యంతమును గూలికై కష్టపడువారి పరిశ్రమముతోడఁ బోల్చి, సర్వసౌఖ్యసంధాతయు మంగళవిధాతయు నగుసర్వేశ్వరునియుద్దేశము జీవులు కష్టము లనుభవించుటయే యని సిద్ధాంతీకరింపఁ బూను కొనుట యతిసాహసము గాదా?

జీవుఁడు కర్మకర్తృత్వాధికారమును గలిగి, తత్ఫలము నవశ్యం బనుభవించును. శ్రీకృష్ణభగవానుఁడు పార్థునకు గీతాశాస్త్ర మంతయు నుపదేశించి "దీనిని లెస్సగా నాలోచించుకొని, నీయిచ్ఛకు వచ్చునట్లు చేయుము." [ "విమృశ్యైత దశేషేణ య థేచ్ఛసి తథా కురు."] అని పలుకుటవలన జీవునకుఁ గర్మకర్తృత్వాధికార ముండుట నిశ్చయము. కర్మఫలదాతృత్వాధికారము మాత్రము సర్వేశ్వరునిది. ప్రతికర్మమునకును ఫల ముండుట స్వభావసిద్ధము.

జీవులు ప్రప్రథమమున నిష్కర్ములుగానే కలిగి, స్వేచ్ఛానుసారముగా బుణ్యపాపకర్మముల నాచరించుచు సంసారపంకిలాఖాతంబునం జిక్కుకొనిరి. పరోపకారకార్యము పుణ్యకర్మ మనుటయును బరాపకారకార్యము పాపకర్మ మనుటయును సమస్తాస్తికమతసమ్మతము. [“పరోపకారః పుణ్యాయ పాపాయ పరపీడనం.”] అట్లయినను, వేదోక్తము లగుసత్యసంభాషణ సంధ్యావందనాదులు పుణ్యకర్మము లనియును మఱి యాచరణీయము లనియును [“సత్యం వద,” “అహ రహ స్సంధ్యా ముపాసీత.”] వేదనిందితము లగునన్రృతభాషణ మద్యపానాదులు పాపకర్మము లనియును మఱి త్యాజ్యము లనియును [“నానృతం వదేత్, న సురాం పిబేత్.”] ఏతద్దేశీయాస్తిక మతాచార్యు లందఱు నైకకంఠ్యముగా వక్కాణించి యున్నారు.

విధికృత్యము లొకప్పుడు దారుణము లయినను, అవి పాపకృత్యములు గానేరవు. శూరుఁడు ధర్మయుద్ధమున వైరిని జంపుట, కడుపునుండి స్వాభావికముగా వెలుపలకు వచ్చుటకు వలను పడనంత స్థూలముగాఁ బెరిఁగినశిశువును వైద్యుఁడు శస్త్రముచేతఁ జంపి వెలికిఁ దీయుట, నరహంతకునకు మరణదండనమును విధించుట మొదలగునవి దారుణకృత్యములే యయినను, విధికృత్యము లగుటంజేసి పాపకృత్యములు గా వని తెలియం దగును.

నరుం డెట్టిపని నొనర్పక సోమరి యై కాలక్షేపము సేయుచుండునట్లు లార్షమతము బోధించుచున్న దని యన్యమతావలంబులలోఁ గొందఱజ్ఞు లందురు. అట్లనుట సరి కాదు. పనులను దప్పకొనర్చుచు నీలోకంబున నూఱేండ్లు మన వలె ననియును, తనపనులయందు నపేక్షగలవాఁడు సంసిద్ధి నొందు ననియు నార్షమతము సుస్పష్టముగా బోధించుచున్నది. [శ్రుతిః. “కుర్వ న్నే వేహ కర్మాణి జిజీవిషే చ్ఛతం సమాః.” శ్లో॥ “స్వే స్వే కర్మ ణ్యభిరత స్సంసిద్ధిం లభ తే నరః.”] కనుకఁ దెలివిమాలినవారిపలుకుల నటుండ నిత్తము.

పుణ్యాకర్మములు వర్ణములకును నాశ్రమములకును దగునట్లు ని త్యములుగాను నైమిత్తికములుగాను విభజింపఁ బడి యున్నవి. నిత్యక ర్మము లనఁగా ననుదినమును జేయఁ దగినవి. నైమిత్తికకర్మము లనఁగా నిమిత్తము గలుగునపుడే యాచరింపఁ దగినవి. విహితకర్మముల నాచ రించుటయును నిందితకర్మముల నాచరింప కుండుటయును విధి. కావున విహితము లయనకర్మముల నాచరింప కున్నను, నిందితము లయినవాని నొనర్చినను జీవున కధోగతి గలుగును. [ అకుర్వ న్విహితం కర్మనింది తం చ సమాచరన్। ప్రసజ్జం శ్చేంద్రియార్థేషు నరః పతనమృచ్ఛతి.”] ఇట్టి పుణ్యాపాపకర్మముల ఫలము ప్రారబ్ధముగాను, సంచితముగాను, ఆ గామిగాను నేర్పడును. ప్రారబ్ధ మనఁగా గతజన్మములయందు నాచరిం పంబడి యనుభవింపం బడు చున్నకర్మములఫలము. సంచిత మనఁగా నీజన్మమున నిప్పటి కార్జింపంబడి యనుభవింపం బడక యున్నకర్మము లఫలము. ఆగామి యనఁగా నీజన్మముునను భావిజన్మములయందును నా ర్జింపఁ బోవుడికర్మములఫలము. పుణ్యాకర్మములఫలము స్వర్గాదిలోకం బులం బొందించి, త దంతంబునందు మరల నీలోకంబున నుత్కృష్టజన్మం బును సుఖంబులను గలిగించును. [“క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి.”] పాపకర్మములఫలము రౌరవాదినరకంబులం బొందించి, తదంతంబునం దు మరల నీలోకంబున నికృష్టజన్మంబును దుఃఖంబులను గలిగించును. అట్లే పుణ్యాపాపమిశ్రకర్మముల ఫలము సామాన్యజన్మంబును సుఖదుః ఖమిశ్రణంబును గలిగించును. ఇట్లు కర్మఫలము జన్మపరంపరనే కలి గించు చుండుటవలన జీవులకు జన్మరాహిత్యమును నిత్యసుఖమును దొ రకుట దుర్లభంబు. మఱి కర్మఫలబంధమోక్ష మెట్లు కలుగును? పా దంబున గ్రుచ్చుకొన్నకంటకంబును వే ఱొక కంటకంబుచేతనే తీయు నట్లు చిరకాలంబునుండి యవిచ్ఛిన్నముగా నున్నకర్మఫలబంధమును గర్మాచరణముచేతనే యూడఁ దీయ వలె నని మనపుస్తకము లుద్ఘో షించు చున్నవి. అయినను, గర్మాచరణమువలనఁ గర్మఫలాభివృద్ధి యగుచునే యుండుటంబట్టి యకర్మముచేత ననఁగా గర్మత్యాగముచే తఁ గర్మఫలము గలుగ కుండు నని కొందఱ అనుచున్నారు. కాని- అది సాధ్యమా? ఎన్నఁటికిని గాదు. మనము మనమనస్సుచేతనో వాక్కు_

చేతనో యింద్రియములచేతనో ప్రతిక్షణమును నేదయిన నొకపనిని దప్పక చేయుచుండుటయును, పనులను జేయకుందుమేని మనకు శరీరయాత్ర సైతము సిద్ధింపకుండుటయును, జగమంతయుఁ బనులతోడనే ప్రవర్తిల్లుచుండుటయును మనకుఁ బాగుగాఁ దెలియును. ["న హి కశ్చిత్ క్షణమపి జాతు తిష్ఠత్యకర్మకృత్." "నియతం కురు కర్మ త్వం కర్మజ్యాయో హ్యకర్మణః, శరీరయాత్రాఽపి చ తే న ప్రసిద్ధ్యేదకర్మణః." "ప్రవృత్తిలక్షణం కర్మ."] కాఁబట్టి బంధమోక్షములకు ఫలమును మాత్ర మపేక్షింపక కర్మములను సలుపుచునే యుండవలెను. అట్లు చేయుచున్నచోఁ గర్మబంధవిముక్తి యెట్లగు ననిన, అందులకుఁ బ్రత్యుత్తర ముదాహరణపూర్వకముగాఁ నిట వ్రాయఁబడును:—ఒకనికిఁ బైతృకసంపత్తి వేయిరూపాయలు గలవు. అతఁడింత దనుక నార్జించి నిలువగా నుంచుకొన్నవి మఱొక వేయిరూపాయలు. మఱియు నాతనికి సాంవత్సరికాయ మొక వేయిరూపాయలు. ఇట్లుండ, నతండు తనకు ధనము లేకుండఁ జేసికొనవలె నన్నచోఁ, నేమిచేయవలెను? తనరాఁబడిని వదులుకొని, యింతదనుకఁ దనయొద్ద నిలువగా నున్నవిత్తమును వెచ్చింప వలసి యుండును గదా. పాఠకులారా! పైతృకంబును బ్రారబ్ధముతోడను, ఇందాఁక నిలువగా నున్నధనమును సంచితముతోడను, రాబడి నాగామితోడను బోల్పం దగును. పుణ్యాపాపఫలరహితకర్మములనే చేయుచుండుటవలన నాగామికర్మములు గలుగవు. అనుభవించుచుండుటవలనఁ బ్రారబ్ధసంచితకర్మములు దఱుఁగును. ["నాభుక్తం క్షీయతే కర్మ."] ఇట్లు కొంతకాలమునకుఁ గర్మశూన్యమయి, బంధవిముక్తి సంభవించును. కోరికలతోడనే పనులను జేయఁ బూనినచోఁ గోరికలకును గామ్యకర్మాచరణమునకును మితి యుండదు. అందువలన బంధవిముక్తి గాదు. కావునఁ గామ్యకర్మాచరణ మనుచితము. ["అయుక్తః కామకారేణ ఫలే సక్తో నిబధ్యతే."] ఫలము నపేక్షింపక మన మాచరించు పుణ్యకర్మములఫలములు మనకుఁ జెందవు. మన మనస్సున కట్టిస్వాతంత్ర్యము గలదు. ["మన ఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః." అట్లనుటవలనఁ బాపకర్మ

ములఫలములు సైతము మనకుఁ జెంద వని తలంప రాదు. పుణ్యకర్మ ఫలము లాభము వంటిది. పాపకర్మఫలము నష్టి వంటిది. లాభమును మానుకొనఁ గలము; కాని- నష్టిని మానుకొన లేము గదా. ఫలము నపేక్షింప కుండు మేని, పాపకర్మాచరణ మే కలుగదు. లెస్సగా నాలోచింపఁగా, అకర్మ మనునపుడు కర్మత్యాగ మనుటకంటెఁ ద్యక్తఫలకర్మ మనుటయే యుక్తియుక్తము.

ఏదేని యొకపనియందు మనస్సును లగ్నము సేయ కుండు మేని, అది సాధారణముగా దుష్కార్యాచరణమునందే ప్రవర్తించు చుండును. కనుక బుద్ధిమంతులు సర్వదా పుణ్యకర్మసాధనచింతనమునే చేయుచుఁ దత్ఫలమును మాత్రము కోర కుందురు. ["యుక్తః కర్మఫలం త్యక్త్వా శాంతి మాప్నోతి నైష్ఠికీం." "అనాశ్రితః కర్మఫలం కార్యం కర్మ కరోతి యః। ససన్న్యాసీ చ యోగీ చ న నిరగ్ని ర్న చాఽక్రియః."]

ప్రకృతివలన సత్త్వరజస్తమోగుణములు గలిగెను. ["సత్త్వం రజ స్తమ ఇతి గుణాః ప్రకృతిసంభవాః."] అందు జ్ఞానకారణం బయిన సత్త్వగుణమాహాత్మ్యంబుచేత నిష్కామకర్మములను, లోభకారణం బయినరజోగుణమహిమంబుచేతఁ గామ్యకర్మములను, ప్రమాదమోహాదికారణం బయినతమోగుణప్రభావంబుచేత దుష్కర్మములను నరుండు సేయు చుండును. ["సత్త్వా త్సంజాయతే జ్ఞానం రజసో లోభ ఏవచ। ప్రమాదమోహౌ తమసో భవతో ఽజ్ఞాన మేవచ."] కాఁబట్టి ప్రప్రథమమునందు సత్త్వగుణము నలవరించుకొన సర్వథా ప్రయత్నించుట యావశ్యకము.

నిష్కామకర్మాచరణముచేతఁ జిత్తశుద్ధి గలుగు ననియును ["కర్మణా చిత్తశుద్ధిః."], చిత్తశుద్ధి గలుగుటవలన జ్ఞానము లభించు ననియును, జ్ఞానముంబట్టి మోక్ష మనియును ధీమంతు లందురు. ["శ్రద్ధావాన్ లభతే జ్ఞానం తత్పర స్సంయతేంద్రియః। జ్ఞానం లబ్ధ్వా పరాం శాంతి మచిరే ణాఽధి గచ్ఛతి."] ఇందు జడరూపకకర్మమును

సలుపు చుండు టవలనఁ జిదూ ప్రకజ్ఞాన మెట్లు సిద్ధించు నను సందేహము గొందఱకుఁ దోఁప వచ్చును. విజ్ఞులారా! ప్రారబ్ధసంచితకర్మదోషము వలనఁ గలిగినయజ్ఞానము జ్ఞానము నావరించి యుండును. ["అజ్ఞానే నావృతం జ్ఞానం తేన ముహ్యంతి జంతవః." ] అనుభవమ్ముచేతఁ దద్దోషము క్షయించుటవలనను నిష్కామకర్మాచరణముచేత నిఁక నట్టిదోషము జనింపఁ కుండుటవలన నజ్ఞానావరణము వోవఁ గ్రమక్రమముగా జ్ఞాన మభివృద్ధిం జెందు నని తెలియ వలెను.

"అవశ్య మనుభోక్తవ్యం కృతం కర్మ శుభాఽశుభం." అనఁగా నొనర్పంబడిన సుకర్మదుష్కర్ములఫలము ననుభవించియే తీర వలెను. "జ్ఞానాగ్ని స్సర్వకర్మాణి భస్మసా త్కురుతే తథా." అనఁగా జ్ఞానాగ్ని యన్నికర్మములను నశింపం జేయును. ఉపరికథితవాక్యద్వయమునకు వైరభావ మున్నట్లు తోఁచు చున్నను, నిజముగా నట్టిది లేదు. ఏల యనఁగా, అనుభవమువలనఁ బ్రారబ్ధసంచితకర్మఫలము క్షీణించుచు నాగామికర్మఫలోత్పత్తి గా కుండునపుడే జ్ఞానోదయ మగును. జ్ఞానాగ్ని యనుటవలన నభివృద్ధి నొందినజ్ఞాన మనుట స్పష్టము. కనుక సంపూర్ణజ్ఞానము గలవానికిఁ గర్మబంధ ముండ దనినచో, నెట్టివిప్రతిపత్తియు నుండదు.

అయ్యలారా! పైని వ్రాయఁ బడినవ్యాసమువలన మనము ఫలాపేక్షను విడిచి సంతతమును సత్కర్మములనే చేయు చుండ వలె నని యేర్పడెను గదా. మనక్షేమముకొఱకును దేశక్షేమముకొఱకును మన మటువంటికర్మములనే నిరంతరము నాచరించు చుండుటకు మనకు మన స్థైర్యమును దేహదార్ఢ్యమును భగవంతుఁడు ప్రసాదించును గాక!

---

# నేఁటి తెలుఁగు.

సజీవనిర్జీవయుక్తం బగుజగంబు నియమయంతం బయి విలసిల్లు చుండుటవలన నీమయ మత్యావశ్యక మనుట యతిశయోక్తి గాదు. అ ్గుటవలన విజ్ఞులు నియమమును విడనాడుట యసమంజసము. పవిత్ర ్తననియమమును స్మృతి విధించునట్లు భాషానియమమును వ్యాకరణ ము శాసించెడిని. కనుక వ్యాకరణవిరుద్ధపదములతోడ వెలయు కైత త్రిత మగును. నానావిధము లగుబాసలందు మిన్న యని యెన్నంబడ తెలుఁగుబాసకు సమగ్ర మగువ్యాకరణము నేఁటికిని లేకుండుట కిలి శోచనీయము. వ్యాకరణ మసమగ్ర మనునెపముచేత నున్నని యమములను మీఱుట యుక్తము గాదు. తగుకొంప లేనివాఁడు దాని బాగు సేయ యత్నించును. అట్లొనర్చుటకు వలను పడ దేని యె ట్లో యందె వసించును. అంతేకాని, యున్నదానిని గాల్చి సన్యసిం వెళ్లఁడు గదా. ఇప్పటికవులలోఁ గొందఱు పట్టుపట్టి యున్ననియ ములు నతిక్రమించి భాషను బాడు సేయుచున్నవారు. మఱి కొంద ఱు మాట లాడునట్లు వ్రాయుదు మందురు. కాని- యట్లు వ్రాయ లేరు. 'తాటాకు' మొదలగు మాటలను బరికింపుఁడు. ఇంకఁ గొందఱు వాడుకమాటలు గ్రాహ్యము లనుచున్నవారు. అవి యొకతీరుగా నుం డవు. "చేశాడవ" "చేసేడట" "చేయటం" "చేయడం" "చేస్తు న్న" "చేస్తూన్న" "చేస్తోన్న" "చెయ్యాలే" "చెయ్యాల" "చేస్తాడు" "చేస్తుడు" మొదలగు మాటలను గమనింపుఁడు. శత్రర్థకమునకు "ఉన్న" ప్రత్యయము సేర్పం బడుట వర్తమానార్థకనియమ మగుట వలన "చేయుచున్న" పదమును "చేస్తున్న" యనియు నిడివిగాఁ బ లుకునపుడు "చేస్తూన్న" యనియు సాధారణజను లనుటకుఁ గారణము స్పష్ట మగును; కాని— "చేస్తోన్న" యనుటకుఁ గారణము గాన రాదు. మఱియు నిప్పటివ్రాఁతలందు "ప్రతివాడు" "దృఢనమ్మకము" "ని జానిజములు" మొదలగు ననేకదుష్టసమాసములును, 'వివరణము' నకు మాఱుగా "వివరము" 'బాగుగా' లేక 'లెస్సగా' కు బదులుగా

"జయప్రదముగా" మొదలగు విరుద్ధార్థబోధకశబ్దములును గనం బడు
చున్నవి. కొందఱు వ్యావహారికభాషనే మేము వాడువార మనుచు
"వాడుఉన్నాడు" "వాడువున్నాడు" అని వ్రాయుదురు. కాని- వారు
వ్రాయునట్లు వ్యవహరించువా రెవరును లేరు. స్థాలీపులాకన్యాయము
గాఁ గొన్నింటిని మాత్ర ముదహరించితిని. ఇట్టి వెన్నియో యిప్పటి
వారు వాడుచున్నారు. అవి గ్రాంథికములుగావు. మఱి వ్యావహారిక
ములుగావు. అవి వికారరూపములె యగును.

అశ్లీలములు దూష్యము లనువారి వ్రాఁతలందును, నాట్యస్థాన
ములందును "సినీమా" లందు నాలింగనచుంబనాదులు గన నయ్యెడిని.
అట్టిప్రదర్శనము నింద్య మగును గదా.

"వాఁడు" యొక్కయు "అవి" యొక్కయు ద్వితీయావిభక్తి
రూపము "వానిని". కనుక విభేదముకొఱకు "అవి" యొక్క ద్వితీయా
విభక్తిని "వాటిని" అని వ్యవహరించుట యుక్తము "అయితే" "కూఁ
తురును" మొదలగు కొన్నిరూపములు గ్రాహ్యము లని నాయాశయ
ము. భాషాభిమానము గలపండితు లొకచోటఁ గూడి గ్రహింపఁ దగి
నరూపములను నిర్ణయింప వలెను. మఱి యవియె వాడఁ బడవలెను.
అట్లు కానిచోఁ దెలుఁగుబాస కోదుబాసకంటె నీచతరమగును.

తెలుఁగుబాసయందుఁ బెచ్చుగా బొత్తములును బత్రికలును
బెరుఁగు చుండుటవలనఁ దెలుఁగుపలుకుఁ జెలియొడలు బలియు చున్న
దనక తప్పదు. కాని- యీబలుపునకుఁ గారణ మారోగ్యము గాక,
శోఫరోగ మగుట గడు శోచనీయము. పూర్వకవులపుస్తకములందుఁ
గొన్ని స్ఖాలిత్యము లక్కడక్కడఁ జూపట్టును. అట్టివానిని సంస్కృత
భాషలో మహాకవిప్రయోగము లందురు. అవి మనకుఁ బ్రయోగా
నర్హములు.

---

# వైద్యము.



కృపాపారావారుండగు నీశ్వరుండు మానవాదులను సృజించి, వారు నిరంతరసుఖ మొందున ట్లనుగ్రహించి యున్నాఁడు. అయినను మనము యుక్తపరివర్తనమును మానుటంజేసి రోగగ్రస్తుల మయి సుఖమును గోలుపోయి దుఃఖభాజనుల మగుచున్నవారము.

రోగము ద్వివిధము. మానసికము- శారీరకము- అని. అందుఁ జింతాదులు మానసికరోగములు; వైరాగ్యాదులు తన్నివారణములు. మఱి శారీరకరోగములు కర్మజము లనియును, కాలజము లనియును, బదార్థజము లనియును జెప్పంబడును. ప్రారబ్ధాదికర్మములవలనఁ గలుగురోగములు కర్మజములు. అవి యనుభవింపఁబడినం గాని పోవు. శీతోష్ణాదికాలపరివర్తనములవలనఁ బుట్టురోగములు కాలజములు. అవి కాలపరివర్తనముచేత నయినను సామాన్యచికిత్సచేత నయినను నివర్తించును. అనిష్టకరము లగునాహారవిహారాదులవలన జనించురోగములు పదార్థజములు. అవి తగుచికిత్సచేతనే నివారింపంబడును. పైని జెప్పంబడిన కారణత్రయములో దేనిచేత నేరోగముసంభవించునో తెలిసికొనుటసాధారణముగా దుర్ఘట మగుటంజేసి, సకలరోగములకు నుపయుక్తచికిత్స చేయ వలయు నని పెద్దలు శాసించి యున్నవారు.

దీపము చమురును వత్తిని గలిగి యుండియు గాలి వీచినతోడనే సంచలించును. వాయు వధిక మగు నేని దీప మాఱును. మన మావచ్చువాయువున కడ్డముగా దేని నయిన నుంతు మేని దీపము సంచలింపదు; మఱి యాఱదు. ఇందు దీపమును మనప్రాణముతోడను, చమురును వత్తిని మనపరిమాణకాలముతోడను, గాలిని రోగముతోడను, అడ్డముగా నుంచుదానిని జికిత్సతోడను బోల్పఁ వచ్చును.

రోగము గలుగునప్పుడు చికిత్స చేయ కుండు మేని బాధ నొం

పొదుము. ఆరోగము ప్రబల మయినది యగు నేని మరణింతుము. క నుక రోగము పొడమునపుడు తగుచికిత్స యత్యంతావశ్యకము.

ఏరోగమున కెట్టిచికిత్స యావశ్యకమో యవ్విషయంబును దమ యనుభవజ్ఞానమువలననే పెద్దలు కనుఁగొని నిరూపించి యున్నవారు. చికిత్సాపద్ధతులు పలువిధములుగా నున్నవి. అందీదేశమున వాడుక లో నున్న ముఖ్యము లగుపద్ధతులలోఁ గొన్నింటి నిట వివరింతము.

౧. జలచికిత్సాపద్ధతి. నియమానుసారముగా జలము నుపయోగించుటవలన సమస్తవ్యాధులు నశించు నని యిందుఁ జెప్పంబడును.

౨. వర్ణచికిత్సాపద్ధతి. సూర్యకిరణములందుఁ బోలె జంతువులశరీరములందు సప్తవర్ణములు గల వనియును, ఆవర్ణములన్యూనాధిక్యముల వలననే రోగము లుద్భవించు చుండున నియును, సూర్యరశ్మిసాహాయ్యముచేతఁ దన్న్యూనాధిక్యములను సరి చేసినచో రోగము లుపశమించు ననియు నిందుఁ జెప్పంబడును.

౩. విద్యుచ్చికిత్సాపద్ధతి. యంత్రసాహాయ్యముచేత విద్యుచ్ఛక్తిని మేనం జొనిపినచో వ్యాధులు నివారింపఁ బడు నని యిందుఁ జెప్పంబడును.

౪. హితపదార్థచికిత్సాపద్ధతి. ఏపదార్థము నుపయోగించుటవలన నేరోగము సంభవించునో యాపదార్థమునే కొంచెముగా నుపయోగించుటవలన నారోగము మాయు నని యిందుఁ జెప్పంబడును.

౫. అహితపదార్థచికిత్సాపద్ధతి. ఏపదార్థ మేరోగమునకు నహితకరమో యాపదార్థమునే యారోగమునందు నుపయోగించినచో, ఆ రోగ్యము చేకూడు నని యిందుఁ జెప్పంబడును. ఈకడపటిపద్ధతియే యీదేశమునందు నధికప్రచారము గలది. ఇది యాయుర్వేదపద్ధతి, యూనానీపద్ధతి పాశ్చాత్యపద్ధతియను మూడువిధములు గలది. భారతీయులచికిత్స యాయుర్వేదపద్ధతి యనియును, తురష్కులచికిత్స యూ

నాటీపద్ధతి యనియును, ఆంగ్లేయులచికిత్స పాశ్చాత్యపద్ధతి యనియు నెఱుంగ నగును.

రోగనిదానమునందు నాయుర్వేదపద్ధతితో యూనానీపద్ధతి యించుక సరిపోవు నట్లుండును. కాని, పాశ్చాత్యపద్ధతిమాత్రము సరి పోవనివిధమునఁ గనుపించును. జంతువులయారోగ్యము పిత్తవాతకఫధాతువులంబట్టి యుండు ననియును, పిత్తవాతకఫములలో నేది యధికమ యినను రోగములు జనించు ననియును, మఱి వానిలో నేది యుద్రేకించినను గడమరెండు నుద్రేకించి మరణమును గలిగించు ననియును భారతీయుల సిద్ధాంతము. జంతువులయారోగ్యమునకు మస్తిష్కహృదయశ్వాసకోశములు ముఖ్యము లనియును, వానిలో నేది యించుక చెడినను రోగములు జనించు ననియును, మఱి వానిలో నేది యత్యంతముగాఁ జెడినను గడమరెండును జెడి మరణమును గలిగించు ననియును పాశ్చాత్యులసిద్ధాంతము. ఆరెండుసిద్ధాంతముల నిట్లు సరిపెట్ట వచ్చును. భారతీయులు చెప్పుపిత్తోద్రేకమే పాశ్చాత్యులు చెప్పెడిమస్తిష్కవిషమత్వము. భారతీయులు చెప్పువాతోద్రేకమే పాశ్చాత్యులు చెప్పెడి హృదయవిషమత్వము. భారతీయులు చెప్పుకఫోద్రేకమే పాశ్చాత్యులు చెప్పెడిశ్వాసకోశవిషమత్వము. త్రిదోషోద్రేకమువలనఁ గలుగు సన్నిపాతము లేక జన్నియే మస్తిష్కహృదయశ్వాసకోశములు చెడిన యవస్థ. ఇంక మలమూత్రకోశాదులందుఁ గొన్నిరోగము లుప్పతిల్లును. ఆరోగము లతిప్రబలము లగునేని మస్తిష్కహృదయశ్వాసకోశములలో మొదట నొకటియుఁ బిమ్మటఁ గడమరెండును జెడి మృతి గలుగును. మస్తిష్కాదులలో మొదట నెద్ది చెడునో దానింబట్టియే యుల్లిఖితరోగములు పిత్తాదులవలన నుద్భవించు నని యాయుర్వేదమతము. భారతీయులు చెప్పెడిరోగకారణములను జాలవఱకు నిట్లు సరిపెట్ట వచ్చును. గ్రంథవిస్తరభీతిచేత రోగంబులును దత్కారణంబులును విపులంబుగా నిట నుదాహరింపం బడలేదు. బుద్ధిమంతులు వానిని నూహించుకొందురు గాక!

పైని జెప్పఁబడిన పద్ధతులలో దేని నయినను లెస్సగా నె
ఱింగినవైద్యుఁడు చికిత్సచేసినచో, రోగములు దొలఁగి పోవును. అట్లు
కాక, కుక్షింభరులగు వైద్యవేషధారులు చికిత్సచేసినచో, ఉన్నవ్యా
ధులు పోకుండుటయే కాక, క్రొత్తగ మఱికొన్ని వ్యాధు లొదవును.
కనుక సద్వైద్యులచేతనే చికిత్స చేయించుకొనుట సమంజసము.

"చంపుటకంటెఁ బుట్టకుండ నలుపుట మేలు." కావున రోగ
ము లుద్భవించినపిదప సద్వైద్యుల నాశ్రయించి వారిచికిత్సలచేత రో
గములను బాపికొనుటకంటె రోగములు సంభవింప కుండునట్లు చేసికొ
నుటయే శ్రేయస్కరము. అట్లు చేసికొనుట యుక్తాహారవిహారాదుల
వలననే సిద్ధించును.

జను లుపయుక్తాహారవిహారాదులయందు ననురక్తు లయి, స్వా
స్థ్యమును గాపాడుకొనుచు నీశ్వరప్రసాదం బగునిరంతరసుఖమును గాం
తురు గాక!

---

# శవసత్కారము.

ఈదేశవాసులశవసత్కారము మూఁడువిధములు. అందు మొద
టిది బైట నుంచుట; రెండవది నేలఁ బాఁతుట; మూఁడవది కాలుచు
ట. మొదటిది ప్రాచీనతరాచారము. శవము వ్యర్థముగా నశించుట
యుక్తము గా దనియు నది దోడిజంతువులకు నాహార మగుటయే యు
క్త మనియు భావించి ప్రాచీనులు శవములను బైటనె యుంచు చుండి
రి. ఆయాచారము నిప్పటికిని పారసీకు లవలంబించువారు. శవములను
బైట నుంచినచోఁ దత్సమీపస్థితజనులదృష్టికి సేవము నారోగ్యమునకు
లోపమును సంభవించు నని తలంచినవారు పాఁతుటను గాలుచుట నవ
లంబించిరి. పునర్జన్మము లే దని నమ్మువారు శవమును బాఁతుదురు.
క్రైస్తవులును మహమ్మదీయులును బునర్జన్మము లే దని నమ్మెడువా
రు. శైవుఁడు దాను శివసాయుజ్యము నొందుదు నని నమ్మును. సన్న్యా
సి దాను బ్రహ్మభూతుఁడ నగుదు నని నమ్మును. కనుక వారిశవము
లు పాఁతఁబడును. పెఱవారిలోఁ గొందఱు పునర్జన్మము గల దని నమ్ము

జూరు; మఱి కొందఱు దానింగూర్చి సంశయింతురు. అట్టివారిశవము లు గాల్పఁబడును.

# స్త్రీవిద్యావిధానము.

విద్=జ్ఞానే యనుధాతువువలన నుత్పన్న మగుటవలన "విద్య" యనుశబ్దము జ్ఞానాభివృద్ధిహేతుకార్థమునందు వ్యవహరింపం బడు చున్నది. విద్య యనఁగాఁ జదువు. జ్ఞానము విజ్ఞానము నని జ్ఞానము ద్వివిధము. పరవస్తుబోధము జ్ఞానము; ఇహవస్తుజాలబోధము విజ్ఞానము. కనుక విద్యావంతు లనఁగ జ్ఞానులనియో లేక విజ్ఞానులనియో యెఱుంగనగును. లేనిజ్ఞానమును గాని విజ్ఞానమును గాని విద్య గలిగింపఁ జాలదు. అది బుద్ధిని సంస్కరించి మూసికొని యున్నకన్నులను దెఱచునట్లు మాద్యము నొంది యున్న తెలివిని వెలిఁగించును. కనుకనే విద్య నేర్చినవారి తెలివి చికిలిచేసినకత్తి వోలె మెఱయు చుండును. విద్య నేర్వనివారి బోధము జడత్వము నొంది యుండుటవలననే యట్టివారు పశుసమానులని నిశ్చయించి "విద్యావిహీనఃపశుః" అని కవి నుడివెను. కావున స్త్రీ పురుషు లందఱును విధిగా విద్య నభ్యసింప వలెను. పడఁతి విద్యావతి యగు నేని చెడు ననునది యోగ్యోక్తి గాదు. తనయర్ధాంగి యగుభార్య విద్యాహీన యగు నేని విద్యావంతుఁ డగువానిజీవితము పక్షఘాతరోగాక్రాంతశరీరమును బోలి యుండును గదా! కాన స్త్రీసైతము విద్యావతియై యుండ వలె ననుట సుస్పష్టము. అట్లయ్యు స్త్రీలకును బురుషులకును వలయువిద్య యేకవిధముగా నుండవలెనా? లేక తారతమ్యము గలదిగా నుండవలెనా? అనునది విచార్యవిషయము. స్త్రీలకును బురుషులకును జ్ఞానాభివృద్ధికర మగుచదువునందుఁ దారతమ్య మక్కఱ లేకున్నను, విజ్ఞానాభివృద్ధికర మగుచదువునందు నది యుండవలెను. తనపోషణమునకును దనకుటుంబపోషమునకును వలయు ధనాదుల నార్జించుట కుపయోగించుచదువు పురుషునకును, తానును దనకుటుంబము

ను సుఖముగా జీవించుట కుపయోగించుచదువు స్త్రీకి నుండ వలెను. స్త్రీ తనగృహమున నివసించి యింటిపనులను నెఱవేర్చుచు ధనార్జనసాధనముల నవలంబింప వచ్చును. స్త్రీపురుషులకు రక్తమాంసాదులయందును బుద్ధియందును భేదము లేకుండఁగాఁ జదువునందును బనులయందును భేద మేలయుండవలెను? అని కొందఱతలంపు. పశుపక్ష్యాదులలో స్త్రీపురుషభేదము లేక యవన్నియు నాహారములను సంపాదించుకొనుచు స్వేచ్ఛగాఁ జరియించు చుండ, మనుజులు మాత్ర మేల యట్లాచరింపరాదు? అని స్థూలబుద్ధులకు స్ఫురింప వచ్చును. బాగుగా నాలోచించినచో, నజ్ఞాను లయి వివాహమును మానినవా రుపరికథితపశుపక్ష్యాదిపద్ధతి నవలంబింప వచ్చును. కాని వివాహ మయి కుటుంబాభివృద్ధిని గోరువా రట్టు లవలంబింప రాదు. కుటుంబాభివృద్ధిని గోరువారు ముందుగా నివాసము నేర్పఱచుకొన వలెను. పురుషులు వెలుపలితావులకు వెళ్లుచు ధనాదులనార్జించి తెచ్చి నిజమందిరమునఁ జేర్చు చుండ వలెను. అట్లు తెచ్చినపదార్థములరక్షణాపేక్షణములను స్త్రీ లొనర్చుచు వానిని దమవారియొక్కయు దమయొక్కయు సౌఖ్యముకొఱకు యుక్తముగా నుపయోగించు చుండ వలెను. అట్లు చేయఁబడుచున్న కుటుంబమె సుఖించును. స్త్రీపురుషు లింటఁ గూర్చుండి కుడుచుచు ధనాదుల నార్జింపనిచోఁ దమజీవయాత్ర సాగదు. స్త్రీపురుషు లుభయులు నన్యస్థలముల కేగి ధనాదుల నార్జింపఁ గడంగుదురేని, అవి వృద్ధి నొందినను, వారికి దాంపత్యసుఖము క్షీణించును, మఱి కుటుంబార్జనమువలన నొంద నాసించుసుఖము సన్నగిల్లును.

ఇఁక నేతద్దేశముయొక్క వర్తమానవిద్యావిధానమునుగూర్చి యించుక చర్చింతము. మనపాఠశాలలందు నేర్పఁబడుచున్నవిద్య గొంతవఱకు భాషాభివృద్ధిని జేయు చున్నను, దానివలన జ్ఞానము గాని విజ్ఞానము గాని పెంపొందక యాముష్మికలాభము గాని యైహిక లాభము గాని లభింపదు. ఇప్పటివిద్యావిధానము కేవలము సేవకవృత్తి కే యుపకరించును. సేవకవృత్తియే గౌరవావహ మనియు లాభకర మనియు నెంచుమానవుల మానసములకుఁ దద్విధానము రుచించినను, వి

ద్యోపంతులు స్వచ్ఛందజీవనము సేయుచుండవలెనని తలంచువారి మనస్సుల కది రుచింపదు. ఇప్పటిచదువులలో వైద్యవిద్యమాత్రమే స్వచ్ఛందజీవనము సేయుటకుఁ గొందఱకు వలను పడు ననియుఁ బెఱచదువులు సేవకవృత్తికే యుపయోగించు ననియు నుడివెడినుడి యతిశయోక్తిగాఁ జాలదు. కనుక మనపాఠశాలలందు నేర్పఁబడుచున్నచదువు పురుషులకే నిరుపయోగ మగుచుండ నది స్త్రీల కుపయోగించునా? బొత్తిగ నుపయోగింపదు. తమదేశమందుఁ గలపాఠశాలలు సర్వాంగపూర్ణ లనియుఁ దామ విదుషీమణులమనియు విఱ్ఱవీఁగు పాశ్చాత్యభామలను బరికించి డాక్టరు జె. ఎ. మోజియ నను నార్వేదేశపండితుఁడు నిజమనమునఁ గుందుచుఁ బాశ్చాత్యదేశములందు నేర్పఁబడుచున్నవిద్యలు స్త్రీలకు నుపకరింపమి స్త్రీలు స్త్రీత్వమును బోఁగొట్టుకొనుటవలన నచ్చటికుటుంబములు గూలి పోవుచున్నవనియుఁ దద్దేశవిశ్వవిద్యాలయములు బాలికలపాలిటి శ్మశానములే యనియు ఘోషించుచుండఁగా నిక్కడివిద్యావిధానము మనస్త్రీల కుపయోగకరముగా నున్నదనఁ గలమా? మనపాఠశాలలకును విశ్వవిద్యాలయములకు నేమి పేరిడవలెనో యది నాకుఁ బొడకట్టకున్నది. కుటుంబములు వృద్ధియగుటకు నారోగ్యము నొందుటకును సుఖజీవనము సల్పుటకును వలయువిజ్ఞానము నిచ్చువిద్యలనే స్త్రీలకు నేర్పవలెను. బాలికలు యుక్తముగాఁ జదువుటను వ్రాయుటను నంకగణితమును నేర్చినపిమ్మటఁ బూర్వులచరితములను దెలిసి తాము సద్గుణవతు లగుటకుఁ బురాణములను పాకశాస్త్రాదిగార్హ్యశాస్త్రములను, శిశుపోషణవిధానమును, స్వల్పచికిత్సలనుబోధించువిద్యలను, సంగీతము, సీవనము, చిత్రలేఖనము మొదలగుకళలను గొన్నికుటీరశిల్పములను నేర్చి పెంపొందవలెను. అంతేకాని, దాస్యమున కుపయోగించువిద్యల నభ్యసింప రాదు.

పతిదేశసతులు పాశ్చాత్యభామల పైతళుకుబెళుకులను గాంచి భ్రమయక యుక్తవిజ్ఞానయుక్త లగుచు సత్సంతానవతు లయి స్వదేశక్షేమాభివృద్ధిని జేయుదురు గాక!

---

మహాత్మ—

# తులసీదాసుఁడు.



ఈమహాత్ముఁడు హిందీభాషయందు రామాయణమును, వినయపత్త్రికను, మఱికొన్ని పొత్త్రములను రచించి ప్రసిద్ధి గనినవాఁడు. ఇతనిపొత్త్రములలోఁ బైని పేర్కొనఁబడినరెండును మిగులవన్నెఁ గాంచెను. అందు రామాయణముయొక్క ప్రసిద్ధి చెప్ప నలవిగాదు. దాని ప్రచారము దక్షిణదేశములందు నంతగాలేకున్నను, బశ్చిమోత్తరదేశములందు నత్యధికముగాఁ గలదు. ఆదేశములందుఁ దులసీరామాయణము లేని యిల్లు లే దనినచో నత్యుక్తిగాఁ జాలదు. ఆదేశవాసులకుఁ దులసీదాసరామాయణమునందుఁ గల గౌరవ మాదికవి- వాల్మీకిరామాయణమునందుఁ గాని మఱి యేరామాయణమునందుఁ గాని లేదు. పెఱరామాయణములకంటెఁ దులసీదాసరామాయణమునందు నధికతరవిషయములు గలవు. తులసీదాసుఁడు కవిమాత్రుఁడై కాఁడు. అతఁడు విపులజ్ఞానియుఁ బరమభక్తుఁడు నగును. అట్టివానిచరితము దెలియుట యుక్తము గదా. దానిని బెక్కురు వ్రాసిరి. ఒకవిషయము ననేకజనులు వ్రాయునపు డదియించుకభేదయుక్త మగుట స్వాభావికము. దాసునిచరిత మాధర్మము నతిక్రమింప లేదు. ప్రధానవిషయములందుఁ బ్రభేదము లే కుండుటవలన వానిని గైకొని తచ్చరితమును సంక్షేపముగా నిట నుడువుదును.

తులసీదాసుఁ డుత్తరదేశమునం దున్న బాందాజిల్లాలోని రాజాపురగ్రామమునందు క్రీ. శ. పదునేడవశతాబ్దముయొక్క పరభాగమున మూలానక్షత్రయుతదివసమునందుఁ నొకకులీనబ్రాహ్మణదంపతులకు జనియించెను. ఆనక్షత్రము పితృగండ మనియుఁ దనకు ముప్పు వాటిల్లు ననియు నిశ్చయించి స్వార్థపరుఁ డయినతండ్రి వాత్సల్యదూరుఁ డగుచు నాశిశువు నొకయడవియందు నొకానొక చెట్టుమొదట నుంచి వచ్చెను. ఆశిశువు క్షుధ నొంది యేడ్చుచుండఁగా నాదారిని శ్రీరామ

నామస్మరణము సేయుచు నేగుచున్న యొకానొకసన్యాసి యాయాక్రందనధ్వని విని కృపాంతరంగుఁడయి యాశిశువును గొని నిజాశ్రమమునకు వెళ్లెను; మఱియు నాశిశువునకుఁ దులసీదాసనామ మిడెను. అరక్షితులు - దైవరక్షితులు గదా!

ఆసన్యాసియొక్క లాలనపాలనములవలన నాశిశువు శుక్లపక్షసుధాకరునిమాడ్కి దినదినాభివృద్ధి నొందెను. నారదునివలన విష్ణుమాహాత్మ్యము విని విష్ణుభక్తుఁడయినప్రహ్లాదుఁడు వోలె సన్యాసివలన రామాయణకథను విని తులసీదాసుఁడు బాల్యమునందే రామభక్తుఁడయ్యెను. సన్యాసి యతనికిఁ జదువు సెప్పుటయే కాక, జ్ఞానమార్గమును భక్తిమార్గము నుపదేశించి దీనబంధుపాఠకునిపుత్రికయు, రూపవతియు, గుణవతియు నయినరత్నావళి యనుకన్యామణిని బెండిలిచేసి యొకయింటివానిని జేసెను.

తులసీదాసుఁ డొకగడియయైనను బెండ్లాము నెడఁబాయక కడుమురమముతోఁ గాలమును గడపుచుండెను. దానంజేసి రత్నావళి దనపుట్టినింటికి నొకప్పుడును వెళ్లుటకు వలను పడకుండెను. ఒకనాఁడు దాసుఁడు దాన మాడ గంగ కేగి యుండఁగా రత్నావళి సోదరుఁ డామెకడకు వచ్చి "నీ విప్పుడే బయలుదేఱి మాయింటికి రమ్ము. నీమగఁడు వచ్చు నేని నిన్ను విడువఁ" డని నచ్చఁజెప్పి యామెను వెంటఁగొని నిజనివాసమునకు నేగెను. పిమ్మట దాసుఁ డింటికి వచ్చి భార్యను గానక మిగులవ్యాకులము నొందెను. ఇరుగుపొరుగువారివలనఁ బ్రేయసియొక్క పోకడను దెలిసికొని యతఁడు గట్టియున్నతడిబట్టతోడనే యత్తవారియింటికిఁ బరుగెత్తెను. అప్పుడు రత్నావళి దనవారితో సంభాషించుచుండెను. ఆమె మగనిని గని సిగ్గును గినుకను బూని భవితవ్యమును భావింపక యిట్లనియె:—

గీ॥ నాథ! నీవు సిగ్గును విడనాడి యిట్టు
లిటకు వచ్చుట దగ వౌనె? యిట్టిమమత

దగునె? నాదుహేయం బగుతనువునందు
నిల్పు ప్రేమంబు జానకీనేతయందు
నిలుపునెడ నిహపరసౌఖ్యములు లభించు॥

ఈపలుకులు విని నంతనె యతనిప్రాక్తనవాసనాఫలముగా జ్ఞానచక్షు వున్మీలిత మయ్యెను. అతఁడు తత్క్షణమ బయలుదేవెడలి కాశిని జేరి యక్కడిసాధుజనులతోఁ గలిసి రామభజనలాలసుఁ డగుచుఁగొన్ని యేండ్లు గడపిన నతనిమనమునకుఁ దెన్నుది గలుగ లేదు. శ్రీరామదర్శనాభిలాష మాతనిమనమును బ్రతిక్షణము వేధించు చుండెను. అతఁడు ప్రతిదినము నదికాచమనముకొఱకు వెడలి శౌచము చేసికొనినపిమ్మటఁ జెంబున మిగిలినజలము నొకమఱ్ఱిచెట్టుమొదటఁ బోయుచుండు వాఁడు. ఒకనాఁ డాతఁ డట్లు నీరు పోయునంతనె యాచెట్టుమీఁదినుండి యొకబొమ్మరక్కసి దిగివచ్చి "మహాత్మా! మీరు ప్రత్యేకదినమును బోసినజలముచేత నాయాత్మ పవిత్ర మయ్యెను; నేను సంతుష్టుఁ డ నయితిని. మీరు దేని నాదేశించిన నద్దానిం జేయుదు"ననెను. అది విని "మీరు నాకు శ్రీరాముని జూపుఁ" డని దాసుఁ డనఁగా "నేను బాపాత్ముఁడను; ఆదేవదేవు నెట్లు చూపఁ గలను? కాని- యొకయుపాయ ముపదేశింతును. గంగాతీరమునందు సాధుజనులు శ్రీమద్రామాయణపఠనశ్రవణములు సలుపుచుందురు గదా. అక్కడకు నాంజనేయుఁ డొకకుంటివాని రూపున వచ్చి తచ్చరితమును వినుచుఁ బఠనానంతరము వెళ్లు చుండును. మీ రాతనిని బ్రార్థింతు రేని యతఁ డాస్వామిని జూపఁ గలఁ" డని పలికి తదనుమతిని బొంది యారక్కసి యంతర్హితుఁ డయ్యెను. దాసుఁడు ముద మొంది నిజసదనమున కేగెను. మఱునాఁడు దాసుఁడు గంగాతీరమునకు వెళ్లి చూడఁగా నచ్చోట నొకకుంటివాఁడు సాధుజనుల కొంకింతదవ్వునం గూర్చుండి శ్రీరామచరితమును వినుచుండెను. దాసుఁడు వేచి యుండి పఠనానంతరము కుంటివానిని వెంబడించి యతనిపాదములను బట్టుకొని విడువకుండ నతివినయముతోఁ బ్రార్థించెను. అప్పు డాంజనేయుఁడు ప్రసన్నుఁ డయి "కొలఁది దినములలోఁ బ్రయాగతీర్థమునందు 'కుంభ మేళా' (మకరమాసమునందు జ

కుజనులసమావేశము) యగును; అక్కడకు శ్రీరామలక్ష్మణులు వత్తురు; అప్పుడు నీ వటకు వత్తు వేని వారిని గుర్తింపఁ జేయుదు" నని చెప్పి తిరోహితుఁ డయ్యెను. దాసుఁడు ప్రయాగమునందు నాంజనేయు నికృపవలన శ్రీరామలక్ష్మణులను దర్శించి ధన్యుఁ డయ్యెను. తరువాత నతఁడు కాశికి మరలి వచ్చి రామాయణమును, వినయపత్రికను, మఱికొన్ని గ్రంథములను రచించెను. దేశోపకారకార్యములను జేసెను; ధర్మోపదేష్ట యయ్యెను. అతఁడు క్రీ.శ. ౧౬౨౩ వందు వైకుంఠమును జేరెను. అతనిగూర్చి పెక్కుగాథలు గలవు. వాని నన్నింటిని వ్రాయఁ బూనినచో నొకపెద్దపొత్త మగును.

---

# హింస.

హింస యనఁగాఁ బ్రాణులవధ. ఏప్రాణికిని జంప కుండుటయే కాక, యెట్టికష్టమును గలిగింప కుండుటయే న్యాయమును, బరమధర్మమును. ప్రాణులలో మనుష్యుఁడు జ్ఞానాధికుఁడు. మనుష్యుఁడు తన కెట్టి కష్టమును గోరఁడు. కనుకఁ దా నితరప్రాణుల కెట్టికష్టమును గలిగింప రాదు. అట్లయినను యజ్ఞములందు జీవహింస సేయ వచ్చు ననియు, యజ్ఞార్థము గానిజీవహింసఁ జేయ రా దనియు వైదికమతము సెప్పును. బలికొఱకు మాత్రమే జీవహింసఁజేయుటకు శాక్తాగమమత మంగీకరించును. ఎప్పుడును జీవుల కెట్టిబాధను గలిగింపరా దనిబౌద్ధమతమును వైష్ణవమతమును నుడువును. జంతువులనే కాక వృక్షాదులను సైతము హింసింప రా దని జైనమతము వెల్లడించును. పారసీలు దమపవిత్రాగ్నికి జంతుబలి సమర్పింప కుండుటవలన జంతువధకు జెందవస్తామతము సమ్మతింప దనుట స్పష్టము. జగదీశునకు బలిగా జంతువధ సేయుటొప్పు నని యిస్లాము మతోద్దేశము. మనుష్యులను దక్కఁ దక్కినజంతువులను వధింప వచ్చు నని క్రైస్తవమతాశయము. మనుష్యులను జంప కుండుట మాత్రము సర్వమతసమ్మతము.

మృగాదులహింసకు 'వధ' యనియు, మనుష్యహింసకు 'హత్య' యనియు, నుడువుదురు. హత్య గొప్పనేరముగా నెన్నఁబడు చున్నది. కనుకనే హత్యఁ జేయునరునకు మరణదండము విధింపఁబడును. మరణదండము చట్టములనుబట్టి యుక్తమే యయినను, లెస్సగా నాలోచించునెడ నది యయుక్తమే యగును. కావుననే మరణదండ ముండ రాదని పెక్కురుపండితులయభిప్రాయము.

ఒకఁడు వేఱొకనికి హత్య సేయుదుర్వృత్తి యాదిమకాలమునం దుండెను. కాని- యిప్పుడు జగము జ్ఞానోన్నతిని గనుటవలన నాదుర్వృత్తి ప్రాయశః లేదనియే చెప్ప నొప్పును. అట్లనుటవలన నిప్పుడు హత్యలు లేవని చెప్పుట నాయాశయము గాదు. కామినీకాంచనాసక్తచిత్తు లగుమూఢులే ప్రాయశః హత్యలను జేయువారు. విద్యాధికులలో హత్యలను జేయువారు తాత్కాలికచిత్తోద్రేకము గలవారే. అట్టి చిత్తోద్రేకము దుర్దమమే యగును. కాని- యెట్లయిన నది యడంపంబడు నేని హత్య జరుగనే జరుగదు. కనుక హంతకులసంఖ్య విద్యాధికులలో స్వల్పాతిస్వల్పము. హంతకులసంఖ్య స్వార్థపరు లగు మూఢులలోనే హెచ్చుగాఁ గాన నగుటవలన హత్యకుఁ బ్రధానకారణ మజ్ఞాన మనుటయే నిక్కువము. జనులు సుజ్ఞానవంతు లగుదు రేని, జగమునందు హత్యలు జరుగ వనిన నది యత్యుక్తి గాఁ జాలదు.

దండ మనఁగా శిక్ష; శిక్ష యనఁగా నుపదేశము. రాజు దోషికి శిక్ష విధించుట యతనికి (దోషికి) జ్ఞానము గలిగించుటకొఱకే. అంతేకాని, యతనిని బీడించుటకుఁ గాదు. దోషి రాజునకు వైరి గాఁడు గదా. రాజదండము నొంది వచ్చినవారిలో ననేకజనులు మరల నపరాధులు గా కుండుటవలన రాజదండము గుణసంస్కార మగుట ప్రత్యక్షము.

మరణదండప్రయోజనము నాలోచింతము. హంతకు నంత మొందించుటవలన హతుఁడు బ్రతుకఁడు. హంతకుఁడు మరణదండ మొంది కొన్నినిముసములలోనే మరణించుటవలనఁ దాను నిజదుర్గుణ

మును సంస్కరించు కొనుటకు వీలు గలుగదు. ఒకకంటకము నూడఁ
దీయుటకు వేఱొకకంటకము గా వలసి వచ్చునట్టు లొకహత్యకు మ
ఱొకహత్య యావశ్యక మని నుడువుట యుక్తము గాదు గదా. “రాజ
దండమునకు ‘హత్య’ యన నొప్పునా?” యని కొంద ఱడుగ వచ్చును.
మనుష్యహింసకు ‘హత్య’ యను నామము రూఢి వాచకమయి నట్లు
మన మెఱుంగుదుము. జనుని శస్త్రముచేతఁ జంపినను, విష మిచ్చి చం
పినను, గంతము నులిమి చంపినను, నీట ముంచి చంపినను, నేర మారో
పింపక చంపినను, నేరమారోపించి చంపినను, జేదు చేదే యగునట్లు-హ
త్య హత్యయే యగును. పేరును మార్చినంత మాత్రము వలన వస్తువు
మాఱునా? హంతకునకుఁ జంప కుండిన వాఁడు మఱి కొన్ని హత్యలు
సేయు నని యన రాదు. తగినంతసాక్ష్యము లేకుండుట వలన విముక్తు
లయినహంతకులు మఱి హత్యలు సేయకుండుట గ్రొత్త విషయము
గాదు. హంతకునకు మరణదండము విధించుటవలన నితరజనులు భీతిల్లి
హత్యలు సేయ కుండు రనుటకు వలను పడదు. ఎన్నియో మరణదండ
ములు విధింపంబడి యున్నను, హత్యలు జరుగుచునే యుండుటవలన మ
రణదండము హత్యజరుగకుండం జేయం జాలదు. లెస్సగా నాలోచించి
నచో మరణదండము నిష్ప్రయోజన మనియు, సంఘమునకు నష్టి గలి
గించున దనియుఁ, బాపకార్య మనియుఁదోఁపక మానదు.

పోర్చుగలు, హాలండు, నార్వే, రష్యా, ఆస్ట్రియా, స్వీడను దే
శములయొక్క చట్టములనుండి మరణదండ మంతరించెను. ఫినల్యాండు,
డెన్మార్కు, బెల్జియము, న్యూజిలాండు, దక్షిణామెరికా, మధ్యామెరి
కా, మెక్సికో దేశములయొక్క చట్టములనుండి మరణదండ మింక నంత
రింప కున్నను, వాడుకనుండి యంతరించెను. మరణదండము విధింపఁ
బడు చున్న దేశములనుండి దాని నంతరింపఁ జేయఁ బండితులు యత్నిం
చు చున్నవారు. అది కొంతకాలములో నంతరించును.

జనులకు యుక్త మగుజ్ఞానమును గలిగింపక యెన్నిదండములను
విధించు చున్నను, నేరములు జరుగక మానవు. కనుక జనులకు యుక్త

ానమును గలిగించి నేరములు లేకుండునట్లు సేయుట ప్రభువుల
ము; అందులకుఁ దోడ్పడుట ప్రజలకర్తవ్యము.

కృపాపారావారుఁ డగుభగవానుఁడు జీవహింస జగమునుండి త్వ
ంతరించునట్లు లొనర్చును గాక!

---

## ముసలిమగఁడు.

నెల్లూరి పుల్లయ్యపంతులుగారిభార్య మరణించెను. డి. ఎమ్. ఓ.
లేడీడాక్టరు, నిద్దఱు నర్సులు నన్నివిధముల చికిత్సలను జేసియు
న బ్రతికింప లేక పోయిరి. తననలుగురుపిల్లల నీలోకమునందు
హీనులుఁ గఁ జేసియు, మగనిని దుఃఖాబ్ధిని ద్రోసియు నామె
నువుగాఁ బరలోకమున కేగెను.

పుల్లయ్యపంతులు నెల్లూరి జిల్లాలోని కనిగిరి తాలూకా డిప్యూ
రు; వయస్సు నలువదియెనిమిదివత్సరములు. నెఱులు నెరసిన
ంగటి రెండుపండ్లును దక్కఁ దక్కినపండ్లన్నియు దృఢముగా
ప; బలమునందు నోపికయందును లోటు గాన రాకుండెను.

పండ్రెండుదినములు గడవక మునుపె కొందఱు పంతులుకడ
మతని నూరాఱుచుచు "అయ్యా! మీరు కచ్చేరికి వెల్లి పనిలో
ి యుండఁగాఁ బిల్లలను జూచు వా రెవరు? మీరు పనిఁ జేసి య
ంటికి వచ్చి యెవరితో మాటాడుదురు? మీసౌఖ్యమును గనుఁ
ా రెవరు? కనుక మీరు మరలఁ బెండ్లాడక తప్ప" దని నుడివిరి.
వతండు "మీపలుకు లయుక్తములు. ఛీ- ఛీ! ఈవయస్సునందు
రు పిల్ల లుండఁగా రెండవవివాహమా?" యనెను. కొన్నిమాస
గడిచినపిమ్మట జిల్లాకలక్టరు కనిగిరి వచ్చి, ఆఫీసు తనిఖీ చేసిన
ు "పంతులూ! మీ రసుస్థు లయి యున్నారు. ఇంట సౌఖ్యము
ంన్నది మీవయస్సు మీఱ లేదు. మీవయస్సునందు మా దే

శస్థలలోఁ గొందఱు ప్రథమవివాహప్రయత్నము సేయు చుందురు. కనుక మీరు నామాటను బాటించి త్వరగాఁ బెండ్లాడుఁడు. కానిచో, మీస్వాస్థ్యము సెడును; మఱి మనస్సు ప్రసన్నముగాఁ లేకుండుటవలన మీరు కర్తవ్యకార్యములను నెఱవేర్పఁ జాల'', రనెను. ఆయుపదేశము పంతులు మనమునకు యుక్త మయి నట్లు తోఁచుటవలన నతఁడు మరలఁ బెండ్లాడ నిశ్చయించి తత్ప్రయత్నము సేయఁ గడంగెను.

బందరు సుందయ్య యనునతఁడు చెన్నపట్టణము హైకోర్టునం దుద్యోగము సేయు చుండెను. ఆతనియేకపుత్త్రిక మనోరమ; వయస్సు పదునాఱేండ్లు. ఆమె స్కూలు ఫైనలు పరీక్ష యిచ్చి ఫలితమునకై ప్రతీక్షించు చుండెను. ఆమె మన ముత్సాహముతోడ, నానందముతోడ, నుత్కంఠతోడను నిండి యుండఁగా నామెవివాహసమాచారము దటుక్కునఁ బ్రకటిత మయి తన్మనమును ముకుళింపఁ జేసెను. ఆమె. వివాహ మామె కెఱుక లేకయె నిశ్చయింపం బడెను. శిక్షిత మఱి యౌవనయుతయొక్క స్వాధీనతను గొంచె మయినను గణింప కుండుట మాతాపితలధృష్టత గాదా? నెచ్చెలు లామెను గేలి సేయ సాగిరి. ఒకతె "మేజస్ట్రీటుగారిభార్యా'' యని పిలిచెను. వేఱొకతె "కొలఁది దినములలో జిల్లాకలక్టరు రాణి వగుదు'' వనెను. మఱొకతె "నీవు మగనితోఁ గూడి మోటారు కారునందు విహరించునపుడు మాబోఁటి బీదచెలులు నీకుఁ గనం బడ" రనెను. అది విని దానిచెల్లెలు "మగఁ డార్జించిన పాతిక ముప్పది వేలు చేతఁ జిక్కినతరువాత నెట్లుందువో చూడవలె" ననెను. ఇంక నొకతె "మగనిని నీచెప్పుచేతలలోఁ ద్రిప్పికొని నీవు రాణి వగుట దప్ప"- దనెను. ఇట్లు పలు వురాడు మాటలు వినఁ బడు చున్నను, మనోరమయొక్క మనమున కూఱట గలుగ దయ్యెను. దానికారణము:—"ముసలిమగఁ" డనుపదము హృదయము నందు నిలుచుటయె. ఆపదము స్వప్నప్రాసాధమును బడఁగొట్టుట వలన నాపెండిలి నెటుఁలు దప్పింప నగు ననుచింత యామెమనమున వ్యాపించెను.

వివాహదినములు సమీపించెను. క్రొత్తవస్తువులు గొనఁబడెను. నానావిధపదార్థములతో నిల్లు నిండెను. నాఁ డాదివారము. బుధవారము వరుఁడు వచ్చును; గురువారము పెండిలి యగును. కనుక మనోరమ వంత మితి మీఱెను.

నాఁటిసాయంసమయమునఁ దాను జెలికత్తె యగుపద్మావతిని జూచి వచ్చెద నని తల్లికిఁ జెప్పి మనోరమ యింటినుండి బయలుదేఱెను. మనోరమాపద్మావతులమైత్రి యత్యధికము. ఒకప్పు డీమె యామెయింటను మఱొకప్పు డామె యీమెయింట నుండు చుండుట వాడుక. కనుక మనోరమతల్లి సమ్మతించెను. మనోరమ నిజసఖీసదనమున కేగక, రాత్రి తొమ్మిదిగంటలకుఁ గలకత్తాపోవుటకొఱకు వెడలు మెయిలు ట్రెయి నెక్క రెయిల్వే స్టేషనున కేగి రెండవక్లాసు టిక్కెటుఁ గొనెను. ఆఁడువారిగదిలోఁ బ్రవేశించినచోఁ బరిచితలు గనం బడుదురని సంశయించి మగవారిగదియందె ప్రవేశించి, దైవికముగా నది జనశూన్య మయి యుండుటవలన సంతసించి యొకపడుకయందు వసించెను. రెయిలుబండి చలించునపు డొకానొకపురుషవ్యక్తి దటాలున వచ్చి యాగదియందె ప్రవేశించి రెండవపడుకపై నాసీనుఁ డయ్యెను. ఆగది యందు నొక్కస్త్రీయు నొక్కపురుషుఁడు నుండుట యొనగూడుటవలన వారిరువురిస్వేచ్ఛకు నంతరాయము వాటిల్లెను. వారిద్ఢఱును మౌనముద్రను దాల్చుటవలనఁ బురుషుఁడు గునుక సాగెను. అంత రెయిలు బండి నాయఁడుపేట స్టేషను నం దాఁగఁగా:—

పురు:—(స్త్రీనుద్దేశించి) మీ రెంత దాఁక వెళ్లెద రని నే నడుగ వచ్చునా?

స్త్రీ:—నేను బందరు వెళ్లుదును.

పురు:—ఏకాకినిగా నేగు చున్నా రే!

స్త్రీ:—ఔను- మేనమామగారియింటికి?

పురు:—నేను నెల్లూరు వెళ్లనై యున్నాను. మీ రనుగ్రహించి నన్నా స్టేషనునందు లే పెదరా?

స్త్రీ:—మీరు పండుకొందురా?

పురు:—ఔను- నన్ను లేపకున్నచోఁ దెల్లవాఱు వఱకును లేవను.

స్త్రీ:—మీనివాసస్థలము నెల్లూరా?

పురు:—కాదు- నే నాస్టేషనునందు దిగి కనిగిరి వెళ్ళవలెను. అక్కడ డివిజనలు ఆఫీసరుగా నున్నాను.

స్త్రీ:—(గుండె యదుర) మీనామము నడుగ వచ్చునా?

పురు:—నన్ను నెల్లూరిపిల్లయ్య యందురు.

స్త్రీ:—(స్వగతము) అయ్యో! ఈబడుగా నాకై యుద్దిష్టుఁ డయిన మగఁడు? (ప్రకాశముగా) మీరు చెన్నపట్టణము వచ్చి యుంటిరా?

పురు:—ఔను- కొన్నినగలు కొనుటకును, సెలవుకొఱకు రివెన్యూబోర్డుసెక్రటరీని జూచుటకును. మీనివాసము చెన్నపట్టణమా?

స్త్రీ:—ఔను- నే నక్కడ నుండి చదువు చున్నాను.

పురు:—ఓహో! చదువు చున్నారా? ఏస్కూలునందు?

స్త్రీ:—మైలాపూరు హైస్కూలునందు.

పురు:—ఏక్లాసులో?

స్త్రీ:—ఈసారియె స్కూలుఫైనలు పరీక్ష యిచ్చి యున్నాను.

పురు:—బళీ! అట్లయినచో, బందరు సుందయ్యగారి కూఁతు మనోరమను మీ రెఱింగి యుండ వలెను.

స్త్రీ:—ఎఱుంగనా? మే మిద్దఱము నొక్కవీథిని యుందుము; మఱి యైదాఱుసంవత్సరములనుండి సహపాఠినులము.

పురు:—ఆపిల్ల యెట్టిది?

స్త్రీ:—చూచుటకా?

పురు:—అన్ని విధములను.

స్త్రీ:—చూచుట కామె యందకత్తెయె.

పురు:—స్వభావము; మఱి చరితము?

స్త్రీ:—అవి మంచివె; అ వెట్లయిన నేమి? కొలఁది దినములక్రిందట నామె పెండిలి యైనది గదా?

పురు:—అయినదా? అగునా?

స్త్రీ:—రహస్యవివాహ మయినది; ప్రకటవివాహము గానోపు!

పురు:—రహస్యవివాహమా?

స్త్రీ:—ఔను- మనోరమ యాధునికయువతి. సరససల్లాపప్రియ; మఱి పురుషసంగాభిలాషిణి. ఈగుణము లిప్పుడు నిందనీయములు గావు గదా?

పురు:—ఔనౌను......చెప్పెదరా?

స్త్రీ:—ఇంక నేమి చెప్ప వలెను? ఆధునికయువకు లట్టియువతులను వెంబడింతురు. యువతులు వారికి లొంగుదురు. అది స్వాభావికమె కదా.

పురు:—(మొగమునఁ గలిగిన చెమటను రుమాలుతోఁ దుడుచుకొనుచు) ఆమెవివాహము నాతోడ నిశ్చిత మయి యున్నది.

స్త్రీ:—(త్రుల్లి పడుట నటించి) హా! ఆమెవరుఁడు మీరా? ఈపలుకులు పలికి మిక్కిలి యన్యాయ మొనర్చితిని. (అని రుమాలుతో మొగమును గప్పికొనును.)

పురు:—మీ రన్యాయము సేయ లేదు. నాకు గొప్ప యుపకారమును జేసితిరి.

స్త్రీ:—మీరు పెద్దలు. కాని—ఆమె విన్నచో—

పురు:—ఆమె యెట్లు వినును?

స్త్రీ:—మీభార్య—మీవలన—

పురు:—ఆదుశ్చరిత్రి నాభార్య యగునా? ఛీ!

స్త్రీ:—నన్ను క్షమింపవలెను.

పురు:—మీకు నాధన్యవాదములు. (అని రెయిల్వే స్టేషనునందు దిగును.)

స్త్రీ:—ఇది నెల్లూరు గాదే? ఇక్కడ దిగితి రేల?

పురు:—నేను మరలఁ జెన్నపట్టణము వెళ్లి నగలు దిరుగ నిచ్చివేసి సెలవు రద్దు చేయించుకొందును.

స్త్రీ:—మఱి పెండిలి?

పురు:—పెండిలి—పెడా కులు. (అనుచు గబగబ నిష్క్రమించెను.) మనోరమముఖము వికసించెను. ఆమె నెల్లూరు స్టేషనునందు దిగి, మఱుబండి నెక్కి చెన్నపట్టనమును జేరెను.

---

# బుద్ధోపదేశము

(గీతితతి)

శిష్యవితతియుక్తుండు శాక్యసింహస్వామి
యేగ శ్రావంతిపురి, కటం గృష్ణ యనెడి
వతని నిజసుతమృతకళేబరముం గొనుచు
నతనిదరిం జేరి యిట్లనె "యనఘ! యొక్క
పక్కికై వగచినకృపావనధి వీవు;
నాకు నీం డేకపుత్త్రుండు నవమనోజ
రూపుం డిప్పుడె మృతి నొందెం బాపం డైన
వీని బ్రతికించి నా కిచ్చి నేను బొందు
నధికదుఃఖంబుం బాపు మహానుభావ!"
అన నతం డాపడంతి బేలతన మెఱింగి
యిట్టు లనె "సాధ్వి! మృతి లేనియింటినుండి
పిడికెం డావాలు గొని రమ్ము వేగ; దాన
నేను బ్రతికింతు నీప్రియసూను నిపుడ."
అనంగ విని యామె యాపురం బంతం దిరిగి
చావు లేనియింటిని గనం జాల కపుడు
వ్యర్థయత్నయై వచ్చి బుద్ధాంఘ్రులకును
మ్రొక్క, నతం డనె "నమ్మరో! పురమునందుం
జావు లేనియింటిని గనం జాల కీవు
వచ్చితివి గద; తెలియుము ప్రాణితతికిం
జావు దప్పక కలుగును; సత్య మిది.

దానిఁ దప్పింప నెవ్వరితరము గాదు;
కాన వృథ యగుదుఃఖంబు మాని మనుము.”
అనఁగ నామెకు విజ్ఞాన మంకురింప
జినునిశిష్యయై చిత్తశాంతిని గడించె॥

---

## ఏగు ధాతువు.



తెలుఁగుపలుకులందుఁ గలయరసున్న మేఁకమెడచన్నని యిప్పటియాంధ్రనాగరకు లనుచున్నను, ఈప్రాంతమునందుఁ గలయనాగరకు లామాటలను సానునాసికములుగానె పలుకుచుండుటవలన నరసున్న యసార్థకము గాదు. ఆఁడది యనియు, కాఁగుచెట్టనియు, చేఁదయనియు, తోఁప యనియు, (లేఁతను) నేత యనియు, మేఁక యనియు, నిట్లరసున్న గల మాటలను సానునాసికములుగానె పలుకుదురు; కాని ఏగనియు, ఏగాని యనియు నిట్లరసున్న లేనిమాటలను నిరనునాసికములుగాఁ బలుకుదురు. మఱియును “ఏగు” నిరనుస్వార మయినట్లు తెయాంధ్రపదపారిజాతము, శబ్దరత్నాకరము, శబ్దార్థచంద్రికయను ప్రాచీన నిఘంటువులు దెలియం జేయు చున్నవి. ఇట్లుండఁగా నామాటనొకరిద్దఱు ప్రాచీనకవులు ప్రాసమునం దరసున్న గలమాటలతోఁ గలిపి యున్నవారు. నన్నయ్యభట్టారకుఁడు ప్రాసమునందు స్పర్శాక్షరములను వాడినప్పుడు గొన్నిచోట్లఁ బ్రాణులను మహాప్రాణులను గలిపి యుండుట సువిదితము. ఉపరికథితకవులు భట్టారకునిమతము వోలెఁ బ్రాస మించుకశ్లథముగా నుండ వచ్చుననియో, ప్రాసమునం దరసున్నగలపదముల నది లేనిపదములను గలుప వచ్చుననియో యట్లు ప్రయోగించి యుందురు. అంత మాత్రముచేత వాడుకయందును బ్రాచీననిఘంటువులందును నిర్బిందుకముగా నున్న “ఏగు” సూర్యరాయాంధ్రనిఘంటునిర్మాతలు లెస్సగా భావింపక సబిందుకముగాఁ బ్రకటించిరని నాయుద్దేశము.

---

# శ్రీదుర్గాకవచమ్.



దుర్గా మ్మమ శిరః పాతు భవానీ మే లలాటకం
కర్ణౌ మ మేశ్వరీ పాతు చండికా లోచనద్వయం
ఉమా రక్షతు మే నాసాం జిహ్వాం చ సర్వమంగళా
ఓష్ఠం కాత్యాయనీ పాతు శర్వాణీ మామ కాధరం
రుద్రాణీ పాతు దంతాళిం దాక్షాయణీ మ మ్మాననం
అపర్ణా పాతు కంఠం మే శివా వక్షస్స్థలం మమ
గిరిజా పాతు మే గర్భం మృడానీ మమ నాభికాం
అంబికా పాతు మే హస్తౌ కటిం మే పార్వతీ సతీ
ఆర్యా రక్షతు మే పృష్ఠ మూరూ హైమవతీ సదా
కామాక్షీ పాతు మే జానూ గౌరీ జంఘే చ రక్షతు
పాతు పాదౌ విశాలాక్షీ మీనాక్షీ నఖసంచయం
పాతు సర్వశరీరం మే జగన్మాతా శివాన్వితా
కాళీ రక్షతు నీరే మాం తారా రక్షతు మాం స్థలే
షోడశీ చాంతరిక్షే మాం పాత్వద్రౌ భువనేశ్వరీ
వనే మాం భైరవీ పాతు ఛిన్నమ స్తారిభీతితః
పాతు ధూమావతీ శోకా ద్బగలా మాం చ దుఃఖతః
మాతంగీ పాతు మాం ప్రేమ్ణా భూతప్రేతాదిభీతితః
కమలా పాతు మాం సర్వసంకటా త్పరమేశ్వరీ
బాలా హరతు మే సర్వదుస్స్వప్నాం శ్చ కృపామయీ
మహ్యాం పంచదశీ దేవీ మంగళాని ప్రయచ్ఛతు
శ్రీదుర్గాకవచం దివ్యం సర్వోపద్రవహారకం
రచితం కార్ష్ణచంద్రేణ విక్రమేశ్వరవర్మణా॥

ఇతి శ్రీదుర్గాకవచం సంపూర్ణమ్.

# శ్రీ యుగళపంచరత్నస్తోత్రమ్.

పద్మాననే శశాంకాస్య గౌరాంగి శ్యామసుందర
లోలాక్షి పుండరీకాక్ష నమో రాధే నమో హరే॥ ౧

జగద్ధాత్రి జగన్నాథ కృపాగారే కృపాకర
చిద్రూపే సచ్చిదానంద నమో రాధే నమో హరే॥ ౨

సురస్తుత్యే జగద్వంద్య ధృతాబ్జే మురలీధర
గోపికాగ్రణి గోపాల నమో రాధే నమో హరే॥ ౩

కృష్ణేశే రాధికాకాంత భానుజే నందనందన
భక్తావనే సుధీపాల నమో రాధే నమో హరే॥ ౪

రాసద్ధే రాసమధ్యస్థ సుభూషే ధృతకౌస్తుభ
పాపహే పాపసంహార నమో రాధే నమో హరే॥ ౫

ఇతి శ్రీవిక్రమదేవవర్మవిరచితం యుగళపంచరత్నస్తోత్రం
సంపూర్ణమ్.

శ్రీరాధాకృష్ణాభ్యాం నమః.

# కళింగదేశము.

ఆర్యులారా,

తమ దైనందినచర్యలనుగాని నిజగృహగ్రామపట్టణదేశములవివరణములనుగాని వానియందు జరగునూతనవిషయంబులనుగాని వ్రాసియుంచు నభ్యాసము భారతీయులకు లేకుండుటవలనఁ బ్రాచీనచరిత్రములనుగాని భౌగోళిక విషయములనుగాని వ్రాయఁ బూనువారికిఁ దగునాధారములు లభింపవు. అట్టి వ్రాఁతలు గొంతవఱ కక్కడక్కడ లభించు చున్నను, అవి పాక్షికములును నత్యుక్తియుక్తములునై సత్యమునకు దూరముగ నుండుటవలనఁ దత్ప్రియులు వాని నాదరింపరు.

ఇటీకఁ గవులు భూధవులను బొగడి వ్రాసినపద్దెములును గావ్యము లంకలి వర్ణనములును భూనాథు లొసంగిన దానశాసనములవ్రాఁతలును సమగ్రములు గా కుండుటవలనఁ బ్రాచీనేతిహాసములను వ్రాయ నెంచువారు వానిని జాలవఱకుఁ దమయూహములతోడనే నింపుదురు. కనుక నవి విహితదమూలకములు గాక మానవు. అట్టివానిని వ్రాయుటకంటె మానుటయే లెస్స యనునుద్దేశము గలవాఁడ నగుటవలన నే నింతదనుకఁ దల్లేఖనప్రయత్నమును జేయ నైతిని. అట్లుండ ౧౨-౪-౨౫ విశాఖపట్టణ పఠనమందిరమ్మున జరిగిన సభయందుఁ దదధిపతులును మన్మిత్రులు నగు శ్రీయుక్త భూపతిరాజు వేంకటపతిరాజు, సీ. ఐ. ఈ. గారు కళింగదేశముఁగూర్చి యొక వ్యాసమును దెలుఁగున వ్రాసి యాంధ్రవిద్యాపీఠప్రథమ సమావేశసమయమునఁ జదువ వలెనని నన్నుఁ గోరుటవలన నాయభిప్రాయమును మార్చుకొని దీనిని వ్రాయువాఁడను. ఇదియు నుపరికథితాధారములతోడను నాయూహములతోడను వ్రాయఁబడిన దగుటవలనఁ బూర్వపక్షము సేయక యుండలి సత్యలేశమునే గ్రహింపఁ బండితులు సంప్రార్థితులు. పూర్వలేఖకు లాధునికలేఖకులకొఱ కెట్టి యాధారములను వ్రాసి యిడరైరి గదా యని నొచ్చుకొనుచున్న నేను భావిలేఖకుల కొఱ కెట్టియాధారములను వ్రాసి యుంచుచుండ లేదు సుఁడీ! అన్యులలోపముల నుగ్గడించుచుఁ దాను లోపములనే చేయుచుండుట జనసామాన్యకార్యము.

భరతవర్షము ౫౬ దేశములుగ విభాగింపఁబడిన దందురు. ఆంధ్రద్విజులవివాహసమయమున నుచ్చరింపఁ బడుచున్న యంగ వంగ కళింగాది దేశములపట్టి మనకుఁ గ్రొత్తది గాదు. అది యమకానుసారముగఁ గూర్పఁబడినదే; కాని- దేశక్రమానుసారముగ నుండునది గాదు. ఇట్లు మనకు దేశములనామములు విదితము లయినను, వాని యెల్లలు మొదలగునవి యవిదితము లగుట నిశ్చయము. స్వదేశభాగోళిక విషయానభిజ్ఞుల మగుమనము పరదేశ భాగోళికవిషయాభిజ్ఞుల మని సంతసించుట శోచనీయము. అదట్లుండ నిండు. ఇపుడు కళింగమును

గూర్చి యాలోచింతము. కలిం=కలహం; గచ్ఛ తీతి=ప్రాప్నోతి యనువ్యుత్పత్తినిబట్టి కళింగదేశము పూర్వకాలమునందుఁ గలహస్థానమయి యుండిన ట్లనుమేయ మగును. అందలిజను లీర్ష్యాళువు లయి చీటికి మాటికి జగడములు సేయుచుండెఁ బోలును. అట్లయ్యును కళింగపదముయొక్క ప్రతిపదములు "దక్షః; విదగ్ధః" అనియు నుండుటవలనఁ దద్దేశజులు సమర్థులును స్వేర్వరులు నై యుండవచ్చును. ఇట్లుండ ననువు వంశజుఁ డయినబలియొక్క తృతీయనందనుఁ డయినకళింగుఁడు పరిపాలించుటవలన వానిపేరు తద్దేశమునకుఁ గలిగె నని మహాభారతాది పర్వము ౧౦౪ వ యధ్యాయమున నున్నది.

"ఆర్యావర్తః పుణ్యభూమి ర్మధ్యం వింధ్యహిమాగయోః" అను నమేరుని వచనము వలనను, "ఆసముద్రాచ్చ వై పూర్వా దాసముద్రాచ్చ పశ్చిమాత్। హిమవద్వింధ్యయోర్మధ్య మార్యావర్తం విదుర్బుధాః" అను మనువు వచనమువలన నార్యులనివాస్థానమయిన యార్యావర్తమునకుఁ బూర్వపశ్చిమదిశలయందుఁ దద్దిశాస్థితసముద్రములును, దక్షిణోత్తరదిశలయందు వింధ్యహిమవన్నగములును సీమలుగ నుండె నని తెలియును. "చాతుర్వర్ణ్యవ్యవస్థానం యస్మిన్దేశే నవిద్యతే। మ్లేచ్ఛదేశ స్స విజ్ఞేయ ఆర్యావర్త స్తతఃపరం॥" "అంగవంగకళింగేషు సౌరాష్ట్రే మగధే తథా। తీర్థయాత్రాం వినా గత్వా పున స్సంస్కార మర్హతి॥" అను వచనములవలనఁ జాతుర్వర్ణ్య వ్యవస్థ గలిగిన తమనివాస్థానమే పవిత్ర మయిన దనియుఁ దక్కిన యంగవంగకళింగాది దేశము లపవిత్రము లయిన వనియు నార్యులయుద్దేశ మగుట సుస్పష్టము.

మహాభారతారణ్యపర్వమందలి "ఏతేకళింగాః కౌంతేయ యత్ర వైతరణీ నదీ"॥అను లోమశమునివచనమువలనఁ గళింగము వైతరణీనది గలిగిన దేశ మని తెలియును. "వంగా నుత్ఖాయ తరసా నేతా నౌసాధనోద్యతాన్।నిచఖాన జయస్తంభా న్గంగాస్రోతోఽంతరేషు సః॥" "సతీర్త్వా కపిశాం సైన్యై ర్బద్ధద్విరద సేతుభిః। ఉత్కలాదర్శితపథః కళింగా

ఖీముఖో యయౌ॥" "సప్రతాపం మహేంద్రస్య మూర్ధ్ని తీక్ష్ణం న్యవేశయత్। అంకుశం ద్విరద స్యేవ యంతా గంభీరవేదినః॥" "తాంబూలీనాం దళై స్తత్ర రచితా పానభూమయః । నారికేళాసవం యోధా శ్శాత్రవం వ పపుర్యశః॥" అనురఘువంశశ్లోకములవలన వింధ్యమునకు దక్షిణమున నున్నవంగదేశమున కీవలఁ గపిశానది [మేదినీపురసమీపమునఁ గల కశాయీనది] గల దనియు దాని కీవలనున్న యుత్కలదేశమున కీవల మహేంద్రగిరితో నొప్పెడికళింగదేశము గల దనియు నందుఁ దములపుఁదోఁటలు గల వనియుఁ గొబ్బరికల్లు లభించు ననియు ను గోచరించును. మఱియును "ససాగరం సమాసాద్య గంగాయా స్సంగమే నృప। నదీశతానాం పంచానాం కృత్వా చ కేత్రి సమాప్లవం ॥ తత స్సముద్రతీరేణ జగామ వసుధాధిపః। భ్రాతృభి స్సహితో వీరః కళింగా న్ప్రతి భారత॥" అను మహాభారతారణ్యపర్వ మందలిశ్లోకద్వయమువలన గంగాసాగరసంగమమున కీవల సముద్రతీరమునఁ గళింగదేశ మున్నట్లు సూచిత మగును. "జగన్నాథపూర్వభాగా త్కృష్ణాతీరాంతరం శివే! కళింగదేశ స్సంప్రోక్తో వామమార్గ పరాయణః॥" అను నర్వాచీన తంత్రగ్రంథములలోని దగుశక్తిసంగమతంత్ర మందలిశ్లోకమువలన జగన్నాథక్షేత్రముయొక్క పూర్వభాగము మొదలు కృష్ణానదీతీరము వఱకును గళింగదేశ మయినట్లు తెలియును. కళింగదేశముయొక్క దక్షిణసీమ ద్రావిడదేశ మని కొంద అందురు. కళింగదేశము సముద్రతీరస్థ మగుట వలననే కళింగపదము సముద్ర తీరార్థమున వాడంబడి యున్నదని క్రీ॥ శ॥ ద్వితీయశతాబ్దమున నుండిన రోమకదేశవాసి- ప్లిని నుడువ సాహసించెను. ప్రతాపరుద్రదేవగజపతికిఁ బ్రతినిధిగ రాజమహేంద్రవరమున రాయరామానందుం డుండి పరిపాలించు చుండినట్లు చైతన్యచరితామృతమునందుఁ జెప్పంబడి యుండుటవలనను "గంగాగోదావర్యోర్మధ్యే కళింగదేశే" అని యుత్కలులు సంకల్పసమయమున నుచ్చరించు చుండుటవలనను గంగానది మొదలు గోదావరీనదివఱకుఁ గళింగదేశ మయినట్లు కొందఱయాశయము. ఋగ్వేదమున నుత్కలనామము లేనట్లును గళింగనామ మున్నట్లును రాజేంద్రలాల మిత్రు

నిపలుకులవలన విదిత మగును. మనము వినుచుండు దేశములపట్టి
యందు నట్లేయున్నది. పాణినిసూత్రములందును గళింగనామమే కల
దు. అయిన సుపరికథితరఘువంశశ్లోకములవలన వంగకళింగములకు
నడుమ నుత్కలదేశ ముండుట స్పష్టమగుచున్నది. అందుచేతనే కాం
బోలు మహానది మొదలు గోదావరివఱకుఁ గళింగదేశ మని మఱికొం
ద ఱనుచున్నారు. ఉపర్యుక్త ప్రమాణములనుబట్టి యాలోచింపఁగఁ
గళింగదేశసీమలను సరిగ నిర్ణయించుట సాధ్యాతీత మని తోఁపకమా
నదు. నాలుగు జిల్లాలుగ నుండి యాఱుజిల్లాలుగ మాఱినయుత్తరస
ర్కారులలో నివసించుచున్న మనకు దేశముల యెల్లలును పేళ్లు నెల్ల
ప్పుడు నొక్కఫక్కిగ నిలువకుండుట నవీనవిషయము గాదు. బాగుగ
భావించినచోఁ బ్రాచీనకాలమున గంగాసాగరసంగమమునకు దక్షిణ
మగఁ గృష్ణానదీపర్యంతమును సముద్రతీరస్థితభూభాగము కళింగదేశ
నామముతో నొప్పుచుఁ గాలవశమునఁ గలిగినమార్పులవలనఁ గ్రమ
క్రమముగ ఖండవిఖండములు గాఁగ దాని యెల్లలును మాఱుచుం
డుట యే కాక, యది దేశైకముగ నుండక దేశసమూహ మయి తు
దకుఁ దనపేరును బోఁగొట్టుకొని యున్నది.

మగధదేశీయుఁడును గుప్తవంశీయుఁడును నయిన భవదేవగు
ప్తుఁడు "త్రికళింగాధిపతి" బిరుదమును గొని యున్నట్లు క్రీ॥ శ॥ పంచ
మశతాబ్దపుశాశనములలోఁ గొన్నింటియందుఁ గనంబడుచుండుటవల
నను, ఉత్కళింగము (మీఁదికళింగము), మధ్యకళింగము (నడిమికళింగ
ము), తలకళింగము ( క్రిందికళింగము ) అను నామములవ్యవహారముువ
లనను గళింగము గొంతకాలమయినతరువాత మూఁడుభాగములు
గలదయి యుండెను. భవదేవగుప్తుఁడు సమగ్రకళింగమును శాశింప
కున్నను, గొంతభాగమును మాత్రము శాసించుచుఁ ద్రికళింగాధిపతి
బిరుదమును గ్రహించి యుండవచ్చును. బిరుదము లత్యుక్తిపూర్ణములు
గదా!

ఉత్కళింగమే యుత్కలముగాను, తలకళింగమే తెలుంగుగాను
మాఱిన దని మదీయాభిప్రాయము. నా యభిప్రాయ మగ్రాహ్యము

గా నేరదు. కాళిదాసునికాలమునకు ముందే యుత్కళింగ ముత్కల మయి యుండును. కనుకనే యాయన మధ్యకళింగమునే కళింగ మని నిశ్చయించుకొని దానికిని వంగమునకును నడుమ నుత్కల మున్నట్లు వచించెను.

త్రిలింగమధ్యస్థితకారణమువలనఁ దెలుఁగ య్యెనను నూహా భరితహృదయములందుఁ జలకళింగమే తెలుంగయ్యె నను నూహము చోటు నొందకున్నను, ఆ యూహముకంటె నా యూహమే యధికతరయుక్తి యుక్తము. చెప్పంబడుచున్న మూఁడులింగములును సృష్ట్యాదిసంభవములు గాని యేకకాలప్రతిష్ఠితములు గాని కా వనుట నిక్కము. ఆలింగములప్రతిష్ఠలకు మునుపు తన్మధ్యదేశము నామశూన్యముగ నుండె ననుట యసమంజసము. మఱి పదములు మాఱునపుడు వర్ణాగమవర్ణలోపవర్ణవ్యత్యయములు బహుళములు. కాఁబట్టి తలకళింగమే తెలుంగయ్యె ననియుఁ దెలుంగే యుచ్చారణభేదమువలనఁ దెనుంగయ్యె ననియుం దెలియం దగును.

మహాభారతశాంతిపర్వచతుర్థాధ్యాయమునందు "తతస్గకదాచిద్రాజాన స్సమాజగ్ము స్స్వయంవరే। కళింగవిషయే రాజ న్రాజ్ఞ శ్చిత్రాంగదస్య చ। శ్రీమద్రాజపురం నామ నగరం తత్ర భారత॥" అని యుండుటవలనఁ గళింగదేశపురాజధాని రాజపురమయినట్లు విశదమగును. ఆ రాజపురమే "యాజపురము" లేక "జాజ్‌పూ" రని తోఁచెడిని. అయినను క్రీ॥ శ॥ ౪౭౭-౫౨౬ లోఁ బ్రజాపాలన మొనరించిన కేసరివంశీయ యయాతికేసరి శ్రీజగన్నాథస్వామి నిర్మాణప్రతిష్ఠలును, భువనేశ్వరాలయమునకుఁ బునాది వేయించుటయును, కాన్యకుబ్జమునుండి పదివేలబ్రాహ్మణులను రప్పించి వైతరణీనదీతీరస్థలమును దనకు రాజధానియు నయిన "జాజపూరు" నందలి "దశాశ్వమేధఘట్టము" న నొక గొప్పయజ్ఞమును నిర్వర్తించినట్లు దేశచరిత్రమున నుండుటవలనఁ దద్యజనకారణమునం జేసి యారాజధాని 'యాజపుర' మయి యిపుడు "జాజ్‌పూ" రని వాడంబడు చున్న దని కొంద ఱందురు. ఉత్కళిఁ

గాదేశజు లయిన "ఘూడుఆ" (ఆరణ్యక) బ్రాహ్మణులు యజనయాజనముల నెఱుంగమిఁ గాన్యకుబ్జబ్రాహ్మణులను రాపించుట జరిగి యుండఁ బోలును. కళింగదేశము మూఁడుభాగము లయినపిమ్మట నుత్కళింగముయొక్క రాజధాని జాజ్పూరును, మధ్యకళింకముయొక్క రాజధాని గంజాముజిల్లాలో సముద్రతీరమున నున్న కళింగపట్టణమును, తలకళింగముయొక్క రాజధాని రాజమహేంద్రవరము నయి యుండెను.

సింహభూమిమండలమునఁ బ్రవహించుచున్న సువర్ణరేఖానదీతీరమునందు నుండిన "కర్ణసువర్ణ" మనుపురము కొంతకాల ముత్కలదేశమునకు రాజధానిగ నుండెను. అది యిప్పుడు నామమాత్రావశిష్టమయినది. కామార్ణవ- ఇంద్రవర్మ క్రీ॥ శ॥ సప్తమశతాబ్దమున ముఖలింగమును రాజధానిగఁ జేసికొని పరిపాలించుటవలనను పిమ్మట వచ్చిన గంగావంశాధిపతులు భువనేశ్వరమునందుం బలె దానియందుం బెక్కు శివాలయములను నిర్మించి దానినే రాజధానిగ నంగీకరించుటవలనను ముఖలింగము లేక దానికి దక్షిణమున రమారమి రెండుమైళ్లదవ్వున నున్న నగరకటకము కొంతకాలము మధ్యకళింగమునకు రాజధానిగ నుండెను. ముఖలింగగ్రామము శివక్షేత్రమగుటవలన నగరకటకమునందె రాజభవన ముండె నని తలంచుట సమంజసము. శిలావంశమువారు మధ్యకళింగమునం గొంతకాల మాధిపత్యముం జేసిరి. అయినను వారు గంగావంశజులతో నెయ్యము నెఱపుచు సామంతరాజు లయి యున్నట్లు తోఁచెడిని. తలకళింగరాజధానులు మాఱుచుండె ననువృత్తాంతము మనకు నూతనము గాదు.

క్రీ॥ శ॥ ౬౫౭ లో లలాటకేసరి లేక అలాబుకేసరి భువనేశ్వరాలయనిర్మాణకార్యమును బూర్ణము గావించుటయే కాక, భువనేశ్వరమును నిజరాజధానిగఁ జేసికొనెను. క్రీ॥ శ॥ ౯౪౧-౫౩ నడుమ నృపకేసరి కటకపురమును నిర్మించెను. క్రీ॥ శ॥ ౧౦౩౪-౫౦ నడుమ మత్స్యకేసరి జగన్నాథక్షేత్రసమీపమున నున్న "అఠరనళా" అను పదునెనిమిది నాళములు గల సేతువును గట్టించెను. క్రీ॥ శ॥ ౧౧౭౫-౧౨౦౨ నడుమ ననంగభీమదేవుఁడు నిజరాజ్యమును గంగానదిమొదలు గోదావ

రివఱకును బంగాళాఖాతము మొదలు సోనపురమువఱకును వ్యాపింపం జేసి, కటకమునఁ గోటను గట్టించి, యిప్పటిజగన్నాథాలయమును నిర్మించి, యనేక సేతుసరోవరాదులను జేయించి, పెక్కుగ్రామములను బ్రాహ్మణుల కొసంగి, క్రొత్తనాణెములను వెలయించి, "వీరశ్రీగజపతి గౌడేశ్వరనవకోటికర్ణాటోత్కలవరగ్గేశ్వరాది బిరుదములను దాల్చెను. క్రీ॥శ॥ ౧౨౦౪-౩౧ నడుమఁ బరిపాలించినతృతీయానంగభీమదేవుఁడు సైతము "త్రికళింగాధినాథ" బిరుదమ్మును దాల్చెను. క్రీ॥ శ॥ ౧౨౩౧-౫౭ నడుమఁ బరిపాలించిననరసింహదేవుఁను "ఉత్కలకళింగసామ్రాట్" ట్టనుబిరుదమును గ్రహించెను. క్రీ॥ శ॥ ౧౨౭౧ లో బరిపాలన మారంభించినట్టియు మొదటినరసింహదేవునకుఁ బౌత్రుఁ డయినట్టియు ద్వితీయనరసింహదేవుఁడే గంగావంశమువారిలో "గజపతి" బిరుదమును మొదటఁ గొనినవాఁడు. ఉత్కలదేశము గజసంకుల మగుటవలన నతఁడు "గజపతి" బిరుదమును గొని యుండును. క్రీ॥ శ॥ ౧౪౭౯-౧౫౦౪ నడుమనున్నపురుషోత్తమదేవుఁడు దండయాత్ర వెడలి, కాంచీపురాధీశు నోడించి, యాతనికూఁతు రయిన పద్మావతిని బెండ్లాడెను. మఱియు నితఁడు వీరశ్రీగజపతి గౌడేశ్వర నవకోటికర్ణాటకలబర్గేశ్వరాది బిరుదములను బొందెను. క్రీ॥ శ॥ ౧౫౦౪-౩౨ నడుమఁ బరిపాలించినప్రతాపరుద్రదేవుఁడు కృష్ణదేవరాయలకు నోడి తనకూఁతు నతని కిచ్చెను. ఇతనికాలముననే శ్రీమచ్చైతన్యస్వామివారు పురుషోత్తమక్షేత్రమునకు విచ్చేయుటయుఁ దద్దేశమున వైష్ణవధర్మము ప్రబలుటయు జరిగెను.

ప్రతాపరుద్రదేవునికొడు కయినవీరభద్రదేవునిసోదరి ననఁగఁ బ్రతాపరుద్రదేవునికూఁతును గొండవీటిలోని కేతవరదుర్గాధీశుఁడును బూసపాటి తమ్మరాజు తనయుఁడు నయిన రాచిరాజు పెండ్లాడి నట్లు కవిజీవితముల ౫౮౪ వ పుటయందు. ముద్రింపంబడి నిదర్శనముకొఱకుఁ గృష్ణవిజయములోని "నవభారతాఖ్యాన" మను సీసపద్య మియ్యంబడి యున్నది. "కటకేశ్వరునిచేతఁ గని కేతవరమాత్మపురముగఁ నేలె నేభూవిభుం" డను నాసీసముయొక్క రెండవపాదము రాచిరాజు ప్రతాపరుద్రునివలనం గూఁతునే కాక, కేతవరమును సైతము పొందినట్లు

సూచించు చున్నది. రాచిరాజు ప్రతాపరుద్రుని బరాజితునిగఁ జేసి నట్లా పద్యమునం గనంబడదు. అయినను గజపతులను జయించి వారి 'గజపతి' బిరుదమును బూసపాటివా రొందినట్లు కృష్ణవిజయమునఁ గల దని మన్త్రిత్రులలో నొకరు నాకుం జెప్పిరి. నే నెంత ప్రయత్నించినను నా కాపొత్తము లభింపలేదు. ప్రతాపరుద్రదేవుఁడు కృష్ణదేవరాయుల కు మాత్రి మోడి తనకూఁతు నతని కిచ్చినట్టు ఉత్కలదేశచరిత్రము వలన గోచరించును. అంతేకాని, యతనికి వేఱొకకూఁతు రునట్లుగా ని యామెను కేతవరసహితగ రాచిరాజు నకిచ్చినట్లుగాని యందు లేదు. మఱి రాచిరాజు నామముగాని కేతవరనామముగాని యందుఁ గనంబ డదు. అంతేకాక, వీరభద్రనామధేయుఁడు గజపతిరాజులలో నెవ్వండు ను లేఁడు. భంజవంశజులలో మాత్రము వీరభద్రభంజనాముఁ డొకఁడుం డెను. కనుకఁ గవిజీవితప్రోక్తసమాచారము విచారణీయము. జేతలు దమచేత జయింపం బడిన వారిని దాము జయించి యున్నట్లు సూచిం చుబిరుదనామములను ధరించుట స్వాభావికము; పరాజితులబిరుదనా మములనే తాము ధరించుట యస్వాభావికము. కాన గజపతులను జ యించి పూసపాటివారు "గజపతి" బిరుదమును జేకొని రను సమాచా రము చింతనీయము. మాధవవర్మ విశాఖపట్టణమండలమునకు వచ్చి కుమిలిని భోగాపురమును షేర్మహమ్మదుఖానునివలనఁ గౌలునకుఁ గొ నినట్లును, క్రీ॥ శ॥ ౧౬౯౦ లో సీతారామరాజు పర్లాకిమిడి గజపతి తో మైత్రిని సలిపినట్లును, క్రీ॥ శ॥ ౧౭౧౩ లో నిప్పటివిజయనగర దు ర్గమును నిర్మించి యిక్కడకుఁ బొట్నూరునుండి రాజధానిని మార్చిన విజయరామరాజు క్రీ॥శ॥ ౧౭౭౧లోఁ బర్లాకిమిడిలోని హీరమండలము హుండాను బ్రతారణముచేతను బలవంతముచేతను గ్రహించినట్లును కార్మెయికలు విశాఖపట్టణమండలపు మాన్యూయలునందుఁ గలదు. గజ పతుల ప్రభ యుత్కలదేశమునం బ్రబలినట్లు పూసపాటివారిప్రభ వి శాఖపట్టణమండలమున క్రీ॥శ॥ పదునెనిమిదవ శతాబ్దమునం బ్రబలెను. అప్పుడు వారు "గజపతి" "కళింగాధిపతి" యను రెండుబిరుదులను సై తము చేకొని యుందురు. తలకళింగాధిపతులచరిత్రములను నాకంటె మ

చాళుక్యరాజులు తెలుగు వారలని సాధించుటకై కెలుగులోని ఏమ్మనకు నవుమలు కడను నీతి నిట ముడువను.

కళింగరాజయినచిత్రాంగదునికూఁతును దుర్యోధనుఁడు పెండ్లాడినట్లు మహాభారతశాంతిపర్వమున నున్నను, మీఁది నుదాహృతమయిన "అంగవంగ కళింగేషు" అను శ్లోకమునుబట్టి కళింగదేశ మపవిత్రమయినదనియు, నందలి యాదిమవాసులు పతితతుల్యులుగను మ్లేచ్ఛులుగ నెన్నంబడు చుండిరనియుఁ దోఁపక మానదు. అట్టి యాదిమవాసులలో నోఢ్రు లను నొక తెగవా రిప్పటికిని గలరు. వారు తెల్లని గలిగి కృషికులునుశూద్రులు నై సర్వవిధములఁ దెలగాలను బోలి యుందురు. "శనైకస్తు క్రియాలోపా దిమాః క్షత్రియ జాతయః । వృషలత్వం గతా లోకే బ్రాహ్మణాదర్శనేన చ॥ పౌండ్రకాశ్చౌడ్రద్రవిడాః కాంభోజా యవనా శ్శకాః। పారదాః పహ్లవా శ్చీనాః కిరాతా దరదాః ఖశాః॥" అను మనుస్మృతి దశమాధ్యాయ మందలి శ్లోకద్వయమునుబట్టి యోఢ్రులు పతితక్షత్రియు లయి యనార్యులలోఁ జేరినట్లు కనంబడును. "తథాఢ్రాన్ ద్రావిడా న్పాండ్రాం శ్చోలాం శ్చైవ సకేరళాన్॥" అని రామాయణమ్మందును, "పాడ్యాం శ్చ ద్రవిడాం శ్చైవ సహితాం శ్చోడ్రకేరళైః॥" అని మహాభారతమందును వా రుగ్గడింపంబడి యున్నారు. వా రుత్కళింగములోని "ఖాద్రా" ప్రదేశమున వసించుటవలనఁ దత్ప్రదేశము "ఓఢ్రదేశ" మయి, సామాన్యజనవ్యవహారమున "ఒడిశా" యయి, ఆంగ్లోచ్చారణప్రభావమున నిపుడు "ఒరిస్సా" యయినది. ఓఢ్రులనుబట్టి యోఢ్రదేశ మేర్పడినట్లే తెలగాలను బట్టి తెలగనా డేర్పడెను. ఓఢ్రరాజు గజదంతములను పాండవులకు నర్పించినట్లు మహాభారతసభాపర్వమున నుండుటవలన నోఢ్రులలో రాజమంత్రాదు లుండి తమచిన్నప్రదేశమును దా మేలుకొను చుండి రని తెలియును. "శవఆభీరచండాలశబరద్రవిడోఢ్రకాః । హీనా వనేచరాణాం చ భాషా స్పష్టప్రకీర్తితాః॥" అనుభరతమునివచనమువలన నోఢ్రులభాష సవర మొదలగు బాసలను బోలి నీచముగ నెన్నంబడుచుండె ననుట సుస్పష్టము. ఆర్యసంస్కారముచేత నది సంస్కరింపఁబడి యుత్కలనామ

ముం బడసి సభ్యతను గాంచెను. ఇపుడు సింహభూమి యని పిలువఁబడు మండలము పూర్వము "హరభంగి" మని వాడంబడు చుండెను. అందు నివసించుచున్న "భూమియాఁ" లేక "భూయాఁ" యనువార్లే యందలి యాదిమజాతివారు. వారు జన్నిదమును దాల్తురు. భూమియాఁపదము నకు భూమి గలవా రని యర్థము. ఇప్పటిసింహావంశక్షత్రియులు భూమియాఁలను జయించి వారి స్వత్వమును నశింపం జేయుటయే కాక, తత్ప్రదేశనామమును సింహభూమిగ మార్చిరి. మఱి భూమియాఁలను హీనులుగ గణించిరి. జేతలచేతలను బరాజితులదుర్గతులను వర్ణింప నక్కఱ లేదు గదా. మీఁదఁ బేర్కొనంబడినమోదుప్రిలు, తెలగాలు, భూమియాఁలు గాక, కోలో, ఖారియా, పురాణో, భూమిజో, పారోజా (పర్జా). సాంతాళో, కొంధో లేక కోదు, కోయ, గొండో, ఘాసియా, కొండోరా, కెవుటో, జాలరి, కొదోళో, ఘుఘురియా, చోమారో, డోమొ, పాణో (పాండ్రః), బౌరి, బాఖుడి, సవర, బగతా మొదలగుజాతిజులు కళింగదేశాదిమవాసులు. వీరిలోఁ బెక్కుతెగలవా రిప్పటికిని బ్రాహ్మణుల నపేక్షింపక తమవివాహాదికృత్యములను దమవారిచేతనే చేయింతురు.

ఆదిని కళింగదేశమునందు ధర్మము లెట్లుండెనో, జనులమతము లెవ్వియో యేయే దేవత లారాధింపంబడు చుండిరో నిశ్చయింపం జాలము. అయినను జనులు సేయుపూజలు జీవహింసతోఁ గూడి యుండెననియు నందు "కొంధో లేక కోదు" మొదలయినవారు నరబలులను సైత మిచ్చు చుండి రనియు నన నొప్పును. క్రీ॥ పూ॥ తృతీయ శతాబ్దము మొదలు క్రీ॥ శ॥ నవమశతాబ్దము వఱకును బౌద్ధమతమును గొంచె మించు మించుగ బౌద్ధమతముతోడనే కొంతవఱకు జైనమతము నటుతరువాత శైవము నటుపిమ్మట వైష్ణవమును గళింగదేశమున వ్యాపించెను. ఇన్ని సాధుమతములు వ్యాపించిన నేతద్దేశమున నిప్పటికిని జంతుహింస నిలిచి యుండుట యత్యంతశోచనీయము.

కళింగదేశమునకు నార్యులు వచ్చినకాలమును నిర్ణయించుట కెట్టియాధారములును లేవు. క్రీ॥ పూ॥ బహుశతాబ్దములకు ముందే యార్యాగమన మయి యుండును. యయాతి కేసరి రప్పించుటవలన బ్రాహ్మణులు కన్యాకుబ్జదేశమునుండి యుత్కళింగమునకు వచ్చినట్లు మీఁద సుడువంబడినది. ఆర్యులు మగధమునుండి యక్కడకు వచ్చినట్లు కొమర్రాజు వేంకటలక్ష్మణరావు వ్రాసెను. ఇట్లు దేశభేదము సూచిత మగు చుండుటవలన నార్యులుత్తరదిశనుండి యుత్కళింగమునకు వచ్చి రనిన నిర్వివాదముగ నుండును. వారోడ్రులను బరాజితులుగం జేసి తద్దేశనామము నయిన నిలుపం దలంపక నిజార్జితదేశమునకు నుత్కల మనుపే రిడిరి. అయిన నోడ్రనామము విడువ కుండుటం గాఁబోలు దాని నోఢ్రముగ సవరించిరి. ఇపు డుత్కళమునకు నోఢ్రము పర్యాయ పద మయినది. పరాజితు లయినయోడ్రులు నీచు లయిరి. ఆర్యులు మధ్యరాష్ట్రము నిండినపిమ్మట దాని కంటి యుండినయాంధ్రదేశము న వ్యాపించిరి. ఆంధ్రదేశము మధ్యరాష్ట్రమును బశ్చిమరాష్ట్రము నొరసి యుండినట్లు తోఁచెడిని. అద్దేశము సైతము వింధ్యదక్షిణ మగుట వలన నదియు నార్యప్రవేశపూర్వ మనార్యజనాకీర్ణముగ నుండె ననుట నిస్సందేహము. అందలి జనులు సైతము సమర్థులుగను నేర్పరులుగ నుండిరి. దాని స్థానము సరిగఁ జెప్పుటకు వీలులేదు. దాని యెల్లలును గళింగసీమలు వోలె నానావిధములుగ మాఱుచుండెను. ఆంధ్రరాష్ట్రప్రభువులశాసనములు ప్రాకృతభాషయందే యుండుటవలనను, ఆంధ్రకవుల చరిత్రము ప్రథమభాగము ౨౬౭వ పుటయందు "భారతికళానిధి" లోని దని యుదహరింపం బడినయాంధ్రభాగములలోఁ దెలుంగు చేరి యుండక పోవుటవలనను, ఆంధ్రము దెలుంగు గా దని నిశ్చయింపం దగును. ఆంధ్రాగతులయినయార్యులు తలకళింగమున వ్యాపించి, దానిని స్వీయదేశముతోఁ గలిపికొని యుందురు. అప్పటినుండి తెలుంగు బాస ప్రాకృతసమశబ్దములను బ్రాకృతభవశబ్దములను గలిగి వృద్ధి నొందినది. మఱియు నాంధ్రమును దెలుంగు నుత్కలౌఢ్రములు వోలెఁ బర్యాయపదములుగ వాడంబడుచున్నవి. పూర్వ మొకప్పు డొండలు

హెచ్చుగ నగ్గిపిడుగులు పడుటవలన నగ్నిమిత్రునికన్నులు పోవఁగ నతఁడు దనకన్నులకొఱకు సూర్యునిఁ బ్రార్థింప నతఁడు ప్రసన్నుఁడయి యగ్నిమిత్రున కొకభాష నొసంగ దానిమహిమ వలనఁ బోయి నకన్నులు మరల రాఁగ నంధతను బాపుటంజేసి యాభాష యాంధ్ర నామము గల దయినట్లు "భాషాముకుర" మను నాంధ్రగ్రంథమందలి రెండుపద్దెము లాంధ్రకవులచరిత్రము- ప్రథమభాగము- ౧౯-౨౦ పుటలలో నున్నవి. ఈయసందర్భపురాణగాథను నమ్మనటకంటె నానార్థ రత్నమాలయందు "అకారో బ్రహ్మవిష్ణ్వీశకమఠే ష్వంగణే రణే" అని యుండుటవలన "అం=యుద్ధమును; ధ్రః=ధరించునది యగుటంజేసి అంధ్రమై, అంధ్రమే స్వార్థమునందు ఆంధ్ర మయ్యె" నని తలంచుట సమంజసము. ఆంధ్రులశౌర్య మితిహాసప్రసిద్ధ మగుటవలన మీఁది నిర్వచనము యుక్తముగ నుండును.

అటుతరువాత నార్యు లుత్కలమునుండి దక్షిణమునకును దలకళింగమునుండి యుత్తరమునకును గ్రమక్రమముగ వ్యాపించి మధ్యకళింగము నాక్రమించిరి. ఇట్లార్యులు ప్రవేశించినపిమ్మటను, జగన్నాథము, భువనేశ్వరము, మహేంద్రగిరిస్థితగోకర్ణము, ముఖలింగము, శ్రీకూర్మము, సింహాచలము, ద్రాక్షారామము, కోటిఫలి, మంగళగిరి మొదలగు హరిహరక్షేత్రములు వెలసినతరువాతను గళింగము పుణ్య దేశములలో నొకటి యైనది. ఉత్కలదేశమునందు వాడంబడు "ఋషికుల్యాన మాసాద్య యావద్వైతరణీ నదీ। స ఏవ హ్యుత్కలో దేశః పుణ్యక్షేత్రం ప్రచక్షతే॥" అను శ్లోక మందులకు నిదర్శనము. ఋషికుల్యానది గంజామువద్ద నున్నది.

"కాళింజి" లేక "కాళింగు" లనునొక తెగవారును, కళింగకోమట్లను మఱొక తెగవారును మధ్యకళింగమునఁ గలరు. వీ రాదినుండియు సభ్యతను గన్నవారు; మఱి యజ్ఞోపవితముం దాల్చువారు. అందు మొదటి తెగవారు ముఖలింగేశ్వరుని సింహాచలసమీపమున నున్నమాధవస్వామిని బూజించు చున్నారు. ఆలోచింపఁగ నార్యులు మధ్యకళిం

గమున వ్యాపించువఱకును వా రచ్చోట బ్రాహ్మణస్థానీయులుగ నుండిరి; రెండవ తెగవా రప్పుడు నిప్పుడును వైశ్యకృత్యమును జేయువారు.

ఇఁక మీకు విసుగు గలిగింపను. నావ్యానము నోపికతో మీరు వినుటవలన నేను ధన్యుండను. ఇంతటితో విరమించుచు నా వచనములను సమబుద్ధితో లెస్సగ మననము సేయ మిమ్ముఁ గోరువాఁడను.

---

శ్రీ శారదా మహిళా ముద్రణాలయము, విశాఖపట్నం.

# తప్పొప్పుల పట్టీ.



| పుట. | బంతి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 1 | 9 | శార్వరీ | శర్వరీ |
| 12 | 6 | ధూర్త్తుడా | ధూర్త్తుఁడా |
| 13 | 11 | గోరిట | గోరఁట |
| 13 | 14 | షుడొకడెక్కి | షుఁడొకఁడెక్కి |
| 13 | 16 | దొడగెన్ | దొడఁగెన్ |
| 13 | 20 | నందుగాదె | నందుఁగాదె |
| 14 | 1 | సృజించె | సృజించె |
| 14 | 2 | విజ్ఞప్తిగక | విజ్ఞప్తీఁగక |
| 14 | 7 | వెతలుఁగను | వెతలుగను |
| 14 | 9 | యలరదగనె | యలరఁదగునె |
| 17 | 13 | వికృతసుమ్మర్త్యులార! | కపితసూ యార్త్యులార! |
| 18 | 8 | నది | నవి |
| 24 | 1 | భూసమాను | భాసమాను |
| 25 | 23 | భక్షహీన | బక్షహీన |
| 26 | 16 | బోలెగెంపు | బోలి కెంపు |
| 26 | 20 | ,, | ,, |
| 49 | 6 | కోళాకృతి | కోలాకృతి |
| 51 | 5 | దాయినై | దాయిన్యై |
| 54 | 10 | రాలేదు | రాలెదు |
| 54 | 19 | యుగళంబు | యుగళంబుఁ |
| 60 | 19 | కంపె | కంటె |
| 63 | 11 | మవుగ యరయ | రూపి వరయ |
| 65 | 5 | భీతిం | భీతిఁ |
| 68 | 8 | జేయివలె | జేయవలె |

| పుట. | బంతి, | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 69 | 8 | నిద్యంమ్మ్మ | నింద్యమ్మ్మ |
| 71 | 13 | బరీక్షించు | బరీక్షించు |
| 72 | 10 | సృష్టింవంబడు | సృష్టింపంబడు |
| 73 | 3 | గృహా | గుహా. |
| 73 | 11 | జగదాధిపతి | జగ్దదధిపతి |
| 73 | 17 | త్మ్నకము | త్మ్మకము |
| 76 | 2 | నద్భ పేత్ | నభ వేత్ |
| 76 | 22 | నుదహరించిన. . .లనుట్టి | నుదాహరించిన....లనుబట్టి |
| 78 | 6 | దగదను | దగవను |
| 82 | 13 | ధనవంతు | ధనవంతులు |
| 82 | 17 | ధనమనుండి | ధనమునుండి |
| 84 | 20 | మైతిరేయ | మైతరేయము |
| 86 | 25 | పురూరవచక్రివర్తి | పురూరవశ్చక్రివర్తి |
| 89 | 14 | యదార్థము | యథార్థము |
| 90 | 9 | శ్రీ॥ శ | క్రీ॥ శ॥ |
| 90 | 26 | నావాబా | నవాబా |
| 99 | 19 | ఉదహారించి | ఉదాహరించి |
| 100 | 14 | సహాయ్యా | సాహాయ్యా |
| 101 | 18 | భూణాము | భూషణాము |
| 102 | 7 | ర్శనము గ్రంథ | ర్శనగ్రంథ |
| 103 | 8 | నాయకా | నాయికా |
| 105 | 16 | దడుముదము | దడవుదము |
| 110 | 5 | సేనానివరుడు | సేనాసివరుడు |
| 112 | 24 | వాదమునిట | వాదమిట |
| 113 | 20 | సకలలోప | సకలోప |
| 118 | 23 | ప్రభుసమ్మత | ప్రభుసమ్మిత |
| 120 | 3 | మునకు | మునకు |

| పుట. | బంతి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 124 | 1 | యజము | యజ్ఞము |
| 124 | 6 | దేవులకు | దేవతలకు |
| 126 | 26 | నర్వేశ్వరు | సర్వేశ్వరు |
| 127 | 16 | హంతకునకు | హంతకు |
| 129 | 10 | గాఁనిట | గానిట |
| 129 | 15 | వదులు | వదలు |
| 129 | 28 | పాప | బాప |
| 131 | 9 | నొసర్ప | నొవర్ప |
| 132 | 3 | నిమయ | నియమ |
| 133 | 5 | ముదహా | ముదాహా |
| 135 | 12 | దన్య్యానాధి | దన్న్యాన్యాసతాధి |
| 137 | 23 | నమ్నెడు | నమ్మెడు |
| 140 | 8 | పూర్ణలని | పూర్ణములని |
| 142 | 20 | వ్యాకులము | వ్యాకులత |
| 145 | 14, 15, 25, 26 | హంతకు | ఘాతుకు |
| 147 | 9 | హీనులుఁగ | హీనులుగ |
| 152 | 8 | వతని | వనిత |
| 157 | 10 | హీమాంగ | హిమాంగ |
| 163 | 7 | రునట్లు | రున్నట్లు |
| 164 | 13 | ద్వఁయను | ద్వయమును |
| 166 | 22 | యుదహా | యుదాహా |
| 167 | 4 | బాపుట | బాయుట |